# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

*

మే 1977

సంపుటము : 54 సంచిక : 5

విడిప్రతిక వెల రూపాయిన్నర

# విషయానుక్రమణిక

## మే 1977

# వైర భక్తి

జమదగ్ని

(గతసంచిక తరువాయి)

## చతుర్థాశ్వాసము

౪

పుట్టును చీకటైన, నడుమ చుక్కల జేడును సూర్యవహ్నులన్
బెట్టిన కోట్ల సంఖ్యలను నిర్మి రచింగ, వెలుంగు మంచురా
మిట్టి యనుంగు కూతు, సహామేవ యటంచును భక్తి గొల్చు రా
పట్టి, వెలింగె నట్టులనె, ప్రార్థనకున్ బరమార్థమందు లై॥

చుట్టును చేరి నెచ్చెలులు, సుందరికిన్ గుసుమాక్షతాదులన్
బెట్టిన స్వర్ణపాత్రముల వేళను బట్టి యొసంగుచుండఁ, జే
పట్టిన దీక్షసాంతమగు పద్ధతి, సర్వవిధోపచారముల్
నెట్టన నిర్వహించి, కరనీరజముల్ ముకుళింపఁజేయుచున్॥

అంబా! శాంభవి! శంభు పత్నివగు లక్ష్యంబంద నీవెంత తీ
వ్రంబౌ దీర్ఘతపం బొనర్చితి వపర్ణా! మత్తపంబందు లే
శంబో యంతకుఁ దక్కువో? యయిన వాత్సల్య ప్రపూర్ణాత్మవై
జంబూ పక్వ ఫలాభి రాముఁడగు కృష్ణస్వామినిన్ గూర్చవే!

దుర్గములన్ దరించుటకు దుర్గవు నీవె శరణ్యవంబ! యీ
సర్గ మిదెల్ల నీ దయను సాగును, నిన్ను స్మరించి నంతనే
నర్మిక వత్సలత్వమున స్వాదుపయస్సుల కామదోగ్ధ్రివై
స్వర్గ మొసర్చు విభువిని, స్వామినిఁజేర నను గ్రహింపవే!

ప్రకృతి నెఱుంగకుండ నమబట్ట నెందరు చెట్ట బుద్ధితో
వికృతులు, హద్దునన్ నిలిపి వీరిని, నీకును నా కభిన్న మౌ
వికర మెఱుంగఁజేసి దయనింపుము, త్రాగిన అమ్మ గుద్దు పో
లికఁ జననీక కాచి నిజలీల సుఖంబుల నందఁజేయుమీ!

నిర్భరభక్తి నిట్లు జననిన్ నుతియించి, తదేకతత్పరయై
గర్భగృహంబు వెల్వడిన కాలమునన్, విమలానుభావ యై
దర్భికిఁ గంటి కెదుట దర్శనమిచ్చెను, పార్శ్వమందు సం
దర్భముబట్టి సద్గురుఁడు దారత నిల్వగ శ్రీ విభుండహో!

పుట్టును చుక్కలై నడుమ సోముని పోలిక వెల్గుచున్న రా
పట్టి సరోజహస్త నిజభావము వెల్వడు వాలు కన్నులన్
మిట్టకు వేగు నాగువలె మేలిమి చూపులఁ దన్ను చూడఁ జే
పట్టి రథంబు నందునిచి భద్ర మనస్కుఁడు దారుకుం గనన్

జయజయ రుక్మిణీ హృదయ సారస విస్ఫురణైక సూర్య! ని
ర్భయముగ వేగుఁడీ యనుచుఁ బట్టున నున్న జనంబులెల్లరున్
జయజయ వాదముల్ సలుప, సాగినదా రథ మంబరంబుపై
రయమున దూకి యేగు ఖగరాజ విధంబున సర్వులుం గనన్.

నలుదెసలందు సైన్యములు నాటి యదూత్తము పోకనడ్డగో
నిలిచిన రుక్మిచైద్య్యులతనిన్ గనుముందట నాత్మకాంతతో
సలలిత భాషణంబులను సాగుట కాంచుచు, కొయ్యబొమ్మలై
నిలిచిరి, విప్పు కన్నగుచు వేరరు చూడగ ధ్యాన మగ్నమై॥

పశువులగాచు వల్లవుఁడు పార్థివ సింహ భయంకరాంగణం
బశనిగ నెంచి సాహసిక యాత్రకుఁ బూనెడటన్న బుద్ధి బా
లిశమయి పట్టి వారిపట్టు క్లీబులఁ జేసెను, కృష్ణుఁడేగినన్
విశదముగాగ పర్వమును, వెన్బడినన్ ఫలమేమి కల్గెడిన్॥

ఆగుము యాదవా! యనుచు నార్చుచు సాయుధ సైన్యమంతటిన్
ప్రోగొనరించి కొంత గొనిపోవు వృకేసరి నాపఁ బంపుచో
డేగల పోలెఁ గ్రమ్మెడి కఠింది బలంబుల వంకఁ జూచి యు
ద్వేగమునందు ప్రేయసికి వెన్ను స్పృశించుచు వెన్న దొంగయున్॥

కలభీ భూత మొనర్చు చూడుమిదె నా శస్త్రాగ్నికిన్ వచ్చు నీ
బలగం బంతటి నిర్భయాత్మవగు మో బాలా! యటంచున్ ధను
ర్వలయోద్యాంత సముచ్ఛిఖా ముఖ దహద్బాణ ప్రపంచమ్ముచేఁ
బలు మూకల్ పసలుడ్గి పల్లెనలఁ బర్వంజేయ హృష్టాత్ముఁడై॥

తత్ క్షణమందె బెంగఁగొను తన్విని గాంచుచు దానవాంతకుం
డక్షతుఁడన్న వానికయి యారట మందకు, నెంతవెడ్డ బం
ధు క్షతి కోర్చునే, తెగిన ధూర్తతఁ దానయి తెచ్చుకొనిచో
శిక్షకు జంకి వెన్దిరుగు, సిగ్గరి దూకిన బుద్ధి చెప్పెదన్॥

అడఁకు మంచు నాడు నవు, డచ్చట చైద్యుఁడు కానరామి, బి
ట్టు డరిన క్రోధమై చెదరు నగ్రబలంబుల కూడదీసి రా
పడతిని దొంగిలించి చను వ్వాఁపుఁబట్టుఁడటంచు రుక్మి వెం
బడిఁబడఁ, జూచుచుండఁగనె వానిని బద్ధు నొనర్చి కృష్ణుఁడున్॥

శితఖడ్గంబును చేతఁబూన వడలై సీమంతినీ రత్న, 'మో
నుత వీరా! హృదయేశ! నీ కయిన యన్నున్ నన్ను మన్నించి ని
ర్గత జీవుండగు నన్ను నెట్టయిన సప్రాణున్ బొనర్పంగదే!
జి తుఁడింకేమి యొనర్పుఁచో విడువు మీ! జీవ ప్రియంభావుకా!'

అనుచున్ దత్ప్రియ వేడు చుండగనె, క్రోధావేశ మొప్పన్, నవో
ఢను తోఁబుట్టువు బావతోఁ జెఱను బెట్టంజాలి తత్పంతతిన్
కనికారం బొకయింత లేక తునుకల్ గావించు నా మేనమా
మను సంహార మొనర్చితిన్, గడలు తన్మార్గాన నీ బావయున్॥

వదలుదునా' యటంచుఁ గరవాలము చేగొని ముందు కేగు త
త్పదముల కడ్డువో వెఱచి ప్రాణ విభున్ ప్రియకాంత దీనయై
క్షదలని బొమ్మగా నిలిచి కాంచుచు నుండగ కంస హంత తన్
బెదరుచుఁ జూచు బావ తల వీడక పట్టి పెనంచుచుండగన్॥

తలయును మీసముల్ గొరిగి 'తన్వికి నై విడనాడుచుంటిఁ, జె
ల్లెలని తలంపకామె పొదలించిన ప్రాణమటంచు నమ్ముచున్
గొలువుము తల్లిగా, చనుము, గొప్పకు పోకుము, దుష్ట మైత్రికిన్
బలుకుము స్వస్తి' యంచు తను బంధములన్ విదలించి పంపుచున్॥

తేఱిన ప్రాణమై నిలుచు దేవిని జూడగ నామె బాష్పవాః
పూరము లొల్కు కన్నులను పుష్కర నేత్రుని పూరుషోత్తమున్
దూరము పోవు సోదరు నధోముఖు చూడగ, నార్ద్రుఁడౌచుఁ గ
న్నీరు చెఱంగునన్ దుడిచి నెచ్చెలి నక్కున జేర్చి వెన్నుఁడున్॥

''కలఁగకు బేల, బావయికఁ గాంచును తెల్వి, శిరోజహానితోఁ
దొలఁగెను శీర్షహాని, తలదూరిన పుర్వులు పారిపోయి సొం
పుల పెదబావగా పొదలి పుత్త్రి నొసంగుచు వియ్యమందెడిన్,
కలతను వీడి నవ్వినను గాని మదాత్మకుఁ దృప్తి లే''దనన్॥

మబ్బుల మాటునం దొదిగి మాసిన సన్నని చంద్ర రేఖనా
నుబ్బిన దుఃఖ మోద ప్రథమోల్బణ మాగిన బాలమోము నం
దబ్బుర మౌచు లే నగవు నందము బిందగ సంతసించి త
బ్బిబ్బును చెందనీక సతి పెద్ద మనస్సున నుండఁ జూచుచున్

ఏమేమో సరసోక్తులన్ బలుకు, చెన్నెన్నో రసస్నిగ్ధ గా
థా మందాకిను లందు హంసగతి నందంజేయుచున్. జన్మమే
సామీ చన్య మి కొక్కఁడందివ గతిన్ సర్వస్వమర్పించుచున్
సామేనా ప్రియురాలితోఁ జనియెఁ గృష్ణస్వామి స్వగ్రామమున్॥

*                    *                    *

తునిగిన కొమ్మ తుట్టు తుద తో వడి వాడిన పూవువోలె సి
గ్గునబడ వంగు బోడితలఁ కొంచెము నెత్తక వచ్చు రుక్మిఁ గ
న్గాని శిశుపాలుఁ, 'డింతయును గొల్లఁడు చేసెనె? నాతి దొంగయై
కొనుటయె కాక యన్నని టు క్రూరతఁ జేయుటఁ జంపి తీఁనా!
ఇప్పుడు తప్పిపోయెనని యెంచకు, చైద్యుఁడు వాని నెప్పుడో
తప్పక చంపి మిత్రున కతం డొనరించిన ద్రోహమంతటిన్
గప్పు ప్రతి క్రియన్ సలుపుఁ, గామినిగూర్చి తలంపఁబోకు, నీ
కిప్పుడు చెల్లి లేదనుటయే సబ, బింతగ సాహసించునే?
మాయలమారి యాతఁడెదొ మాయను గ్రమ్మఁగఁజేసి సూర్యబిం
బాయతి విల్లు చక్రమయినట్లుగ గిర్రున త్రిప్పి త్రిప్పి, కన్
మూయుటతోనె పాఱి చనె, ముందట నిల్చిన, శీర్షకంబు నా
కాయెను కందు కంబనఁగ నాడనె యాహవభూమి నెల్లెడన్॥
విచ్చిన సేనవిన్ వెదకి వేసరి వేసరి వీటికేగితో
పిచ్చిగ నూత్న సైన్యములు వెంబడి తెత్తమటన్న బుద్ధి నం
చచ్చటికేగి కాన, కిటులౌట యెఱుంగక మోసపోయితిన్
మ్రుచ్చిలు వాని నిప్పుడిమె ముట్టిన నీ కిటు లౌట నైతునే?
అయినది యయ్యె, నిందు మన కైనది లాభమె, లోకమెల్ల రే
పయిన నెఱుంగు దొంగ యెవరన్నది, సొమ్మటనుంట, నాతఁడే
ప్రయివదు, నెల్ల వారు తమ భార్యల నాతని కందనీక హె
చ్చయిన వివేక మొప్ప శుభమందుదు రింకిట జాగరూకతన్॥
కొంచెము సాగి కాల మనుకూలత చూపిన వప్పు, డయ్యఁగ
వ్వించి పురంబు వెల్వరచి, వీఱిడి సేతకు వేయి రెట్లుగా
వించి, యణంగ మట్టి గఱపింతము, చూడిటు, చైద్యుఁడెవ్వఁడో
యెంచుము, వానికోసమయి యెత్తిన జన్మము మిత్ర శేఖరా!''

అయినను కాకపోయినను, నాతఁడటుల్ పలుకాడుచుండ, ముం
దయిన పరాభవంబు హతమారిన యట్లయి, రుక్మిచైద్యుతో
నయిన సమస్తమున్ మఱచి, యత్యధికమ్ముగ మైత్రినూనెః నే
మయినను జన్మతోఁ గలుగునట్టిది యంతము దాక నుండెడిన్॥

*                    *                    *

తల్లియుఁ దండ్రి బిడ్డ నరుదారగ కృష్ణుఁడు వచ్చి కొంచుఁబో
నుల్లము లొల్లసిల్లఁ దని వొందిరి, రుక్మియు సైన్యయుక్తుఁడై
ప్రల్లద మొప్ప వెంటఁబడు వార్తకు తల్లడ మంది వానికై
యిల్లు యమాలయంబయిన యట్లుగ నుండిరి దుఃఖమందుచున్॥

తిరుమలకేగి వచ్చెనను తీరున వచ్చిన పుత్త్రుఁ గాంచి త
త్కరుణకు ముగ్ధులౌచు బలు కానుక లిచ్చిరి మానసంబుగన్
తిరుమల యున్నదా యనినఁ, దేల్పదు పశ్చిమబుద్ధి, ద్వారకా
తిరుమల మాత్ర మున్నదని తెల్పక తప్పదు నిత్యసత్యమై॥

వలఁబడి, యెట్టి వాఁడయిన వాల్చి శిరంబును, జాట్టు నీయఁ, ద
ప్పుల సహియించు నా పురుష పుంగవుఁ డెప్పుడునుండు, వానికై
వలగొని నిర్విచారముగ స్వామిసమస్తము నీదె యంచు నీ
వలయును నాది కాదనెడు పద్ధతి, నప్పుడు శ్రేయమంద నౌ!
తొలుత నె లొంగి వర్తిలెడు నోరపు నూపె లభించుటున్నచో
వలఁబడు టేల? జుట్టొసగి భావము నెమ్మదిమీద మాఱఁ, గో

ర్యులు నెఱవేఱుచున్న వనుకొంచుఁ గ్రమమ్ముగఁ జెంతఁ జేరుచున్
నిలిచెడి సత్యవర్తుని నిర్మల చిత్తు నొనర్చు తప్పకన్॥

తల యొపఁగున్, దలంపులను దాల్చెఁడు భక్తిని, కోర్కె తీరుటన్
వలగొనుచుండు, భక్తుఁడని పల్కెరు నమ్మగ వేషభాషలన్
మెలఁగుచు వర్తకుంబలె రమేశునితో వ్యవహారమాడు, నా
తల చెడు వాని కుత్సుకను దాల్పగనీయఁడు జన్మజన్మకున్॥

వఱఁబడె రుక్మి, బద్ధుఁడయి వాల్చెను శీర్షము, జుట్టునివ్వె, నా
తలచెడు వానిబట్టి పెడదారిని బట్టి సమస్త శేషినిన్
వలగొనుబుద్ధి పుష్కకమె భ్రష్టత నందెను, బావలిద్దఱున్.
దఱలీక యేమి యౌనొ నెఱతాల్చె యెఱుంగగ నౌను సత్యమున్.

★ ★ ★

కుండిన కేగెఁ గృష్ణుఁడనుకూలవతిన్, దనయంత నీవె నా
ఘుండవు గొంచుఁబొమ్మనుచు ధూర్జటి నంపి యెడందఁవెల్గు న
క్కుండిన రాజకన్యఁ, దనకుం బ్రియ, రుక్మిణిఁ దెచ్చుపొంచె, నె
లుండియు రాఁగలం డిటకు, సుద్వహ మిచ్చట చేయుగా వలెన్॥

ఊరెల్లన్ బహుశోభలొప్పగ వసంతోత్సాహ పుల్లాత్ములై
శ్రీరంజిల్ల నలంకరించి నరనారీ వారమెల్లన్ దివా
కౌ రమ్యాకృతి పూసి కట్టితొడి చక్షుఃప్రీతి కల్పించుచున్
వారిం దోడ్కొని తేర సిద్ధమయి నిల్చెంజెల్గ హర్మ్యమ్మునన్॥

అని బలరాముఁ డందఱకు నానతియిచ్చి, పురంబు నల్దెసల్
కనుగొననేగెఁ బార్థిమను, కన్నుల కింపగునాటి వెన్నెలన్
వననిధి పొంగులెత్తుచును వారిజనేత్రు వివాహశోభ మి
న్నునబడి చూడనెంచుగతి నూత్నవిలాసము చూపె హద్దునన్॥

దివికిని వార్త చేరినది, దేవతలెల్లరు సంబరమ్ముతో
భువి కరుదెంచుచుండిరన పూర్ణసుధాంశు మయూఖమాలికల్
నవనవ శోభలన్ విరిసి నాట్యమొనర్చెను, భూనభోంతరం
బవిదిత దివ్యకాంతి మహిమాన్వితమై భువి సర్వముబ్బగన్॥

వత్తురు దేవతల్ భువికి, వారిజ నాభుని గొల్వవచ్చుచోఁ
దెత్తురు దివ్యసంపదలు, దివ్య విమానము లంబరంబు నం
దెత్తుగ నిల్చు, వారిటకు నే ప్రశను లేక దిగంగ నౌనటం
చెత్తుగ దివ్యగోపురము లెత్తిరి యూర ననంత సంఖ్యలన్॥

మతమతి చిత్రచిత్రముగ నూతన శోభల ద్వారతోరణ
ప్రతతులుగట్టి, పెండ్లికని వచ్చు జనంబుల కాశ్రయమ్ముగా
ప్రతిదిశ పెద్ద పందిళులు పాకలు వేసిరి పచ్చనాకులన్;
సతిపతి యేకమై నటులు స్తంభములన్నిట రంభలొప్పగన్॥

దిగువను నేలఁ దారకలె తీరిన యట్లుగు రంగవల్లికల్
మిగిలి వెలుంగ, భూజముల మేలి సుమంబులు పందిరిగుత్తులై
యెగువ వితాన పంక్తులను హేలగ ప్రేలగ, భూనభంబు లెం
తగ నొకరొక్కరొం డొరులఁ దన్నుచునుండునొ చాటు పందిళుల్॥

స్వామి వివాహ శోభగన వత్తురు సర్వమహీనివాసులో
హో ముదమార నెల్లజను లుత్సవ మంతయు నన్నివైపులం
దే మెయినైన చూడనగు నెత్తున గట్టిరి పెండ్లి మంటపం,
బామహనీయవేది కననయ్యెను చల్లని పాలవెల్లిగన్॥

కామయనంగఁ గేంద్రమునఁ గంబమునాటి విశాలవర్తుల
శ్రీ మహితాత పత్ర మనఁజేసిన శోభనవేది, దీధితి
స్తోమ విసర్పి రత్నచయ శోభితమై, పరిలంబ మానము
క్తా మణిహార వల్లికల కానగ నయ్యెను నేత్రపర్వమై॥

అంతటఁ జుట్టి చూచి, హృదయంబున కెంతయు తృప్తికల్గ, వి
శ్రాంతినిగాంచె నన్నబలరాముఁడు, వేగు న దెప్పుడింక ? ప
క్రాంతిని కాంతఁగైకొనుచుఁ గాంతుఁడు కృష్ణుఁడు వచ్చు నెప్పు? డం
చెంతయొ యుత్సుకత్వమున నెంచెడు సర్వులు సంతసింపఁగన్॥

తొలిదెస తెల్లవారు కడఁదోచు దివాకరుతోనెఁ దోడుగో
మలి గొని తెచ్చెఁ గృష్ణుఁడని మంగళవాద్య పురస్సరంబుగా
లలిత వినూతనాంబర విలాస విభూషణ పుష్పమాలికా
కలిత సువాసినీ గణము కన్నుల పండువు సేయుచుండగన్॥

తమ కెదురొచ్చు వచ్చు జనతన్ గని ద్వారక సర్వ మెంత మో
దము కనుచున్నదో తెలిసి తమ్ముఁడు తన్మయుఁడౌచునన్నకై
సుమములు చల్లు చూపులను చూడగ నూటిగ నేగి రాముఁ, డా
నమిత వధూవర ద్వయమునన్ నెనరంతయు నొల్కఁబోయుచున్॥

బావఁడు వచ్చినప్పుడిలు బట్టక యుంటివి, వచ్చి నీవు క
న్యాపుర మొక్కఁడై చనిన యప్పు తెఱంగి, సమస్త సేనతో
నేపున నేనె వత్తునని యెంచితి, నంతట వీరకీర్తి ని
ర్వాపక మట్టి సేతయని మాని, మహోత్సవయత్నమంతయున్॥

చేయగఁబంచి, సర్వమును సిద్ధ మొనర్చి, క్షణక్షణంబు వి
చ్చేయుదు రంచు చూడ నతసీ కుసుమాభ మనోహరాంగ ల
క్ష్మీయుత వచ్చి చేరితివి సిద్ధ ముహూర్తమునందుఁ, బిల్వగాఁ
బోయినవారు రాఁదగిన పూజ్యుల నెల్లర తోడి తెచ్చిరిన్॥

ప్రభవంబందితి రోహిణిని, సరిగ సంవత్సరయౌ ని ధని
ష్ఠ, భవానీ కృత సింహాగ్నమున శ్రేష్ఠంబౌ ముహూర్తంబు మీ
కభయం బౌచు శుభప్రదం బగుచు గల్యాణార్థమై నిల్చె, మీ
రుభయుల్ వైశమ కార్యముల్ సలిపి శాస్త్రోద్వాహ మందందగున్॥

ఎవరును తోడులేక హృదయేశుఁడె తోడుగ సర్వబంధువై
భవమును వీడి స్వామికయి వచ్చిన లచ్చివి, నీకు తల్లియే
దిపులను గల్గఁబోదు, నిను దేవిగఁ గొల్తురు సర్వభూప్రజల్,
ప్రవిమల చిత్తవై స్వసుహ భావమునన్ గను మమ్మ ద్వారకన్॥

బలరాముండిటు స్వాగతోక్తిఁగడు నాప్యాయమ్మునన్ బల్క స
ర్వ్యులు సానంద మహోత్సవాన్వితులు నిత్యోత్సాహులై తూర్యనం
జల నిస్వనముతో వధూ సహిత కృష్ణున్ ద్వారకారాజ వి
థుల నూరేగఁగఁజేసి పెండ్లి పనులందున్ మగ్నులై రంతటన్॥

హాలా హలము కంఠ హరినీల మణిగాగ
భువన రక్షకుఁడైన శివుఁడు పొంగ

కలశాబ్ధి జనియించు కల్పగ కామధే
    న్వాదులన్ సురలు తమ కొసగ ||
నమరుల కాహారమందించు చందిరుం
    డఖిల లోకముల కాహ్లాది గాగ
క్షీరాబ్ధి వేల లక్ష్మీ మహావిష్ణు క
    ల్యాణ వేళా మహోల్లాస మొప్ప

ద్వారకా పట్టణము వార్ధి తీరమందు
దేవతా వైభవంబునం దీప్తినట్టి
నవ్య కల్యాణ వేదికాంతరమునందు
జరుగంబోయెడి పెండ్లి సంబరము లొప్పె ||

ఆ శివుం, డావనాదులును, నా శశి, యా మహనీయ దంపతుల్ వాసిగనెట్లు యిచ్చటికి వచ్చిరనంగ నెఱుంగు స్వర్గ సంవాసులతో సమానులగు వారు మహాత్ములు పెండ్లిజూడ సర్వాశల నుండి వచ్చి తమ యా శయ సిద్ధికి వేచి యున్నచో||

అందఱు నుండియున్ దవ కవంత గుణాన్విత, కైన శార లందిందుల కొక్కరె న పరితృప్తిగ వచ్చుట వీలు కాని యిబ్బందిని బట్టి లోపమును భావమె లోపగ రాదటంచు, పెంపొందిన ప్రేమ యాదవులహో వధుపక్షము మానసాధువై||

ఒంటరి కృష్ణుడంట కడు నొప్పెను, కేవలుడై స్వమాయచే జంటయునట్లు తోచును సాగంగజేయు సమస్త విశ్వమా దంట య[illegible]యున్ బరమ తథ్యము, కాక కృష్ణుడే టొంటరి యౌట, యామె యటు లందరి కొంట యెటుల్ పొసంగెడిన్||

ఉద్వహ మున్నచో నుభయు లుండగ నౌట, హలాయుధుండు తా నద్వ[illegible]డైన నాయకున కండగ నుండెను, హార్దమర్మ సంవిద్విదుడా మహీసురుడె ప్రీతిగ నాయిక పక్షమూనెం, బక్షద్వయ మేళనాత్మక వికాస మహోత్సవమయ్యె నెల్లెడన్||

వరపూజా పరమార్గ మన్వితముగా వైకుంఠుడౌ స్వామికిన్ వరపూజన్ బొనరించి, మాయపార వర్వ జేయు చున్నట్లుగా వెరంబట్లన్ నియమించి, గంపనిడి యింతిందెచ్చి కూర్చుండ బెట్టిరి, సుంతయ్యును విశ్వమై విరియు టిట్లే యన్న చందంబునన్

[illegible]న్నద్యోతనుడే సభార్యుడయి కన్యాదానముంజేసె. నా[illegible]గ్నంబందు వధూ కర గహణ వేళన్ స్వామి ధర్మేచ యం[illegible]న్నిన్ గొల్చి ప్రతిజ్ఞ చేసెను విమర్శానంద సంపూర్ణుడై, యాస్నేయంబను విశ్వమంతయు వివేకానందమున్ బొందగన్||

మంగళసూత్రధారణము మాన్యుడొనర్చిన వేళ స్వామి దేహంగళ బద్ధ చిహ్నమహిమాలిశయంబున స్వీయగేహ వామాంగ మొనర్చుచున్ బదుకు వందిక నిర్వురు నొక్కరె నటుల్ పొంగెడి స్వామి ఫుల్లనను బొంద వరాంగన సుఖమ్ము ఝమ్మయై||

ఇది నా ప్రాణ సమాన మౌ విభు, భవత్ హృద్వేశీయందేను నా యెద నీవున్ వరిలీన మౌటకిది గుర్తై యయ్యె, పుంస్త్రీ శుభాస్పదమై, భిన్నతలేని యోగమున కావాసంబుగా, సత్యమీ హృదయా వాపిని నిన్ వహించు నిజ మూహింపంగం జేయున్ సదా!

అని యర్ధాంగి తలంచుచుండ ప్రియుం డర్యా! జీవనోజ్జీవన ప్రణయాలింగన తుల్యమై తనువు దీర్ఘ ప్రాభవోపేతమై మనగంజేయు పవిత్రసూత్ర కృత వహౌ మాంగళ్య చిహ్నంబు దీనిని కంఠంబున దాల్చి నిత్యసుఖ మందింపం గదే ప్రేయసీ!

అనుచున్ వేసిన మూడు ముళ్లు తమ సర్వైక్య ప్రబోధాత్మక ప్రణుతిం బొందుచు, వానిలో బడి శరీరంబుల్ త్రిథాభిన్నముల్, మనసున్ వాక్కు శరీరమన్న కరణా మ్నాయమ్ము నేకీ భవించును,జాయా పతు లిద్ద రంట భ్రమయంచున్ దెల్పుమమ్మాటికిన్

శ్రీవాణీ గిరిజా మనోహరులు వారిన్ దాము వక్షో ముఖాంగా విష్టాత్ములం జేయుటంతయు నహో యా శక్తు లవ్వారిలో వైవిధ్యమ్మును బొందలేదనుటయే స్పష్టమ్ముగా దెల్పు, స్త్రీ దేవిన్ బూరుషుడా ప్రతయమ్మునను స్వార్ధీభూతగా జేసెడిన్||

నేను న్నీవు పరస్పరం బిటులు నా నీ భేద మే మాత్రమున్ గానన్ రావి విధాన వేకమగు దాంకన్ నిత్య మన్యోన్య మెందైనన్ డెందము లిచ్చిపుచ్చుకొను లక్ష్యంబొప్ప నాచార మంచా నంటించుచుం బోపికొన్న తలం బ్రాలందించె నాశీస్సులన్||

శ్రీ రుక్మిణీకృష్ణ సిద్ధ వైవాహిక
    ప్రత్న పుణ్యాక్షత ప్రాప్తినంది
కను విందొనర్చుచున్ గన్నువిచ్చంగజేయు
    వైదికోద్వాహ తాత్పర్య మెఱిగి
చిన్ని స్తంభాలాట లెన్ని యాడిన గాని
    చివర కా యిర్వురే చేరుటెఱిగి
యప్రాప్య సర్వేప్సిత ప్రాపకాత్యంత
    పుణ్య ప్రసాదంబు పొంది పొంగి

కృష్ణకల్యాణ దర్శనా కృష్ణ మనుజ
దివిజ సంఘమ్ము లెనలేని తృప్తినందె
ద్వారకా వార్ధి తీర వైదర్భి పెండ్లి
యఖిల లోకమ్ముల గణితాహ్లాదమందె||

* * *

తలంచియుం బుత్త్రుకై వగచి ద్వారక చేరని తల్లి తండ్రి హృద్దుల నొదుగంగ నైన వనధుల్ బలెం దమ తావున సంతసింపంగా, బలిమి గ్రహింపంగాం దలంచి పట్టగ రాక ప్రభగ్న యత్నుడై తలంపు సహస్రధా శిథిలతన్ గను చైద్యుడు రాజ ముండెడిన్||

[ఇంకా వుంది]

# డా. నేలటూరి వెంకటరమణయ్యగారు

### శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రి

గడచిన మార్చి 21వ తేదీన దివంగతులైనారు. ఆంధ్రదేశంలో ప్రామాణిక చరిత్ర రచయితలు తామేననిపించుకొన్న ధన్యజీవులు. గీటు తప్పి వ్రాయరు వారు వ్రాసింది గీటు తప్పదు. 'ఋషీణాం పున రాద్యానాం వాచమర్థోను ధావతి' అనే ప్రామాణిక లక్షణానికి వీరు కూడ లక్ష్యమనదగిన వైదుష్యమువీరిది. వారు తరచు చెప్పేవారు. చిలుకూరి వీరభద్రరావుగారు చరిత్రను సృష్టించి 'చరిత్ర చతురానన'లయినారుట. వీరి కట్లా కథల్లటం గిట్టదు. జరిగినదాన్ని సప్రమాణంగా నిరూపించటమే చరిత్ర రచనయనే పరమాశయం వీరిది. మద్రాసులో ప్రొఫెసరు నీలకంఠశాస్త్రిగారివంటి వారి సాహచర్యంవల్ల వారి శాస్త్రీయ పరిశోధనల కలవడుటయేగాక వారిలో ఉండే లోపాలను తాము వెయ్యకుండ సరిదిద్దుకొన్నారు. చరిత్ర రచనకు మూలసామగ్రియైన శాసనాలు, వాఙ్మయము, కైఫీయతులు మున్నగువాటి నేవిధంగా ఉపయోగించుకోవలెనో వీరికి బాగా తెలుసు. దానికి తగ్గట్టు తెలుగులోను, ఆంగ్లంలోను చక్కని పాండిత్యం. కనుక వీరి రచనలు మంచిశైలిలో శాస్త్రీయంగా కుదిరియున్నవి. ఇట్టి సాధన సంపత్తి పరిశోధకులందరికి సాధారణంగా కుదరవు కనుక అందరు పరిశోధకులు వీరికి నచ్చరు. అట్టి వారిని వీరు ముఖాముఖిగా తిట్టేవారు. చిన్నవాళ్లు నవ్వుకొనేవారు. కొంచెం పెద్దవాళ్లమనిపించుకొన్నవారు ఆయనకు దూరంగా ఉండేవారు. కాని వారి వాదాన్ని కాదనగలిగేవారు కారు. ఇంక తెలుగువారిలో వారికి నచ్చిన పరిశోధకులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారొక్కరే. ఆంధ్రదేశ చరిత్రనంతా కూలంకషంగా చర్చించారు వీరుభయులు. అశ్వినీ దేవతల్లాగా నిత్య ద్వంద్వ వాచ్యుల్లో చేర్చదగిన జంట మల్లంపల్లి నేలటూరి వారిది.

చనిపోయేవరకు చారిత్రకస్థలాలుచూచి వాటిని గూర్చి క్రొత్త విషయాలేవో వ్రాయాలనే ఆసక్తి వారికుండేది. చనిపోవుటకు పది రోజులు ముందుగా ఒక విద్యార్థి విజయనగర శిల్పవైశిష్ట్యాన్ని గురించి చెప్పుమని కోరెను. అయితే నన్ను హంపి, శ్రీశైలం చూపిస్తేనేగాని చెప్పలేనన్నారుట. కనుక ఆ విద్యార్థితో తన నక్కడికి తీసుకొని పోవలెనని చెప్పారు. వారి నక్కడికి తీసుకొనిపోతే వారు అనేక క్రొత్త విషయాలు చెప్పేమాట నిజమే. పట్టుమని పదినిమిషాలు నిల్చోలేని స్థితిలో ఇతరుల సహాయంతో మళ్లీ ఆ స్థలాలుచూచి రావలెననే కుతూహలం ఆయనలో పోలేదు. ఇది పరిహాసంగా అన్నమాట కాదు. వెళ్లాలనే నిజమైన కుతూహలంతో అన్నమాటే. మళ్లీ చూచి కొత్తవిషయాలు కొన్ని తెలుసుకోవలెననే కోరిక ఆయనకు ఉన్నమాట వాస్తవమే. అట్లాగే పుస్తకాలు. కొత్త పుస్తకం అమ్మకానికి వచ్చిందంటే తప్పక కొనియైనా చదివేవారు. శ్రీశైలం గుడిలో లోపలి మండపస్తంభంమీద దేవరాయల శాసనం పూర్వం ఉండేది. అది వారికి తెలిసింది. దాన్ని వెతుకుటకోసం ఇప్పటికి కనీసం నాలుగుమార్లైనా అక్కడికివెళ్లి చూచి వచ్చారు. నన్ను రెండుమార్లు వెంటతీసుకొని పోయినారు. ఈ మధ్యనే, అంటే రెండు నెలల క్రిందట శ్రీ కార్తికేయ శర్మగారిని తీసుకొని పొమ్మంటే వారు ఆలస్యం చేశారని చెప్పి తానే స్వయంగా భార్యను, మనుమరాండ్రను వెంటబెట్టుకొని బస్సులో వెళ్లి వచ్చారు. ఎన్నిమార్లు వెళ్లితే మట్టుకేం. ఆ శాసనం కనుపించలేదు. దాన్ని నేనుకూడ 1961లో చూచాను. తర్వాత దేవాలయాధికార్లు తమ పునర్నిర్మాణ కార్యక్రమంలో రూపు మాపివేశారని తెలుసుకొని కోపాన్ని ఆపుకోలేక వాళ్లని తిట్టిపోశారు. అంటే శాసనం యెక్కడున్నా అది వారి సొత్తు అనిన్నీ దాన్ని యెవరు ముట్టుకోకూడదని ఆయన కోరిక. దాన్ని యెవరైనా పాడుచేస్తే తన ఆస్తిని దొంగలపహరించినట్లే బాధపడేవారు. కడప జిల్లాలో మేము శాసనాలు కాపీ చేసేప్పుడు మెకంజీదొర నకళ్లు తీయించిన శాసనాలన్నీ వీళ్లు సరిగా తీస్తున్నారా లేదా అని ఆయన సరి చూచేవారు. అవి యెన్నో మోటబావుల క్రింద, చేలగట్ల క్రింద, చెరువుకట్టల క్రిందపూడ్చబడిపోయినట్లు తెలిస్తే వాటికోసం యెంత పరితపించేవారో, హొయసలరాజు ముమ్మడిబల్లాళుడువేయించిన శాసనం రాయచోటిదగ్గర జీల్లవారిపల్లె నరసింహస్వామిగుడిలోదొరికింది. తేదీ ఉన్నభాగం శిథిలమైపోయింది. అయినాసరే దాన్నిబట్టి హొయసలరాజు వైదుంబులకు సహాయంగావచ్చి కాకతీయులతో యుద్ధంచేసి ఆ ప్రాంతం అంతా ఆక్రమించుకొన్నాడని సిద్ధాంతీకరించారు. అట్లాంటి శాసనం యాదవరాజైన సింఘణుడు వేయించింది పుష్పగిరిలో ఉండాలి. కాని మాకది దొరకలేదు. దానికోసం పుష్పగిరి, చింతలపుత్తూరు, అంతాగాలించి పెట్టాము. కాని అది దొరకలేదు. అతి ముఖ్యమైన చరిత్రాధారం పోయిందని కొన్ని వందలమార్లు అన్నారు. పుష్పగిరి ప్రాంతం మేమెవరం వెళ్లినా దాన్ని వెతకమని చెప్పి పంపుతూ వుండేవారు. వచ్చి దొరకలేదంటే తిడుతూవుండే వారు. ఇది వారు చనిపోయేవరకు మాకు మామూలైంది. ఈవిధంగా శాసనం దొరికితే ఆయనకి పండుగ. అది పోతే యెంతోకోపం. ఈ విధంగా చరిత్రతో పెనవేసుకుపోయిందిఆయన జీవితం.

ఇంకో చిన్న విషయం. ఆయనతో మేము మొదట శ్రీశైలం పోయినప్పుడు 1965 లో, ఆ ప్రాంతం చాలా భాగాలు శాసనాలకోసం తిరిగాం. తెలంగాణానుండి పూర్వం కృష్ణదాటే త్రోవ నీలగంగత్రోవ వైపు నడిచిపోతూవుండగా దోవలో మూడు నాలుగు అక్షరాలు

మాత్రమే కలిగియున్న వ్రాతయొకటి వారి కెంటబడింది. దాన్నిచూచి యెగిరి గంతువేశారు. ఇట్లాంటివి పాతాళగంగమెట్లమీద వేలకొద్దీ వున్నై సార్ అన్నాడు నారాయణ. అతను క్రొత్తవాడు. పాత అక్షరాల్లో యేముంటుందో యింకా బాగా తెలియదు. ఇంతలో ముందుకు పోయినవాణ్ణి నేను తిరిగి వెనుకకువచ్చా. నిజంగా పాతఅక్షరాలే. ఆరో శతాబ్దినాటివనుకొన్నాం. శ్రీశైలంకొండమీద 11వ శతాబ్దానికి పూర్వపు శాసనాలు దొరకలేదు. కాని ఆ క్షేత్రప్రసక్తి విష్ణుకుండినులనాటినుండి యితర శాసనాల్లో కనుపిస్తుంది. నిజానికి ఈ నాలుగక్షరాలు తప్ప ఈ క్షేత్రముయొక్క ప్రాచీనతను నిరూపించగలిగే ఆధారము అక్కడ వేరొకటి యిప్పటికి కూడ దొరకలేదు. అదేదో యాత్రికుని చిన్నపేరు. అయినా అక్షరాలు పాతవి కావటంచేత అప్పటినుండి యీ నీలగంగరేవు దోవ వాడుకలో నున్నట్లు రుజువగుచున్నది. దాన్ని మళ్ళీచూచి సంరక్షిత పురావస్తువుగా చేస్తేగాని శ్రీశైల ప్రాచీనత నిరూపింపబడుటకు సాధ్యంగాదని పదేపదే చెపుతూవుండేవారు. నిజమే. ఇవ్వాళ 14వ శతాబ్దంనాటి కాకతి ప్రతాపరుద్రుడి శాసనమే యచటి ప్రాచీన శాసనంగా మిగిలింది. అంతకుముందు చాళుక్యులు, రాష్ట్రకూటులు, కదంబులు, బాదామి చాళుక్యులు, విష్ణుకుండినులు శ్రీ పర్వతాన్నిగూర్చి అనేకంగా చెప్పకొన్నారు. కాని వారి శాసనాలేవి అక్కడ దొరకటంలేదు. విజయనగరం రాజులు మొదటిసారిగా పెద్దయెత్తున అచటి పూర్వపు దేవాలయాన్ని రూపుమాపి క్రొత్త నిర్మాణం చేశారనిన్నీ అందులోకూడ ఒక దేవరాయలనాడు లోపలి మండపం నిర్మింపబడిందనిన్నీ దానిలో చాలా పూర్వశాసనాలు గోడలమీదివి పోయి యుండుననిన్నీ, ఆ దేవరాయల శాసనంకూడా మన కాలంలో పోవటం చూస్తిమిగదా అని పదే పదే చెప్పేవారు. కనుక వారికీ నాలుగక్షరాలు నాలుగు లక్షల్లాగా కనుపించాయి. ఇది వారి చారిత్రక పరిశీలనాసక్తికి గొప్ప నిదర్శనము. శ్రీశైలం కొండఅంతా పూర్తిగా అడుగడుగున తిరిగితే యింకా చాలా నిదర్శనాలు దొరకగలవనే దృఢ నిశ్చయం వారికుండేది. అట్లాగే పెద్ద ముడియాన్ని గురించికూడ. గండికోటదుర్గం చాలా ప్రాచీనమైందని వారి తలంపు. అచట రాష్ట్రకూటుల శాసనమొకటి దొరకాలి, దొరకాలి, ముమ్మాటికి దొరకాలి అనేవారు. ఏదీ మాకు దొరికితేనా తెచ్చేది. ఆ కొండమీది రాయి రాయి వెతికి ఆ శాసనాన్ని బయటికి లాగాలని వారికుండే ఉత్సాహం ఇంతా అంతాకాదు. ఏ ప్రభుత్వమైనా పదికోట్లుఇస్తే ఆగండి కోటను, పుష్పగిరి కొండను సమూలంగా త్రవ్వించి ఆ పోయిన శాసనాల్ని బయటికి లాగించాలనే కోరిక వారికుండేది. పట్టుమని రెండడుగులుకూడ వేయలేవని తనకు పూర్తిగా తెలిసికూడ నెలరోజులక్రిందట హంపిక్షేత్రం. శ్రీశైలం గుడి ప్రాకారాన్నిచూసి విజయనగర శిల్పాన్నిగూర్చి వ్రాయాలనే తన నిజమైన కోరికను చూపించాడంటే యేమి అనుకోవాలి! ఇంకా వారం రోజుల్లో పోతాడనంగా నేను వారి నడిగాను. 'ఏమండీ హంపి వెళ్ళతామని చెప్పారుటకదా, నిజమేనా' అని. "అవునండీ, నేను చరిత్రవ్రాసేవాడు ఆ శిల్పాన్నిగూర్చి ఆలోచించలేదు. ఈమధ్యనే ఆ పుస్తకాలు కొన్ని తెప్పించే చదివితే దాన్ని నేనే స్వయంగా వ్రాయాలనే కోరిక నాకు ఈ చివరి దినాల్లో కలిగింది. మరియేంచేయమంటారు." అని నిజమైన ఆవేదనతోటే అన్నాడు. పైగా, ఆ కార్తికేయశర్మ తీసుకొని పోకపోతే శ్రీశైలం నా అంతటనేను బస్సు మీద మొన్న వెళ్ళిరాలేదా అని సమాధానం చెప్పారు. ఈవిధంగా చనిపోయే వరకు చరిత్రలోను, వాఙ్మయంలోను క్రొత్తవిషయాలను తెలుసుకోవాలని, వ్రాయాలని వారికుండే ఆసక్తి యింతా అంతాకాదు. దాన్ని ఆసక్తి అనటంకంటె 'దాహం' అనటం మంచిది. నిజంగా ఆంధ్రదేశచరిత్రనంతా అట్లాగే త్రాగివేశారు. ఇంకెవరు కాగితం మీద కలంపెట్టి వ్రాయవలసిన మన చరిత్ర పెద్దగా లేదేమో ననిపిస్తుంది.

జమ్మలమడుగు తాలూకాలోని పెద్దముడియం పూర్తిగా త్రవ్వించితేనేకాని ఆంధ్రుల చరిత్ర పూర్తిగా తెలియదనేవారు. చాలా యిప్పటికే త్రవ్వేశారు. అక్కడ యిప్పుడు గోతులుతప్ప మరేమీలేవండి అన్నాను. విజయనగరం రాజులనాటి అవశేషాలు మాత్రమేనండీ యిపటికి దొరికింది. కుందునదికంటె యింకా లోతుగా ఏముంటయ్యండి అనేవాణ్ణి. అక్కడి ముక్కంటీశ్వరుడిని యెవరు ప్రతిష్ఠించారని యెదురు ప్రశ్నించేవారు. అంటే త్రిలోచన పల్లవుడు ప్రతిష్ఠించారనా మీ ఉద్దేశం అంటే అవును ముక్కంటికాడు వెట్టి ప్రతిష్ఠించినదే అది అనేవారు. అక్కడ ప్రాచీన చోళులవి, చాళుక్యులవి, పల్లవులవి అవశేష నిదర్శనాలు ఎప్పటికైనా దొరికి తీరాలి అనేవారు. చాళుక్యులు పెద్ద ముడియంలోనే మొదట వుండేవారని, కదంబులు శ్రీశైలంనుండే పశ్చిమానికి వెళ్ళారని వారి దృఢ విశ్వాసం. ఇప్పటి కర్నూలు జిల్లాయే పూర్వం కర్నాడు అని అనేక ఆధారాలతో నిరూపించారు వీరు. తర్వాత ఆ కర్నాటపదం ప్రస్తుత కన్నడ దేశానికి పరిమితమై యున్నట్లు చెప్పారు. అదొక పెద్దగాథ. శ్రీనాథుడు "ఎవ్వడేమన్న నంధ్రుడు నాకేమి కొరత, నా కవిత్వంబు నిజము కర్ణాట భాష" అని ఘంటాపథంగా యెందుకు చెప్పాడో వీరు నిరూపించారు. హరిహరరాయలు, బుక్కరాయలు, విద్యారణ్యులు, కృష్ణదేవరాయలు, రామరాయలు వీరంతా తెలుగు దేశంతో ఎట్లా సంబంధించియున్నారో చెప్పారు డాక్టరు వెంకటరమణయ్యగారు. వారు నిరూపించిన సిద్ధాంతాలను మనలో ఇప్పుడెందరు సమర్థించుచు సభలలో వాదించగలరో తెలియదు. "కొండవీడు మనదేరా, కొండపల్లి మనదేరా కాదని యెవ్వడు వాదుకు వచ్చిన కటకందాకా మనదేరా" అని తెలుగు దేశానికి హంపి నుండి కళింగ కటకందాకా హద్దులు పలికారు. మల్లంపల్లివారు పాపం ఇంత దుడుసుగా చెప్పేవారుకాదు ఏ విషయాన్నైనా. గదమాయించి గట్టిగా చెప్పటంతప్ప వేరొక పద్ధతి రమణయ్యగారికి లేదు. కృష్ణదేవరాయలు తెలుగువాడంటే తెలుగువాడే. అదేమిటండి వాళ్ళు తుళువవంశంవాళ్ళు కదా అంటే, అవునయ్యా, తుళుదేశంనుండి వచ్చి తెలుగు దేశంలో స్థిరపడ్డారు అని గట్టిగా అనేవారు. పైగా, తెలుగు మాతృభాష కాకుండా "దేశభాషలందు తెలుగులెస్స" అని అంటాడేమిటి? ఈ విషయాన్నిగూర్చి వారు చక్కని విషయాల ననేకం సేకరించి వ్రాస్తూవుండగా మృత్యుదేవత కొనిపోయింది. ఆ అసంపూర్తి రచన నెవరైనా సమర్థులు తీసుకొని పూర్తిచేయ గలిగితే వారి ఆత్మ శాంతిస్తుంది.

తెలుగులో అష్టదిగ్గజముల కాలనిర్ణయము చేయుచూ వీరు వ్రాసిన వ్యాసము చాలా ముఖ్యమైనది. అది అష్టదిగ్గజములపై ప్రచురింపబడిన వ్యాసావళిలో నొకటి. సాధారణంగా కృష్ణదేవరాయల వారి యాస్థానములో గౌరవించబడిన గొప్పతెలుగు కవులు ఎనమండుగురు అష్టదిగ్గజములనబడేవారని మనం అనుకొందుము. నిజమే. కాని యీ యెనమండుగురి కవుల కాలమునుగూర్చి చాలా పేచీలున్నవి. చారిత్రకాధారాలతో ఆ చిక్కులనన్నింటిని విడదీసి వారి నందరిని కృష్ణదేవరాయల కాలానికి సరి పెట్టుటకు వీరుచేసిన ప్రయత్నం మిక్కిలి ప్రామాణికంగా ఉంటుంది. 'వాఙ్మయ వ్యాసమంజరి' అనే గ్రంథంలో అమూల్యములగు వీరి 21 వ్యాసములను ఆంధ్రసాహిత్య పరిషత్తువారు 1967లో ప్రకటించిరి. 'భారతి' మాసపత్రికలో డాక్టరు వెంకటరమణయ్యగారు ప్రకటించిన వ్యాసాలసంఖ్య సుమారు 80కి పైగా నున్నట్లు తెలియుచున్నది. ఇవి అన్నియు ఆంధ్రదేశ చరిత్ర, సంస్కృతి వాఙ్మయములకు సంబంధించినవి. ఇంచుమించుగా ఇన్ని వ్యాసాలను వీరు అనేక ఆంగ్ల జర్నల్సులో ప్రకటించి యుండిరి. మరెచట మనకు లభ్యముకాని అనేక చరిత్రాంశములను వీరు ఆ వ్యాసావళియందు చర్చించిరి. అన్నదేవచోడుడు, భక్తిరాజు, మల్లె వంశమువారు, కాయస్థులు, మిర్జుమ్లా, యింకా యెన్నో అజ్ఞాత విషయాలపై వీరు సమగ్ర పరిశోధనలు గావించి ఆంధ్రదేశ చరిత్రలో ఆ వంశములవారికి స్థానం కల్పించారు. వీరు వ్రాసిన వ్యాసములన్నింటియొక్క సారాంశములను తెలుపుతూ ఒక క్యాటలాగువంటి గ్రంథమును తయారుచేయుట చాలా అవసరము. అట్లు చేయనిచో ఆ రచనలన్నియు కొద్దికాలములో విస్మృతప్రాయములై చరిత్రవిద్యార్థులకు, పరిశోధకులకు తెలియకుండాపోయే ప్రమాద మేర్పడగలదు. కీ. శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారివి, మల్లంపల్లి సోమశేఖరశర్మగారివి, యింకా పలువురి అమూల్య రచనలు ఇప్పుడు చాలామందికి లభ్యము కాకుండ పోయినట్లుకాక వీరి వ్యాసావళియొక్క సంగ్రహ సూచికనైనా తయారుచేసి వాటిని నామమాత్రముగనైన పదిలపరచుట అవసరము.

ఇంక వీరు రచించిన గ్రంథాలుకూడా అనేకం. 'దాక్షిణాత్య దేవాలయాల పుట్టుక' అనే అంశముపై చక్కని విమర్శగ్రంథము వ్రాసి వీరు డాక్టరేటు పట్టము నొందియుండిరి. కాని యిది యింకను అచ్చుకాలేదని తోచును. అచ్చుఅయిన గ్రంథాలు: 1. త్రిలోచనపల్లవుడు – కరికాలుడు (ఆంగ్లం) 2. విజయనగర సామ్రాజ్య ప్రాదుర్భావము (ఆంగ్లము); 3. **Studies in the Third Dynasty**; 4. **Early Muslim Expansion in South India**; 5. **Further Sources of Vijayanagar History.** ఇందు మూడు భాగాలు కలవు. వాటిలో మొదటిది విజయనగర రాజుల చరిత్ర. 6. **Eastern Chalukyas of Vengi**; 7. **The Chalukyas of Vemulavada**; 8. పల్లవులు – చాళుక్యులు (తెలుగు); 9. **History of the Nayak Kings of Madura nad Tanjore.** 10. వెలుగోటివారి వంశావళి-విపులమగు ఆంగ్ల పీఠికతో ప్రచురించిరి, 11. విజయనగర చరిత్ర – 2 భాగములలో (తెలుగు). 12. విష్ణుకుండినులు (తెలుగు); 13. కృష్ణదేవరాయలు (తెలుగు); 14. పాల్కురికి సోమనాథు డెప్పటివాడు; 15. చరిత్ర రచన; 16. వశ్యాత్తాపము–ఇది తిమ్మరుసుయొక్క కళ్లు పీకించుటనుగూర్చి వీరు వ్రాసిన అద్భుతమైన కథానిక; 17. **Rudra-Siva** (ఆంగ్లము). ఇంకా తెలియకుండ వ్రాతరూపములోనే యుండి అచ్చుకాని కొన్ని రచనలు కలవు. వారు తుట్టతుదకు కృష్ణదేవరాయలనుగూర్చి ఆంగ్లములోనొక యుద్గ్రంథమును రచించుటకు పూనిరి. అది పూర్తిచేసికాని తాను చనిపోనని గట్టిగా అందరితో చెపుతూఉండేవారు. కృష్ణదేవరాయల తండ్రి తుళుదేశమునుండి ఆంధ్రదేశమున కెప్పుడు ఎట్లువచ్చింది తాము వ్రాసింది మాకు వినిపించేవారు. అది పూర్తిచేయకుండగనే వారు దివంగతులగుట ఆంధ్రదేశ చరిత్రకెంతో లోపం.

తెలుగు విజ్ఞాన సర్వస్వము మూడవ సంపుటంలో మల్లంపల్లి వారితోబాటు వీరుకూడ అనేక అంశాలనుగూర్చి విపులంగా వ్రాశారు. అట్లే 'Early History of the Deccan'లో వీరుభయులు రచించిన కాకతీయాధ్యాయము మిక్కిలి ప్రామాణికమైయున్నది. 'Comprehension History of India' అనే గ్రంథములో కూడా కాకతీయులనుగూర్చి వీరితోకూడి ప్రస్తుత రచయిత ఒక అధ్యాయము వ్రాసి యిచ్చెను. అది యింకా వెలువడలేదు. మెకంజీ వ్రాత ప్రతుల నుండి 'కడపజిల్లా శాసనములను గ్రంథరూపములో వెలువరించిరి. వరంగల్లుజిల్లా శాసనములను వీరే ప్రకటించిరి. 'ఎపిగ్రాఫియా ఆంధ్రికా'అను శాసన పరిశోధన జర్నల్సును మూడింటిని ప్రకటించిరి. ఆంధ్రప్రదేశపు రెండు వార్షిక శాసన నివేదికలను వీరు ప్రచురించిరి. ఇంకా నా దృష్టికిరాని రచనలుకూడ కొన్ని యుండునని విన్నవించుకొంటాను.

వీరు విజయనగర చరిత్రను వ్రాయటానికిముందు పార్సీమూల చరిత్రలను పరిశోధించుటకై పార్సీభాషను యథావిధిగా అభ్యసించారు. వీరి 'Early Muslim Expansion in South Indias' అనే గ్రంథంలో అట్టి ఆధారాలనేకం చూపించారు. నేటికికూడ ఆ చరిత్రనుగూర్చి పరిశోధనలు చేయు వారి కందరికి వారి గ్రంథమే మూలప్రమాణంగాఉంది. పార్సీ నేర్చుకొని చరిత్రపరిశోధనచేసే మహమ్మదీయేతరులు మనలోలేరు. కనుక వారి గ్రంథమే ఆధారం. ఇట్లాగే వారి యితరగ్రంథాల ప్రాముఖ్యాన్ని గూర్చికూడా చెప్పవలసియున్నది. 'బాణోచ్ఛిష్టం' న్యాయము సంస్కృత కవులకెట్లో అదే విధంగా ఆంధ్రదేశ చరిత్ర పరిశోధకులకు డాక్టరు వెంకటరమణయ్యగారి రచనలు.

# అధ్యాత్మ రామాయణ కీర్తనలకర్త సుబ్రహ్మణ్యకవి జీవిత విశేషాలు

శ్రీ ముక్త్యేవి శ్రీరంగాచార్యులు

వ్యాసప్రోక్తమైన సంస్కృతంలోని అధ్యాత్మ రామాయణాన్ని మునిపల్లె సుబ్రహ్మణ్య కవితోపాటు ఇంకా పలువురు కవులు తెలుగులోకి అనువదించారు. కాని ఈ కవి తప్ప ఇతరులెవ్వరూ కీర్తనల రూపంలో అనువదించలేదు. సుబ్రహ్మణ్యకవి విరచిత ఈ అధ్యాత్మ రామాయణ కీర్తనలు ఈ అనువాదాలన్నింటిలో మకుటాయమానమై బహుళ ప్రజాదరణపొంది అజరామరమైన యశస్సును అందుకొన్నాయి. అందువల్లనే ఈ కవి స్వర్గస్థుడై, కొన్ని శతాబ్దాలు గడిచినా, నేటికిన్నీ వీటిలో, కొన్నింటినైనా, పల్లెలలో అచ్చుటచ్చుట పాఠంచేసేవారిని చూస్తున్నాము.

## కవి కాలనిర్ణయము

ఇంతటి ప్రజాదరణ పొందిన కవి కాలమునుగూర్చి స్పష్టమైన ఆధారాలు లభించుటలేదు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు కాళహస్తి సంస్థానములో, పరిశోధనకై తాము సేకరించిన తాళపత్ర గ్రంథాలలో "దామెరవారి పదాలు" అనే తాళపత్ర ప్రతి నొకదానిని 1949 సం॥రం ప్రాంతములో తిమ్మావజ్ఝ కోదండరామయ్యగారికి ప్రకటన కొరకు అందజేయగా వారు వాటిని పరిశోధించి ఆ వివరాలను 1951 సం॥రం "భారతి"లో "దామెరవారి మీద పదములు" అను వ్యాసములో ప్రకటించారు. వారు అందులో ఈ కవి ఇంటిపేరు, తండ్రిపేరుతో పాటు కాలమునుకూడా స్పష్టంగా నిర్ణయించారు.

## ఎ) తిమ్మావజ్ఝలవారి పరిశోధనలు

వేటూరివారు అందజేసిన తాళపత్ర గ్రంథం సంపుటికి సంరక్షకంగాఉన్న కొయ్యఫలకంపై "రాజశ్రీ దామెర కృష్ణస్వామి పుస్తకం – ద్వైతాద్వైతం" అని ఉంది. పిమ్మట పత్రాలలో అగస్త్యనాథుడు, కాళహస్తీశ్వరుడు, మరొక దైవమునకు అంకితమైన పదాలు ఆ పిమ్మట కాళహస్తి సంస్థానాధిపతులైన దామెర తిమ్మభూపాలుని కొమార్డు వెంకట సార్వభౌముని మీదనూ, దామెర వెంకటేంద్రుని కొమార్డు కృష్ణభూపాలునిమీదనూ పదాలు ఉన్నాయి. అగస్త్యనాథుని పదాలు పిమ్మట "మునిపల్లె రామలింగార్య పుత్రుడైన సుబ్రహ్మణ్య కవితా చాతుర్యంగా రచియించిన అధ్యాత్మ రామాయణ కీర్తనలు తమ ప్రియ శిష్యులయిన రాజశ్రీ దామెర కృష్ణస్వామి వారికి కృపచేసి ఇచ్చిన పుస్తకము" అని గలదు. దీనిని ఆధారంగా తీసుకొని తిమ్మావజ్ఝలవారు అధ్యాత్మ రామాయణ కీర్తనలు రచించిన సుబ్రహ్మణ్యకవి ఇంటిపేరు మునిపల్లె అనియు, తండ్రి రామలింగార్యుడనియు, ఈ కవి దామెర కృష్ణస్వామికి పూజార్హమైన గురువనియు నిర్ణయించారు. ఇందుపై ఎవ్వరున్నూ ఎట్టి భేదాభిప్రాయమున్నూ వెల్లడించక పోవుటేగాక లభించిన ఈ అమూల్య సంపదపట్ల సర్వత్రా హర్షం వ్యక్తమైంది. ఇక తిమ్మావజ్ఝలవారు సుబ్రహ్మణ్య కవికి నిర్ణయించిన కాలం పరిశీలిదాం. తాళపత్ర గ్రంథంలో పైన పేర్కొన్న తొలి వాక్యం ప్రకారం అధ్యాత్మ రామాయణ కీర్తనలు దరిమిలా పత్రములలో లేవు. వాటిబదులు దామెరవారిమీద రచింపబడిన పదాలు ఉన్నాయి. ఆ పదాలు కర్త ఎవరో అందులోలేదు. అయినా అవి సుబ్రహ్మణ్య కవియే రచించాడని భావించి ఆ పదాలులోని దామెర వెంకటేశ్వరుడు, అతని కొమార్డు కృష్ణభూపాలుడు 1780 సం॥రం ప్రాంతంవారనియు, సుబ్రహ్మణ్యకవి 1730 సం॥ర ప్రాంతంలో చిత్తూరు జిల్లాలో జన్మించి ఆ రాజుల ఆస్థానంలో ఉండవచ్చుననియు తిమ్మావజ్ఝలవారు నిర్ధారణ చేశారు. వారే మరల ఆ వ్యాసంలోనే 1500 - 1600 సం॥ర మధ్యకాలంలో బహులాశ్వ చరిత్ర రచించిన కృష్ణభూపాలు డొకడు ఉన్నాడని ప్రస్తావించినా, వానిని సుబ్రహ్మణ్యకవి శిష్యునిగా ఆమోదించలేదు. తమదృష్టిని తాళపత్ర గ్రంథంలోని పదాల రచన మీదనే కేంద్రీకరించి ఆ రచన 1780 సం॥రముకు సరిపోతూంది గావ తాము నిర్ణయించిన కాలం సరియైనదేనని సమర్థించుకొన్నారు.

## బి) నా పరిశోధనాంశాలు :

అధ్యాత్మ రామాయణంలోని కీర్తనల రచనకు, లభించిన తాళ

పత్ర గ్రంథంలోని పదాల రచనకు, ఏలాంటి సామ్యం లేదు. వాటి రచయిత సుబ్రహ్మణ్య కవియే అని తాళపత్ర గ్రంథంలో విస్పష్టా పేర్కొనబడలేదు. అయినా తిమ్మావజ్ఝలవారు ఆ పదాలమీదనే కేంద్రీకరించి తమ పరిశోధన సాగించినందువల్ల కవికాల నిర్ణయముపై వారి పరిశోధన నిర్దుష్టంగా లేదు. బాలాంత్రపు రజనీకాంతరావుగారు ఆ పిమ్మట తాము రచించిన వాగ్గేయకారుల గ్రంథంలో సుబ్రహ్మణ్యకవి కాలమునుగూర్చి వ్రాస్తూ తిమ్మావజ్ఝలవారి పరిశోధనలు కూడా ప్రస్తావించి అధ్యాత్మ రామాయణ కీర్తనల రచన అనుసరించి ఈ కవి అన్నమాచార్యులకు దగ్గరవాడేమోనని పేర్కొని పరిశోధకులు ఈ విషయం తేల్చాలని స్పష్టపర్చారు. సుబ్రహ్మణ్యకవి కాలమును గూర్చి ఇలాగే పలువురు కవులు తమ భేదాభిప్రాయాలు వెల్లడించారు. ఈ పెద్దలందరి అభిప్రాయం మన్నించి కవిగారి అధ్యాత్మ రామాయణ కీర్తనల రచన ఆదినుంచి చివరవరకు విపులంగా పరిశీలించి కవికాలము నిర్ణయించుటకు పూనుకొన్నాను. కవి, సంగీత విద్వాంసుడేగాక వ్యాకరణ ప్రవీణుడు కూడా అగుటచే తన కాలంలో వాడుకలో ఉన్న సంగీత వ్యాకరణ ప్రయోగాలతో రచన కొనసాగించాడు. గ్రంథంలో ఇలా గోచరించిన ప్రయోగాలతో పాటు ఆనాటి హరిహరాద్వైత కాల్ప్రభావములాంటి ఆధారాలు కూడా విపులంగా పరిశోధించి ఈ కవి 15–16 శతాబ్దాల మధ్యవాడని నిర్ణయించి ఉన్నాను. అందులో ముఖ్యమైన కొన్నింటిని విపులీకరిస్తాను.

## (1) కవి వాడిన వ్యాకరణ ప్రయోగాలు

వీటిని (ఏ) అనుకరణ (బి) పదప్రయోగాలు (సి) వ్యాకరణ విరుద్ధ ప్రయోగాలు (డి) విరుద్ధ అర్థ ప్రయోగాలు అని 4 విధాలుగా విభజించాము. వీటిలో తొలిగా పేర్కొన్న అనుకరణము తీసుకొందాం.

(ఏ) అనుకరణ : నన్నయభట్టు దేవయానివద్ద వాడినట్లుగా ఈ కవి సుందరకాండ రెండవ కీర్తనలో, నన్నయను, అనుకరించి 'దాని' అనుపదమును చరణమంతా ఇలా ప్రయోగించాడు : "దనుజాంగనలమధ్యమునమున్న దాని శ్రీ-తరుణివలె నొప్పుదాని, దీనతయు జడగట్టిన కురులు నుపవాసముల గ్రుస్సిన మేను మాసిన చీరె గలదాని తను గాన విభుడు రామికి వెంతయు వగనున్న వాయుజడి గొను బాష్పకణములదాని రాముని నుడువు, పడతిగనె కపివరి ॥దను॥"

ఈ కవి, తన రచనలో ప్రయోగించిన "ఇంతి, చెంగల్వబంతి, చెలువలమేల్ బంతి, గుణముల దొంతి; విరిలవేణి, వినుత గుణశ్రేణి"; కామిత ప్రదసత్కరుణాపాంగా, కామగర్వభంగా, గంగోత్తమాంగా" మొదలగు శబ్దాలంకారాలు 16వ శతాబ్దికి పూర్వం విరివిగా ప్రచారమంది రాయలు కాలంనాటికి తగ్గిపోయాయి. పోతన తన పద్యాలలో ఈ అలంకారం ఎక్కువగా వాడాడు. కాన ఈ అనుకరణ కాలం మనం గమనించవలసి ఉంది.

(బి) పదప్రయోగాలు:– శ్రీనాధుని కాలం లగాయితు పెద్దన మొదలగు పండితుల మధ్యకాలంలోని కవులు "కొను" అను ధాతువుకు బదులు "క" అను పదమును వాడారు. ఉదా:–ఎత్తుకొని పోయెను, తన్నుకొని చచ్చెను, తలవంచుకొని అను పదములను ఎత్తుక పోయెను, తన్నుక చచ్చెను, తలవంచుక అని వాడారు. ఈ కవి కూడా తన గ్రంథంలోని 77వ పేజీలో "సీతనెత్తుక చనె" 20వ పేజీలో తన్నుక చచ్చెను, 97వ పేజీలో "తలవంచుక" అనియు పయోగించాడు. ఇలా కొను బదులు క అను సంక్షిప్త రూపములను శ్రీనాధుడు తన హరవిలాసం (11, 115)లో "అంటుక" అనియు మురికి సింగన తన పద్మపురాణం (1, 100)లో "కూడుక" (3. 72)లో "సందించుక" అనియు రాయలు తన ఆముక్తమాల్యద (VI, 84)లో "మోచుకేగుచోన్" అనియు ప్రయోగించుట గమనించగలము.

(సి) వ్యాకరణ విరుద్ధ ప్రయోగాలు:– (1) చిన్నయసూరి బాలవ్యాకరణము, ననుసరించి, క్త్వార్థకమైన శత్రునకు సంధిలేదు. క్త్వార్థకము అంటే అసమాపకక్రియ ఉదా:–వచ్చి+ఇచ్చెను=వచ్చి యిచ్చెను; తూచి+యిచ్చెను=తూచి ఇచ్చెను; పంచి+ అటు= పంచి యటు అగును. ఈ వ్యాకరణ సూత్రమును అనుసరించక, కవి, తన గ్రంథంలోని 50వ పేజీలో పంచి+అటు అను పదములకు క్త్వార్థే కార సంధిచేసి "పంచటు" అను పూర్వకాలం ప్రయోగం చేశాడు. ఇలా బొమ్మెర పోతన తన భాగవతం (ఉత్తరX, 723)లో "కోసిచ్చే" అనియు రాయలు ఆముక్తమాల్యదలో (VI. 85)లో "చించిచ్చు", కుమారధూర్జటి కృష్ణలీలా విలాసము (11. 29)లో "అందిచ్చి" అనివాడగా ఈ కవులకు ఇంకా పూర్వీకుడై, 14వ శతాబ్దికి చెందిన నాచన సోమన్న ఉత్తర హరివంశం (1,143)లో "అందిచ్చె" అనియు ప్రయోగించారు.

(2) చువర్ణముతోడ దుగ్ధ కారంబు తకారంబగుఅను సూత్రము ననుసరించి "చూచుదును", చేయుదును" అనవలెనుగాని "చూతును" "చేతును" అనరాదు. ఇలాగే "చేతురు", "కోతురు" అసాధువులు. కాని కవి కాలంనాటి కవులగు కుమార ధూర్జటి కృష్ణరాయ విజయం (1,20)లో "సమంచిత గతినుతుల సేతు నెపుడు" నందిమల్లయ్య, ఘంటసింగయ్యలు వరాహపురాణం 124(VIa)లో 'జేతుపుశక్తిన్', అనంతామాత్యుని భోజరాజీయం (111, 51)లో "చేతురే" లాంటి ప్రయోగాలు చేశారు. ఈ కవియు తన గ్రంథంలోని 37, 97 పేజీలలో 'చేయుదును' బదులు 'చేతుమ' అని ప్రయోగించాడు.

(డి) విరుద్ధ అర్థ ప్రయోగాలు:– "సభ్యులు" బదులు విరుద్ధ అర్థమిచ్చే "సభికులు" అనుపదము 114 పేజీలో ఈ కవి ప్రయోగించాడు. సభ్యుడు అనగా ధర్మజ్ఞుడు, సభయందు ఉండువాడు అని అర్థము. సభికుడు అనగా ధర్మజ్ఞుడు, త్రాగువాడు, జూదరి అని అర్థములు గలవు. ఈలాంటి విరుద్ధ అర్థ పయోగాలు కూడా మనం గమనించవలసి ఉంటుంది. ఇంతవరకు కొన్ని వ్యాకరణ పయోగాలు తెలియజేశాను. ఇక ఆనాటి మత, సంగీత ప్రయోగాలను కొన్నింటిని పరిశీద్దాం.

## (2) హరి హరాద్వైత కాలప్రభావము

13వ శతాబ్దిలో జన్మించిన తిక్కన లగాయితు 16వ శతాబ్ది రాయలు కాలంవరకు హరిహరాద్వైతము దేశమంతా ప్రబలంగాఉంది. రాయలు వైష్ణవుడైనా అద్వైతాన్ని వ్యతిరేకించలేదు. ప్రజాభీష్టాన్ని పాలించి వాల్మీకి రామాయణం కాకుండా ఆనాడు పబలంగాఉన్న హరి హరాద్వైత ప్రతిపాదితమైన అధ్యాత్మ రామాయణాన్ని వరించి, ప్రముఖ కవులగు విశుతచ్చన్ మళయాళంలోనూ, సుబ్రహ్మణ్యకవి తెలుగులోనూ అనువదించారు. ఈ కవు లిరువురి గ్రంథాలు ఈనాటికీ, ఆయా రాష్ట్రాలలో, ప్రచారమంది ప్రజల అభిమానాన్ని చూరగొన్నాయి. మన సుబ్రహ్మణ్యకవి ఆనాటి సంప్రదాయాన్ని మన్నించి తన రామాయణాన్ని శివస్తుతితో ఆరంభించి తిరుపతి వెంకన్నకు కృతి యిచ్చి శివకేశవులకు యిరువురకు మంగళం చెప్పి గ్రంథం ముగించాడు.

## (3) సంగీత ప్రయోగాలు

నేడు ఎక్కువగా ప్రచారంలేని ప్రాచీన రాగాలు అయిన ఘంటా, రేగుప్తి, హిందూ ఘంటా, మంగళకౌశిక, మారువ, గుమ్మకాంభోజి, రాగాలను ఈ కవి తన గ్రంథంలోవాడాడు. వీటికి తోడు అన్నమాచార్యులు వాడిన కర్ణాటక సారంగ, గౌరీ, లాంటి రాగాలు కూడా ఉన్నాయి. ఈ కాలంలో సంగీత విద్వాంసులకు అను

ప్రచంలేని ద్విజావంతి లలిత పంచమి అను అపురూపరాగాలను కూడా వాడాడు. ఈ రాగాలన్నీ అన్నమాచార్యుల కీర్తనలతోపాటు ప్రాచీన యక్షగానాలులో ఎక్కువగా వాడుకలో ఉండేవి.

కవి విరచిత గ్రంథంలోని ఇంతవరకు తెలియజేసిన ఆధారము లతో ఈకవి 15-16 శతాబ్దుల మధ్యవాడని నిర్ణయించియున్నాను. ఈ కాలము, తిమ్మావఝ్ఝల వారిచే పేర్కొనబడిన బహులాశ్వచరిత్ర గ్రంథకర్త కృష్ణభూపాలుని కాలమునకు కూడా సరిపోగలదు.

## జన్మస్థలము

ప్రాచీన కాలంలో ఇంటిపేర్లు గ్రామాలపేరుగా గాని లేక గ్రామాలపేర్లు ఇంటిపేర్లుగాగాని వ్యవహరింపబడేవి. గ్రామప్రజ లందరూ కుల వివక్షణ లేకుండా ఆ నామమే తమ ఇంటి పేరుగా ధరించేవారు. ఇలాగే ఏ గ్రామంలోనైనా, మునులుగాని సదాచార సంపన్నులుగాని నివశించియుంటే ఆ పేరే ఆ గ్రామానికి నామ కరణం చేసేవారు.

సుబ్రహ్మణ్యకవి ఇంటిపేరు మునిపల్లె అని నిర్ణయం అయినందున ఆపేరుతోపాటు ప్రాచీన కాలంలో అచ్చట మునులు నివశించిన ప్రాంతమేనా అనికూడా పరిశీలించి జన్మస్థలం నిర్ణ యించాలి. ఈపేరుగల గ్రామం నేటి గుంటూరుజిల్లాలో ఉంది. ఆ ప్రాంతం ప్రాచీన కాలంలో మునుల స్థావరమేనా అని పరిశీలిస్తే అందుకుకూడా తగిన ఆధారాలు కన్పిస్తున్నాయి.

చరిత్ర పరిశోధకులు పురాణకాలంలోనూ, శాతవాహన రాజ్య పాలనకు పూర్వకాలంలోనూ, దండకారణ్యము దక్షిణ ప్రాంతమంతా వ్యాపించి యుండెడిదని ధృవపర్చారు. నేటి ప్రకాశం, గుంటూరు, కృష్ణా జిల్లాలు మూడున్నూ కలిసి ఒకే జిల్లా కృష్ణాజిల్లాగా బ్రిటిష్ పాలన దినములలోకూడా వ్యవహరింపబడేది. పౌరాణిక కాలంలో ఈ కృష్ణా జిల్లా అరణ్య ప్రాంతమగుటయేగాక కృష్ణానదీ, కృష్ణా – సాగర ప్రాంతముకూడా అగుటచే పలువురు ఋషులకు ఆశ్రయం ఇచ్చింది. హంసలదీవిలో పరమహంసలు వెలుగొందగా, నేటి రేపల్లె తాలూకా మోరతోట అనాడు మునులతోటగా ప్రసిద్ధి గాంచింది. శ్రీకాకుళంలో అత్రి, చ్యవలూరులో చ్యవనుడు, అవని గడ్డలో వశిష్ఠుడు, పెదముత్తేవిలో వ్యాసుడు, విజయవాడలో విజయుడు తమతమ ఆశ్రమాలను నిర్మించుకొని ఈ సీమను దివి సీమగా రూపొందించారు. అందులోని భాగమే నేటి దివితాలూకా. మన సుబ్రహ్మణ్యకవి జన్మించిన మునిపల్లె కూడా ఈ ప్రాంతానికే చెందిఉన్నది. ఇచ్చట పైన పేర్కొన్న మునుల కోవకు చెందిన ఒక ప్రముఖ ముని తన పరివారంతో నివశించియున్నందున మునిపల్లె అని ఆ పల్లెకు నామధేయం ఏర్పడింది. శాతవాహన చక్రవర్తులు ఈ ప్రాంతంలోని దండకారణ్యాన్ని ఛేదించి వాసయోగ్యంగా చేసి నందున, కృష్ణానదియు, సముద్రమున్నూ తమ మార్గములను మార్చుకొని ప్రవహింపసాగాయి అని చరిత్ర పరిశోధకులు వెల్లడించారు. ఇందువల్ల శ్రీకాకుళంలోని ఆలయము రెండుమారులు నదీగర్భంకాగా, ప్రాచీన కాలంలో ప్రముఖ రేవుపట్టణంగా విరాజిల్లిన 'కంటకసేల' అను నేటి ఘంటసాల, నదికీ, సముద్రానికీ దూరంలో ఉండిపోయిన దనియు వీరు వెల్లడించారు. వాటివలె, మన సుబ్రహ్మణ్యకవి జన్మించిన మునిపల్లెకూడా సముద్రానికిన్నీ, నదికిన్నీ క్రమేణా దూరం అయిపోయింది. ఈ వివరములన్నీ విపులంగా చరిత్రాధారంతో నేను వ్రాసిన పెదముత్తేవి క్షేత్ర మహాత్మ్యంలో వివరించాను.

నేటి గుంటూరు పొన్నూరు ఆర్. టి. సి. బస్సు మార్గంలో నర్సారావుపేటకు 4 మైళ్ల దూరంలో ఈ మునిపల్లె గ్రామముండి. ఈ ఇంటిపేరుగల బ్రాహ్మణ కుటుంబీకులు పలువురు ఇచ్చట ఉన్నారు. వీరంతా సుబ్రహ్మణ్యకవి వంశీకులము అని చెప్పుకొంటారు. ఈ కారణము లన్నియు గమనించి ఈ కవి జన్మించిన స్థలం నర్సారావుపేట వద్దగల మునిపల్లె అనియే నిర్ణయించవచ్చును. ఈ కవి ఈ జిల్లాలో జన్మించినా, చిత్తూరుజిల్లాలోని కాళహస్తివెళ్ళి తన పాండిత్య ప్రదర్శనవల్ల అచ్చట సంస్థానాధీశుని మెప్పించి వారివద్ద గురుస్థానాన్ని పొందారుగాని ఆ జిల్లాలో మాత్రం జన్మించలేదు.



# బంగారు పిడకలు

శ్రీ కలువకొలను సదానంద

మంగపతిగారి ఆస్తికి అంతూ పొంతూ లేదు. అన్నీ బంగారు గుడ్లుపెట్టే బాతులే! బెల్లంమండీ బియ్యపుమర, లారీలూ బస్సులూ, ట్రాక్టరూ థియేటరూ, గొడ్లూ గోడౌన్లూ, భూములూ భవనాలూ, ఇలా సాగిపోయే ఈ జాబితాలో బంగారక్క పేరుకూడా వస్తుంది.

మంగపతిగారి పాలిటికి బంగారంలాంటి బంగారక్క బంగారపు తీగలా మాత్రం వుండదు. వంగిపోయిన ఎండుపుడకలా వుంటుంది. తల ముగ్గు బుట్టలా వుంటుంది. చర్మమంతా ముడతలు. ఒళ్ళంతా మురికి. ఆ బంగారక్క మంగపతిగారి ఆస్తి. ఆయన బ్రతుకులో బంగారం పండించే డెల్టా.

మంగపతిగారి పెళ్ళామూ, కోడలూ పట్టుపీతాంబరాలు కట్టుకుంటారు. బంగారక్కమాత్రం ఏడాది పొడుగునా ఒకేఒక చింకికోక కట్టుకుంటుంది. రవిక తొడుక్కోదు. వాళ్ళంతా సుగంధ తైలాలు వాడుకుంటే, బంగారక్క తల మాత్రం జడలుగట్టుకు పోయింది. వాళ్ళంతా పంచభక్ష్య పరమాన్నాలు తింటారు, బంగారక్కకు పొట్టనిండా చద్దికూడు, పాసిన కూరా పెడతారు. వాళ్ళు పంకాలకింద పట్టు పరుపులమీద పవ్వళిస్తే, బంగారక్క గొడ్లచావడిలో పడుకుని గురకపెట్టి నిద్రపోతుంది. వాళ్ళు అసలు పూచిక పుల్లయినా ముట్టుకోరు. పనులన్నీ నౌకర్లకూ చాకర్లకూ అప్పజెప్పి రేడియోగ్రాం పక్కన కూచుంటారు, సినిమా హాల్స్‌లో కూచుంటారు, గీతోపదేశం చేయవచ్చిన స్వాములవారి పాదాలచెంత కూచుంటారు. బంగారక్కమాత్రం ఎప్పుడూ ఎక్కడా అలా కూచోదు. మంగపతిగారి బస్సులాగా, లారీలాగా, ట్రాక్టరు లాగా, బియ్యం మరలాగా కదుల్తూనే వుంటుంది.

విచిత్రం ఏమంటే, ఈ తేడాలను గురించి బంగారక్క కలలో కూడా ఆలోచించదు. తాను గొడ్డులా బ్రతుకుతున్నాననే ధ్యాసే ఆమెకులేదు. ఆ యంత్రానికి ముక్కడం మూలగడం తెలియదు. ఆ మరబొమ్మకు కంగా బెగులూ లేనేలేవు. పువ్వుల్ని కుంపటిలోవేస్తే అవి మాడి మసి అయిపోతాయి. బంగారక్క కుంపటిలో వికసించే పువ్వు.

ఊరిమధ్యలో మెయిన్ రోడ్డుకు యివతల ఎలిమెంటరీ స్కూలు వుంది. స్కూలుకు ఎదుట–రోడ్డుకు అవతలివైపున మంగపతిగారి మేడ, మేడ పక్కన గడ్డివామి, గొడ్లపాక వున్నాయి. ఆ పాకలో నాలుగు పాడి గేదెలు, రెండు ఆవులూ వున్నాయి. అవి మంగపతిగారివి.

ఆ పాకలోనో, పాక దరిదాపుల్లోనో బంగారక్కను ఎప్పుడైనా చూడవచ్చు. పశువుల్ని గుంజకు కడుతూనో, విప్పుతూనో వుంటుంది. వాటి పేడ పోగుచేస్తుంది. పిడకలు తడుతుంది. ఎండినపిడకల్ని గోతాల్లో నింపుతుంది. గడ్డిదులిపి గొడ్లకు వేస్తుంది. పాకలోని చెత్తాచెదారమంతా ఊడుస్తుంది. ఇల్లిల్లూ తిరిగి కుడితినీళ్ళు తెస్తుంది. అన్నంవేళకు మంగపతిగారింటి ముందునిలిచి, కలో గంజో మూకుడులో పోయించుకుని కడుపు నింపుకుంటుంది. పొద్దుపోయాక వట్టినేలే మెత్తపరుపుగా, దోమల సంగీతమే జోలపాటగా, పేడకంపే ఊదొత్తుల వాసనగా, చింకిదుప్పటి దోమతెరగా–ఆ పాకలోనే పడుకుంటుంది. నిద్ర ఆమె కళ్ళలో బసచెయ్యటానికి ముందుక్షణం ఆమెకెలా వుంటుందో తెలుసా? పోనీ, బెల్లం వ్యాపారంలో మంగపతిగారికి లక్షరూపాయలు లాభం వచ్చినప్పుడల్లా అతనికెలా వుంటుందో తెలుసా? ఈ రెండు ప్రశ్నలకూ జవాబు ఒకటే!

మంగపతిగారి మేడ, ఆ గొడ్లపాక, ఆ పరిసరాలతో ఒక లంక అనుకుంటే, బంగారక్క ఆ లంకలో ఈగనైనా వాలనివ్వని లంకిణి. తక్కిన ప్రపంచంతో ఆమెకు సంబంధమేలేదు. రోడ్డుమీద గేదెలు నెమరువేస్తూ కూర్చున్న సమయాల్లో–కన్నూమిన్నూ కానక పరిగెత్తే లారీలను, బస్సుల్నీ శాపనార్థాలు పెడుతూ వుంటుంది ఆమె. బడిపిల్లలెవరైనా పోతూ పోతూ, అడ్డంగావున్న ఆ పశువుల్ని తోక మెలిపెడితేనో, వీపుమీద చరిస్తేనో, "ఒరే మీకు దూము తగల! నోరులేని గొడ్డు ఏం జేసిందిరా నిన్ను?" అని తిట్టిపోస్తూ వుంటుంది. పాకదగ్గరగానీ, మంగపతిగారి మేడదగ్గరగానీ ఏ కుర్రవెధవో ఒంటేలు పోసుకుంటూ ఆమెకంటబడ్డాడో, స్వర్గలోకసౌఖ్యాల్లో తేలిపోతున్న వాడి తాతముత్తాతలు కూడా పుటుక్కుమంటూ వూడి, నరకంలో పడిపోవాల్సిందే!...విశ్వాసానికి మారుపేరు కుక్క అన్నారు. కుక్కలలో కూడా మేలుజాతులున్నాయికదా? బంగారక్కది మరీ మేలుజాతి. అయితే ఆమె మంగపతిగారి మేడలోకి ఎప్పుడూ వెళ్ళలేదు. మంగపతిగారి పెంపుడుకుక్కమాత్రం యిల్లంతా కలయదిరుగుతూవుంటుంది.

బంగారక్క మంగపతిగారి చుట్టంకాదు. అయితే ఆమెకు అయినవాళ్ళెవరూ లేరా అంటే, వున్నారు. పూర్వంనుంచీ ఆమెను ఎరిగివున్న వాళ్ళు ఓబులేశును గురించి చెడ్డగా చెప్పుకుంటారు. కన్నతల్లిని మరిచిపోయిన కఠినాత్ముడనీ, ముసలితనంలో దాన్ని యింట్లో పెట్టుకుని యింత గంజి పొయ్యలేక, వీధుల్లో వొదిలేశాడనీ అంటుంటారు. అది నిజంకాదు. బంగారక్క యింత గంజితాగి యింట్లో పడివుండక వీధుల్లో వుండడం మాత్రం నిజమే!

ఈ ఓబులేశు తన కుటుంబంతో, ముగ్గురు పిల్లలతో ఊరి చివరవున్న యింట్లో వుంటున్నాడు. అతడి తల్లిదండ్రులిద్దరూ మంగపతి నీడలో పనిపాటూ చేసుకుంటూ బ్రతుకుతుండేవారు. పదేళ్ళ క్రిందట ఓబులేశు స్కూల్ ఫైనల్ చదువుతుండగా, తండ్రి పోయాడు. తల్లి బంగారక్క మంగపతి కుటుంబానికి చాకిరీ చేస్తూనే కొడుకు చదువుకాస్తా పూర్తి చేయించింది. స్కూల్ ఫైనల్ ప్యాసయిన ఓబులేశు టీచర్స్ ట్రెయినింగుకూడా పూర్తి చేసి, ఆతరవాత కొంతకాలానికి ఆ ఊళ్ళోనే, ఆ స్కూల్లోనే ఉద్యోగం సంపాదించుకున్నాడు తల్లికి నచ్చజెప్పి, మంగపతిగారింట్లో పని మానెయ్యమన్నాడు. మంగపతి కుటుంబంలోని వాళ్ళదగ్గర ఆమెకు మొహమాటం ఎక్కువ. నీళ్ళు నములుతూ, ఆమె, కొడుకు చెప్పమన్నమాట చెప్పగానే, కొండంత ఆశ్చర్యంతో బుగ్గలు నొక్కుకుంది మంగపతిభార్య.

"ఏందే నువ్వనేది! నిన్నూ, నీ మొగుణ్ణీసాకి, నీ కొడుకును చెట్టంతవాణ్ణిజేస్తే, యిప్పుడు పనిజెయ్యనంటావా? నీకు కొంచెమైనా విశ్వాసం వుందా?" అంటూ దెప్పింది. యుగయుగాలుగా భూదేవిని నెత్తిమీద పెట్టుకుని మోసిన ఆదిశేషుడు, యికనేను మోయలేనంటే, భూదేవి అవాక్కయిపోదూ?

"నా కొడుకు వొద్దంటా వుండాడమ్మా! వాడికి అయివోరు పనొచ్చిందిగదా?..." అంది బంగారక్క.

"అంతేలేయే! అక్కరదీరితే అక్కమొగుడు కుక్క" అంటూ నిష్ఠూరమాడింది మంగపతిభార్య

ఉద్యోగం వచ్చిన రెండు నెలలకే, ఓబులేశు మేనమామ, అతడికి తనకూతుర్నిచ్చి పెళ్ళిచేశాడు. కోడలు కాపురానికి రాగానే, బంగారక్క గుండెల్లో మొలిచినవన్నీ ముళ్ళచెట్లే. కోడలు గన్నేరు ఉత్తమురాలు కాదు. అత్తలేని కోడలే ప్రపంచంలో ఉత్తమురాలు గన్నేరుకు అత్త వుంది కదామరి! ఆ కోడలు ఏమాట మాట్లాడినా, ఈ అత్తకు ఆమాటలు విని పొడుపులుగానే వుండేవి. పిల్లిమీద, కుక్కమీద సాకు పెట్టి తనను దెప్పుతున్నట్టే అనిపించేది. పొద్దస్తమానమూ ఇరుగింటి ఎల్లమ్మతోనో, పొరుగింటి పుల్లమ్మతోనో కోడల్ని గురించి చాడీలు చెప్పకపోతే, ఆమెకు రోజు గడిచేదికాదు. ఇంట్లో జగడాలాడినప్పుడు, అలిగినప్పుడు, విశేషంగా మంగపతిభార్య దగ్గరికివెళ్ళి, సోదె చెబుతూవుండేది. మంగపతిభార్య అగ్నిలో ఆజ్యం పోస్తూవుండేది. "అదేమిటే. అట్టాంటి కోడల్ని దెచ్చుకుంటివి! నేను చెబుతున్నాకదా, అది నీకు కూడుబెట్టదు. ఆఖరికి నీ చేతికి చిప్పేగతి!" అనేది. "ఇప్పుడు మాత్రం ఏం కొంప మునిగిపోయింది? దాని దగ్గర మాటలనిపించుకుని, దాని కాళ్ళకాడ పడివుండాల్సిన రాత నీకేమొచ్చింది? ఇంతకాలమూ వాళ్ళకూడేనా తిని బతికినావు! మేము చచ్చినామనుకుంటివా?" అని భరోసా యిచ్చేది.

ఓరోజు అత్తాకోడళ్ళమధ్య మాటామాటా పెరిగి, కోక మడిచి చంకన బెట్టుకుని, మంగపతి యింటికొచ్చేసింది. బంగారక్క తల్లి మూర్ఖత్వంతో ఓబులేశుకు తల బద్దకట్టిపోయింది. అయినా అతడు ఆమెను బతిమాలుకున్నాడు. "అమ్మా! నీకిదేం ఖర్మమే? గతిలేని దినాల్లో మన రెండు పొట్టలకోసరం రెక్కలు ముక్కలు జేసుకుంటివి. ఇప్పుడు నేనేదో నాలుగు రాళ్ళు సంపాయిస్తా వుండాను గదా? ఈ ముసిలితనంలో నీ కెందుకే ఈ వెట్టిచాకిరీ?...నీ కోడలు నిన్నేమన్నా అంటే నాతో చెప్పు. దవడపండ్లు రాలగొడతాను. అంతే గానీ, యిట్టాంటి పనులు చెయ్యొద్దే! నీ ఒళ్ళూ చెడిపోతుంది, నా పరువూ పోతుంది. నడిమధ్య నోళ్ళకు లాభం! ఇంటికి రావే!" అని గడ్డం పట్టుకున్నాడు.

"నన్ను ఆ యింటికి పిలవొద్దురా నాయనా! దానికీ నాకు కుదరదు. నేను జస్తే, వొచ్చి అంత మన్నేసేసిపో, సాలు!" అందిబంగారక్క.

అంతే! ఆ రోజునుంచీ ఆ గొడ్లపాకే ఆమెకు మకాము. ఉద్యోగం కత్తికోతగా తయారయింది ఓబులేశుకు. అతడి కళ్ళఎదుటే ఆ పనులన్నీ చేస్తూ వుంటుంది ఆమె. మంగపతి యింట్లోని వాళ్ళంతా ఆమెను "ఒసే బంగారూ!" అని పిలుస్తుంటారు. మంగపతిగారి మనవలూ, మనవరాళ్ళూ కూడా అలాగే పిలుస్తుంటే, తన చెవులతో విన్నాడు. "సార్! ఆ ముసిలామె మీ అమ్మనా సార్?" అని కొందరు బడిపిల్లలు అతన్నే అడిగారు. తలతీసేసినట్లయింది ఓబులేశుకు. తల్లిని యింటికి రమ్మని మాటిమాటికీ ప్రార్థించాడు. అతడి ప్రార్థన బూడిదలో పోసిన పన్నీరయింది. ఆమెను వశపరచుకునే శక్తి మంగపతి యింట్లో వాళ్ళ తీయని పలకరింపులకు మాత్రమే వుంది.

ఇక విధిలేక, రెండుమైళ్ళ దూరంలోని ఒక చిన్న పల్లెకు బదిలీ చేయించుకున్నాడు ఓబులేశు. ఉదయం వెళ్ళడం. సాయంకాలం యింటికి తిరిగి రావడం. తల్లి పనిచేస్తున్న వీధిలో నడిచి వెళ్ళాలన్నా అతనికే సిగ్గే. ఆమెమీద ఆశవొదులుకున్నాడతను. చాకిరీ చేస్తున్న తన తల్లి మనస్తత్వం, తన తల్లిచేత చాకిరీ, చేయించుకుంటున్నవాళ్ళ మనస్తత్వం అతనికి బాగా అర్థమైనాయి. ఆ ఘరానా పెద్దలు చాలా తెలివైనవాళ్ళు. మన వేలితోనే మన కళ్ళు పొడిచే వాళ్ళు. తన తల్లికి అది తెలియదు, ఆమె వట్టి మూర్ఖురాలు. మానసిక దాస్యానికి మరో పేరు స్వామిభక్తి అంటే, ఆ స్వామిభక్తి పూజింపరానిదీ, క్షమింపరానిదీ!

ఓబులేశుకు హృదయకంటకంగా, పదేండ్లనుంచీ జరుగుతున్న కథ యిది. ఈ కథకు ముగింపేలేదా? రోజులు ఆగవు. ముగింపు వుందన్న ఆశ ఓబులేశు గుండెలో అంకురించే రోజులు దగ్గరపడ్డాయి.

రోగమూ రొచ్చూ ఎరుగని బంగారక్కకు జబ్బుచేసింది. మంగపతి యింట్లోనివాళ్ళు రెండురోజులపాటు ఆమెను గురించి పట్టించుకోనేలేదు. పట్టించుకోవటానికి ఆమె వాళ్ళ పెంపుడు కుక్కకాదు, పాలిచ్చే గొడ్డూకాదు. మూడోరోజున-పాకలో ముడుక్కున్న బంగారక్క పైకిలేవనే లేదు. ఇక బ్రతకదు అని నమ్మకం ఏర్పడిన నిమిషంలో, క్షణాలమీద ఓబులేశుకు కబురు వెళ్ళింది. అతడు వెంటనేవచ్చి. ఆమెను యింటికి మోసుకుపోయాడు. డాక్టర్ని తీసుకొచ్చాడు. సూదులు వేయించాడు. మందులూ కొన్నాడు. వారం

రోజు-పొయ్యి ఒళ్ళు తెలియనితిలో పడివున్న అస్వస్థతకు ఆ కోడలు చేసిన సేవల్ని చూసి మాలపల్లిలోని వాళ్ళంతా వేనోళ్ళ మెచ్చుకున్నారు. బతికి బయటపడిన బంగారక్కకు కోడలిమీద సముద్రమంత వాత్సల్యం పుట్టుకొచ్చింది. ఓరోజు ఉదయం, నీరసం కాస్త తగ్గి, మాట్లాడే ఓపిక రాగానే, "ఒసే గన్నేరూ!" అంది. అంత మృదువుగా కొడుకును కూడా ఎప్పుడూ పిలిచి వుండదు.

"ఏమత్తా?" అంది కోడలు.

"పాపం, బిడ్డలు కలిగినోడు! మందులకూ, మాకులకూ ఎన్ని తంటాలు పడినాడో, బిడ్డ!" అంది బంగారక్క.

"అప్పుజేసినాడు."

బంగారక్క కొంతసేపు మౌనంగా వుండి 'ఒసే! గుడ పేలికలో కొంచెం దుడ్లు కట్టి పెట్టినాను. పోయి తెచ్చుకోమని చెప్పు వాడితో!" అంది.

"ఎక్కడుంది?"

"పిడకల గోతంలో!"

"పిడకలగోతం ఎక్కడుంది?"

"అక్కడ్నే నే! ఆ గొడ్లసావిట్లో!"

"ఎంతుందత్తా ?"

"నూరు రూపాయలకంటే తక్కువగానే వుంటాంది"

అప్పుడు ఓబులేశు యింట్లో లేడు బడికి వెళ్ళిపోయాడు.

గన్నేరు వెంటనే వెళ్ళింది మంగపతిగారింటికి. ఆ యింటి ముందు ఎవరో ఆఫీసర్లు, పోలీసులూ వున్నారు బయటి వసారాలోనే కనిపించారు మంగపతిగారు. గన్నేరును చూసి, 'ఏమి' టన్నట్లు కన్నెగరేశాడు.

"మా అత్త ఏందో దుడ్లు దాచిపెట్టిందట సామీ! ఎత్తుకుందా మనొస్తిని!"

"ఎక్కడ దాచిపెట్టింది ?" అని ఉరిమాడు మంగపతి.

"గొడ్లసావిట్లో—పిడకల గోతంలో."

మంగపతినోట్లో తడారిపోయింది. "రేపు రాపో! పనుం దివ్వాడు..." అన్నాడు కంగారుగా.

అంతే ఆ మాటతోబాటుగా గొడ్లపాకమీద దాడిచేశారు అధికారులూ, పోలీసులూ. అందులోవున్న పిడకలగోతాలు రెండిట్నీ తిరగేశారు. ఒక గోతంలో బంగారక్క డబ్బు. మరోగోతంలో మంగపతిగారి వెండి బంగారాలు, నోట్లకట్టలూ, ప్రామిసరీనోట్లూ బయటపడ్డాయి.

ఆ తరవాత అందరికీ తెలిసిన విషయమేమంటే తనయింటిని పోలీసులు సోదా చేస్తారని ముందే పసిగట్టిన మంగపతి – లెక్కకు మించిన సొమ్మునంతా క్రితం రాత్రి తీసుకెళ్ళి, పిడకల గోతంలో దాచాడు పోలీసులు సోదా పూర్తిచేసి, వుత్తచేతులతో తిరిగి పోబోతున్న సమయంలో, గన్నేరు వెళ్ళింది. లేకపోతే, వాళ్ళు పిడకల గోతాల జోలికి వెళ్ళివుండేవాళ్ళేకాదు.

ఒళ్ళు నయమైన తరవాత బంగారక్క మంగపతిగారింటికి వెళ్ళింది. "ఎందుకొస్తివే ?" అని తోక తొక్కిన తాచులా లేచింది మంగపతిభార్య.

"గొడ్లను చూసిపోదామనొస్తినమ్మా ! రెండు వారాల కింద బడిపోతినా, అవి ఎట్లా అల్లాడిపోయినాయో ఏమో..."

బంగారక్క మాట పూర్తికానేలేదు. "కొంపంతా కొల్లబెడితివి చాలదూ ? మళ్ళావొస్తివా ? గొడ్లసావిట్లోనే చంపేసివుంటే బాగుండేది..." అంటూ తాటకిలా పైనబడింది మంగపతిభార్య.

తేనెలోపడ్డ ఈగ– ఈవిధంగా బయటపడింది.

ఈ ఉదంతం విని, తన తల్లిని సంతోషపెట్టే పనిఒకటి చెయ్యాలనుకున్నాడు ఓబులేశు. కోరికతీర్చే కల్పతరువులా 'తథాస్తు' అంది, ఆఊళ్ళోని బ్యాంకు.

ఓరోజు ఉదయం ఆమె కళ్ళు తెరవగానే, వాకిట్లో కనిపించిందేమిటీ? కామధేనువులా నుంచున్న ఓ పాడిగేదె. "ఎవర్దిరా యిది ?" అంది చేటంత ముఖంతో.

"నీదేనే!" అన్నాడు ఓబులేశు.

బంగారక్క పేడపిసికి పిడకలు తడుతున్నప్పుడు "బంగారు పిడకలు తడతా వుండావా బంగారక్కా ?" అంటుంటారు యిప్పటికీ ఆ మాలపల్లిలోనివాళ్ళు.

అవి బంగారు పిడకలైనా కాకపోయినా, ఆయింట్లో–బంగారు పిడకల కంటే ఎక్కువ విలువ-బంగారక్కకే!



# విశ్వనాథవారి కిన్నెరసాని

శ్రీ దిలావర్

"యథా యథాఽ భియోగశ్చ సంస్కారశ్చ భవేత్కవేః
తథా తథా నిబంధానాం తారతమ్యేన రమ్యతా,
ముక్తకే కవయోఽ నన్తాః సంఘాతే కవయః శతం
మహా ప్రబంధేతు కవిరేకో ద్వౌ దుర్లభాస్త్రయః"

అని రాజశేఖరుడు సాహిత్య మీమాంసలో అన్నాడు.

చెదురు పద్యాలు వ్రాసే కవులు అసంఖ్యాకులు. శతకాలు ఖండ కావ్యాల వంటివి రచించే వారు నూర్గురు. మహాప్రబంధ నిర్మాతలు ఒకరిద్దరు. కాని సకల సాహితీ శాఖా పాకాలను ఒక్క చేతి మీదుగా వర్ధించిన ఘనత కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారిది మాత్రమే.

విశ్వనాథవారి విరాడ్రూపాన్ని పరిమిత పరిధిలో సాక్షాత్కరింప జేయడం అసాధ్యం. విశాల విశ్వనాథ సాహితీ సింధువులో నేనెరిగినది బిందువు పరిమాణం మాత్రమే. అయినా బిందువుల కలయికే కదా సింధువుకు మూలం అన్న ధైర్యంతో దాన్ని మీ ముందుంచ ప్రయత్నిస్తాము ...

వాక్యం రసాత్మకం కావ్యం అని కదా విశ్వనాథుని మతం? ప్రతివాక్యమూ రసాత్మకంగా సృజింపబడిన కావ్యాన్ని ఏమనాలి? ఆ అనూహ్య రసరమ్య భావనా జగతిని ఆవిష్కరించిన కావ్యం కిన్నెరసాని పాటలు! విశ్వనాథవారి ఎదలో ఉప్పొంగిన భావప్రవాహానికి పరీవాహమే కిన్నెరసాని పాటలు! క్రౌంచ ద్వంద వియోగోత్థమైన ఆదికవి శోకమే శ్లోకత్వమందినట్లు విశ్వనాథవారి యాత్మయందు నదించిన రసార్ద్ర సంగీతమే కిన్నెరసాని పాటలు!

కరగిపోతి నిలువెల్లను
తరలించితి నా జీవము
మరగిపోయె నా గుండియ
సురిగి పోయెనే ప్రియురాలా...॥ ఓ కిన్నెరసాని...॥

అంటూ తనలోని ఆవేదనను కవితాగానం చేశారు విశ్వనాథవారు.

అర్థమైన చెత్తంతా రాసి కవిత్వమను కొమ్మని దబాయించడం కాదు. కవిత్వం గడ్డి అనుకొని ప్రతి గాడిదా మేయడం మొదలెట్టిందట! ప్రతి పదాన్ని తూచి తూచి వాడాలి. ప్రతి పదబంధాన్ని సుందరంగా కళ్లకు కట్టించాలి. ప్రతి భావాన్ని రసజ్ఞ హృదయాహ్లాదం గావించాలి. సందర్భశుద్ధి, ఔచితీ పాటించి కావ్యానికి జీవం పోయాలి. చూడండి!

పరుగెత్తెదు నీవేటి
బంధము పూనతి చేతను
కారమున నేటికి బయలుగ
కాల్వగట్టె నీటి పొరలు...

అత్తపోరు భరించలేని కిన్నెర ఆవేశహృదయంతో అడవుల వెంట పరుగెత్తింది. తల్లిని కాదనలేని, భార్యను వదులుకోనూలేని కిన్నెర భర్త ఆమెజడపట్టి ఆపేందుకు ప్రయత్నించాడు. సతి సుఖాన్ని కోరిన అతనికి ఆమె దుఃఖమే మిగిలింది. కిన్నెరను అన్నుల మిన్నగా మలచినా ఆమె నీటి గుణాన్ని మరవలేదు కవి. 'కాల్వగట్టె నీటి పొరలు'అని కిన్నెర దుఃఖాన్నీ, ప్రవాహ శీలాన్నీ ఒకే ప్రయోగంలో సాధించాడు. 'ఈవు రసాకృతి వగుటను ఈ వైఖరి ప్రవహించితివి' అని మరొకచోట రమణీయోక్తితో రసానందాన్ని కలిగిస్తాడు.

ఇంతి కిన్నెరసాని యేడ్చినా యేడ్పులో
సుధతి కిన్నెరసాని చూపిన దుఃఖమూ
అవికూడ జలములై ఆమెలో కలిసినై.

కిన్నెరసాని జలస్వరూపిణి. ఆమెదుఃఖించింది. యేడ్చింది. యేడ్వగా వెడలిన కన్నీళ్ళుకూడా ఆ జలంలో కలిసినై. సర్వం జలమయమైంది. సకలం దుఃఖమయమైంది. ఆమే శోకం. శోకమే ఆమె అయింది. పూల రేకులమీదా, తృణపల్లవములమీదా ముత్యాల్లా మెరిసి చేతితో గ్రహింపగానే నీరుగా మారిపోయే మంచు బిందువులను పోలిన చమత్కారమిది.

కావ్యాలు ఉక్తి ప్రధానములుకదా? ఉక్తి వైచిత్రి, త్రిగుణాత్మకమైన కావ్యహేతువు సమగ్రంగా ఎరిగిన వారికే సాధ్యమౌతుంది. అది విద్వత్కవులకు మాత్రమే పట్టుపడుతుంది. అందుకే "విద్వత్కవయః కవయః కేవల కవయస్తు కేవలం కవయః" అని పెద్దలన్నారు.

బొట్టు బొట్టుకొక వేయి ఎదలుగా
తరగ తరగ కొక వేయి నోళ్ళుగా
ఒడలి నీరమే యేడుపు మయమై ...!

కిన్నెరసాని శోక తరంగిణి! తరగ తరగకూ వేనవేల బొట్ల నోళ్ళు! ఒక్కొక్క బొట్టులో వేనకువేల శోక సంతప్త హృదయాలు! ఆమె ఒడలంతా నీరమే! నీరంతా యేడుపు మయమే! అలతి అలతి పదాలతో అత్యంత శక్తివంతమైన భావాన్ని ఆవిష్క

రించాడు కవి. అల్పాక్షరాలలో అనల్పార్థ ప్రతిపాదన చేశాడు కవి. నైపుణివలన మామూలు పదాలే నైశిత్యం పొందాయి. జడపదాలు రక్తనాళాలు సంతరించుకొని జీవం పోసుకున్నాయి. అందుకే "ప్రతి నాటకీ శక్తి వుంది, పదనువుంది, ప్రతి చిత్రణకీ అర్థం వుంది. ఔచిత్యంవుంది" అని ఉద్ఘోషించాడు తిలక్.

యెడదలో యెదురైన
బెడదలో, కష్టాల
కడలియే కలగాంచెనో కన్నీటి
కడవలే ప్రవహించెనో.. ...

భర్త కౌగిట్లో కరగి కరగి వీరై వాగై ప్రవహించింది కిన్నెర. ఇల్లు బయల్దేరి బయటి ప్రపంచంలోకి అడుగిడితే పట్టింది కాని అడుగడుగునా కష్టాలే ఎదురయ్యాయి. మనసు కలగుండువడి కల్లోలిని అయింది. కన్నీటి కడవలు ప్రవహించింది. ఆ కళ్ళతో గాంచిన కల కష్టాల కడలి గాక యింకేమవుతుంది?

ఇప్పట్నుంచి విశ్వనాథవారిలోని పనిహాడితనం ప్రస్ఫుటమౌతున్నది. పరువంలోఉన్న అమ్మాయి. ఒంటరిది. పైగా మగణ్ణి విడిచి వస్తున్నది. అందమైన ఆడపిల్ల. ఒంటరిగా నెట్టుకుపోయే రోజులు కావివి. ఏ పోకిరి సముద్రుడైనా తనను అల్లాగి పెట్టవచ్చు. తన శీలాన్ని సొటకలపవచ్చు. కీడు శంకించింది కిన్నెర. రాబోయే కష్టం ఊహించింది. వాటినే కలగన్నది. తానై చెప్పకుండా జరగబోయే కథను అతి నైపుణ్యంతో వ్యాఖ్యం చేశాడు విశ్వనాథ.

వన్నెలాడి కిన్నెర వయ్యారపు నడకలను అతిరమ్యంగా వర్ణించాడు విశ్వనాథ సత్యనారాయణ.

కదలగా కదలగా
కాంతి కిన్నెరసాని
పదువు కట్టిన లేళ్ళు కదుపులా తోచింది
కదలు తెల్లని పూల నదివోలె కదిలింది
వదలు తెల్లని త్రాచు పడగలా విరిసింది.

నురుసులు గ్రక్కుతూ, సుళ్ళు తిరుగుతూ, హొదుగులు పోతూ అద్దరిద్దరి హోరుసుకుంటూ ప్రవహించే కిన్నెరసాని కవికి అనేక దర్శనమిచ్చింది. పదువు కట్టిన లేళ గుంపులా, కదిలిపోతున్న పూలనదిలా, విరిసిన తెల్లని త్రాచు పడగలా రమణీయంగా కదులుతున్న రమణి కన్నులకు కట్టింది. అందమైన అలంకారాలతో జాను తెనుగు పలుకులతో కవితాకన్య మనసు పలకరిస్తున్నది.

విస్మృహతో పతి రాయివలె మారిపోయాడు. పతిని విడలేక కిన్నెర సుళ్ళుతిరిగిపోయింది. తన కెరటాల హస్తాలతో కౌగిలించుకుంది. వెతపొంది బిట్టు ఘోషించింది. రాయిని కరిగి, ప్రవహించుమని వేడింది. కెరటాలు కెరటాలుగా కలిసిపోదామంది. వీయందు యిక తప్పుచేయను అని బాస చేసింది. కలిగిపోయింది. వలిగిపోయింది. బడలిపోయింది. మండి యారివ నిప్పుమ్మాదిగా హరించింది పతిని వదల లేని ఆ ముదిత తల్లి దగ్గరమండి మెడకు పలుపోసి లాగబడ్డ లేగ దూడలా సాగింది.

సాగింది సాగింది
జాలుగా పారింది
ఆవు పొదుపున పాలధార కట్టినయట్లు
వనదేవతలు నీళ్ళు వొలకబోసినయట్లు
తలి చల్లని ప్రేమ వెల్లివారిన యట్లు

తెలి తారకల వెలుగులా, తలిరు పూవుల నెత్తావిలా, తెలుగుపాటల తియ్యందనంలా రసార్ద్రంగా లోకోత్తరంగాసాగిందివర్ణన.

అడవిలో చిఱుపాయ
శైవాలులై కిన్నె
రటు ప్రాకి యిటు ప్రాకి

దివ్య నృత్యములతో దివ్యనిస్వనములతో
దిగ్దిగంతము లంటెనే మురనదీ
దీప్తి దిక్కుల చిమ్మెనే!

ఈ వర్ణనల్లోని శాబ్దిక సౌందర్యం కిన్నెరతో సమానంగా పోటీపడి చిఱుపాయలై, జాలులై అటు పాకి యిటుపాకి దివ్య నిస్వనాలను వినిపిస్తోంది. వస్త్వలంకార ధ్వనులను ఒకదానికన్న ఒకటి మిన్నగా సంతరించుకున్నదీ కావ్యం. వస్త్వలంకార ధ్వనులు కూడా రస పర్యవసాయులే అని కదా ధ్వన్యాలోకం. రసమయమైన కావ్యంతో లయాన్వితమైన ఛందమును జతచేసే బంగారానికి పరిమళమబ్బినట్లుంటుంది విశ్వనాథవారు ఎన్నుకున్న జానపదగేయ ఛందస్సు కావ్యానికి ఔన్నత్యం కలిగించి రసానంద ప్రాప్తిని ఇనుమడింప జేస్తున్నది. **Congruity of the images** తోపాటు **Musical composition** ఈ కావ్యంలో పోటీ పడుతున్నది.

పొంగారు అలలతో సింగారము లొలుకుతూ చెంగు చెంగున దూకే "కిన్నెరనృత్యం" మనోహరంగా చిత్రింపబడింది. 'ముహుర్ముహుర్నృత దభంగ తరంగ మృదంగ నిస్వనాలు' చిరువెల్లు పొనలై సిరులొల్కు సొనలై లోగొంతు రాగాలు వెలయించాయి. దరులొత్తు నురుగుతో గల్లుగల్లున మోగుతూ, జల్లుమని వెల్లువలు విరజిమ్ముతూ వన్నెవన్నెలు పోయింది కిన్నెర. క్రొన్నెల తళుకు లొప్పింది. తెలిపూల తేనె వాకలు వారగచేసి తెమగు వాగై పారింది.

పికిలి పిట్టల యీలలకు క్రొత్తపాటగా "కిన్నెర సంగీతం" సాగింది. తలిరాకు కన్న మెత్తనిది కిన్నెర సంగీతం. అంచ కన్నె సమ యెల్లు అడవి సాగినయట్లు, అందగత్తెల జిల్లుటందె మోసినయట్లు, వనము వనమంతా ఒకపాటయై పోయినట్లు ఏటికిన్నెరపాట ఎగిరెగిరి మిన్నందింది.

గాలిపిల్లలే పోయి పూదెనో, మొగిలు కన్నెలే చెప్పెనో కిన్నెరసాని సొగసు చూడాలని గగనమున్ కొనదాక కెరటాలు పుదికించి చూశాడు సముద్రుడు. కిన్నెరసాని తలపులో అతని నీటిగుణం యింకిపోయింది. అతనిలోని బడబాగ్ని మదన తాపమై రగిలింది. మంచి

కిన్నెరసాని, మగనికెక్కిన చావ తనను పొందునా? తనకు దక్కునా? వెందేపోటుతో సతమతమయ్యాడు సముద్రుడు.

కడలి మిన్నులు తాకూ, తరగలు పూగూనూచి కిన్నెర కీడు తలచింది. ఆమె చితాన పొగలెగశాయి. క్రొన్నిప్పుకలు కుమిలించాయి. నాధుని విడిచివచ్చినందుకు తన్నుతాను నిందించుకున్నది. ఈ యేవపుం బ్రదుకు ఏల పొందితినని వగచింది. చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్టు అప్పుడు నిలిచి పోనెంచింది. కాని ఏం లాభం. ఆమె ప్రవాహశీలి. రాయడ్డంగా వేసుకున్నా పొదలడ్డంగా, వేసుకున్నా కదలి పోక తప్పుతుందా?

"కిన్నెరనృత్యం, కిన్నెర సంగీతం కడలిపొంగు"లలోని కథా కథనం అలవోకగా సాగిపోతుంది అనవసరమైన పదబంధాల ప్రతిబంధకాలు లేకుండా, సగా సాల అమవసలు లేకుండా హాయిగా వెన్నెలవాకలా సాగిపోతుంది.

ప్రాకిపోయే తన గుణం చంపుకోజాలక హాయని యేడ్చింది కిన్నెర యేడుపు నిప్పుకలు ఎగసి చిమ్మింది.

చుక్కనైతే యీ బెడద తప్పునే

మొక్కనైతే యీ వగపు తప్పునే!

అంటూ వాపోయింది. విశ్వనాథవారి లోకజ్ఞతకూ, నిశిత పరిశీలనకూ పై చరణాలు చక్కని ఉదాహృతులు. ఏవరైనా ఆపదలో ఉన్నప్పుడు "అడవిలో మాకునై పుట్టినా బాగుండును!" అని అనుకోవడం లోక సహజంకాదా. చుక్కైనా, మొక్కైనా ప్రవహించడం తప్పేది. ప్రవహించడం తప్పినప్పుడు పతి సన్నిధి దక్కేది!

కడలి లో కాలే లేరాజు. ధర్మములు నిలిపే దొర. కంచే చేను మేసినట్లు అతడే పతివ్రతల కవయనెంచి అధర్మానికి పాల్పడితే యిక దిక్కెవరు? కిన్నెర యేడ్చింది. ఏడ్చి ఏడ్చి జలమెల్ల ఎర్రనై తనువెల్ల నల్లనయింది. వడకల్లు వేగుయ్యాయి. కథకూడా వేగం పుంజుకుంది.

అల్లనల్లన కిన్నెర యేడ్పులు గోదావరి గర్భము వెళ్ళిలో వొరబారి మొరపెట్టుకున్నాయి. గోదావరి జాలిగుండె పేగులు తడిసి. గేదంగి తెల్ల రేకెత్తు క్రొత్త రగలో చాదుకొని అభయమిచ్చింది. కెరటాలు చాచినది. గోదావరి సంగమంతో కిన్నెరసాని దిగులు మానింది.

తూర్పున తెల్లనై ఉషఃకాంత తోచినది మొదలు పడికి రేయి వరకు మరకతాలు నెలపరచబడ్డట్టు, పారుటాకుల మీద పసిమి యూదినయట్లు కిన్నెర వన్నె చిన్నెలు వర్ణించబడ్డాయి.

ఋతువు ఋతువున మారు రుచులలో కిన్నెరా
కారు కారున మారు కాంతిలో కిన్నెరా
తెలుగు పత్కవిరాజు పలుకందుకోలేని
ఛవులూరి ఛవులూరి జలముల్ల ప్రోవులై
కదిలెను కిన్నెరా!
సాగెను కిన్నెరా!

ఋతువు ఋతువులో "కిన్నెర వైభవ" దశలను అత్యంత శక్తివంతంగా సుందర తమంగా చిత్రించారు విశ్వనాథవారు కాలక్రమ పరివర్తనలో, అనంతమైన కిన్నెర ప్రవాహరూపాలను అందంగా మలచారు విశ్వనాథవారు.

రమణీయార్థ ప్రతిపాదక శబ్దాలతో, సుందర బంధురమైన పద బంధాలతో, ప్రశస్తమైన వస్త్వలంకార ధ్వనులతో, అనితర సాధ్యమైన శిల్ప విన్యాసంతో కావ్యత్వ మొందింది కిన్నెరసాని. రసామర వాహిని కావ్యగానంచేసి అమరత్వ మొందాడు కవిసమ్రాట్.



# విశ్వనాథవారి కోకిలమ్మ పెళ్ళి

## శ్రీమతి రాజేశ్వరి దివాకర్ల

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారొక జ్ఞానపీఠము. ఈ జ్ఞాన పీఠమును సముచితముగా సత్కరించినది జ్ఞానపీఠము. సాంద్రమైన ఈ జ్ఞాన దీప్తిలోని చిరు కిరణమే 'కోకిలమ్మ పెళ్ళి'

విశ్వనాథవారు గేయ కావ్యకర్తలుగా కూడా సుప్రసిద్ధులు. వీరి కిన్నెరసాని పాటలు ఆంధ్రుల హృదయాలలో కిన్నెర సంగీతాలను ఆలపించాయి. 'కోకిలమ్మ పెళ్ళి' అనే గేయ కవితలోని భావ మధురిమ అందరిని ఆకట్టుకుంటుంది.

'కోకిలమ్మ పెళ్ళి' కవితావిమర్శచేసేముందు అందులోని కథను తెలుసుకోవడం చాలా ముఖ్యం. ఇది చాలాకాలం క్రిందటికథ. తెలుగుదేశంలోని ఒక పల్లెదొరకు ఇద్దరు కూతుళ్ళు. చిలుకతల్లి, కోకిలమ్మా, వాళ్ళపేర్లు. వీళ్ళిద్దరికి రంగూరూపూ వేరు. చిలుకమ్మ అందంగా ఉండేది. ముద్దు ముద్దు మాటలు చెప్పేది. కోకిలమ్మ నల్లనిదే కాకుండా మాటలుకూడా రావు. చిలుకతల్లినిచూస్తే తండ్రికి చాలా ప్రేమ. కోకిలంటే చిరాకు. తండ్రిచూపే నిరాదరణకు కోకిలమ్మ దేశగా తల్లివెనుక నక్కిపోయేది. ఆమె స్థితిచూసి తల్లి ఏమీ చేయలేక విసుక్కునేది. అప్పుడు కోకిల ఒంటరిగా అడవిలోకి పోయి అక్కడి చెట్లనూ, పూవులనూ, కొండలనూ చూస్తూ కూర్చునేది. చిలుకకూ కోకిలకూ యుక్తవయసువచ్చింది. తలిదండ్రులకు చిలుక పెళ్ళిని గురించి చింతేకాని కోకిలను తలచనైనాలేదు. ఒకనాటి మధ్యాహ్నం వేదపనసలు చెప్పుకొనే బ్రాహ్మణుడొకడు వచ్చాడా ఊళ్ళోకి. అతనికి మనసిచ్చింది చిలుకమ్మ. మనసు చెదిరిన కోకిల అడవిలోకిపోయి తిరిగి ఇంటి ఛాయలకు రావడం మానేసింది. సహజ ప్రేమగల తల్లి కూతుర్ని వెతుక్కుంటూ అడవిలోకి వెళ్ళి ఆమెను అనునయించింది. తల్లి ప్రేమకు పరవశించి కోకిల కమ్మగా పలికింది. మధురమైన కోకిల పలుకులు విని వసంతుడు పరవశించి ఆమెను చేరవచ్చాడు. వసంతుని అందానికి, కోకిలమ్మ గొంతుకు సరియైన జోడీ కుదిరిందని వనమంతా ఆనందించింది. ప్రకృతి వాళ్ళిద్దరికి వైభవంగా పెళ్ళిచేసింది.

పై కథ సామాన్యమైన ఒక కన్నెపిల్ల కథలా గోచరిస్తుంది. కాని ఈ కథను సృష్టించడంలో కవి భావన వేరు. కవి ఇందులో అన్యాపదేశంగా ఒక సాంప్రదాయ బద్ధమైన సిద్ధాంతాన్ని చెప్పాలని తలచారు. ఈనాడు అవిరళ ప్రచారంలోఉన్న ప్రతీకాత్మక కవిత ఇందులో ఊపిరిని పోసుకుంటుంది. ఈ కవితలోని అంతరార్థమేమిటో చివరి పంక్తులు చదివేవరకు బోధపడదు. ఆ పంక్తుల్లో కవి

"చిలుక తల్లి మహాన్వయంబున  
నిలచినవి సాంస్కృతిక వాక్కులు  
కోకిలమ్మా తెనుగు పలుకూ

కూడబెట్టింది"అంటూ తన కావ్యోప సంహారాన్ని కావిస్తారు. ఈ పదాలు కోకిలమ్మ పెళ్ళిలోని సారభూతమైన భావాన్ని సరసంగా ప్రకటిస్తాయి. కవి చిలుక తల్లిని సంస్కృతభాషకు, కోకిలమ్మను తెలుగు భాషకు ప్రతీకచేసి ముందు అతి సామాన్యంగా గోచరించిన కథార్థాన్ని చివరకు వ్యంగ్యం చేస్తారు.

సంస్కృతము, తెలుగుభాషల అన్యోన్య సంబంధాన్ని గురించిన వాదాలు భాషాశాస్త్రంలో అనేకం ఉన్నాయి. కాల్డ్వెల్ పండితుడు తెలుగు ద్రావిడ భాషాజన్యము అని చెపితే డా॥ చిలుకూరి నారాయణ రావు ప్రభృతులు తెలుగు సంస్కృత ప్రాకృత జన్యమని విశ్వసించారు. ఆదికవి నన్నయ "ఆంధ్రశబ్దచింతామణిలో" "ఆద్య ప్రకృతిః ప్రకృతిశ్చాద్యే ఏషా తయోర్భవే ద్వికృతిః" అని తెనుగును సంస్కృత ప్రాకృత భాషల వికృతి రూపముగా పేర్కొన్నాడు. ఆదికవిలాగే విశ్వనాథకూడా తెలుగు సంస్కృతాలు అన్యోన్య సంబంధము కలవి యని విశ్వసిస్తారు. అందుకే సాంస్కృతిక వాక్కులకు, తెలుగు పలుకులకు ప్రతిరూపాలైన చిలుకమ్మను, కోకిలను తమ కవితలో అక్కచెల్లెళ్ళుగా నిరూపించారు. ఇక ఈ భాషల అన్యోన్యతను కవితాపరంగా ఎలా నిరూపించారో చూద్దాం.

విశ్వనాథవారు తాము చెప్పదలచుకున్న భావాన్ని కవితలో నిష్కర్షగా చెప్పదలచుకున్నారు. అందుకనే కావ్యారంభంలో

"లేత బుర్రలు కొక్కిరిస్తే  
అతగాళ్ళతో యేమిగానీ  
తాత తాతల నాటి కతలూ  
తప్పి పోస్తానోయ్" అంటారు.

లేత బుర్రలు అంటే మిడిమిడి జ్ఞానంకల పండితులు; వాళ్ళు తన కవితను గురించి ఏవిధంగా తలచినా తాము లెక్కించబోమని తెలుపుతారు.

అనాదిగా తెలుగువారికి సంస్కృతమంటే అభిమానమెక్కువ. పూర్వం సంస్కృతభాషాపాండిత్యం ఉన్నవారే సంస్కారులుగా ఎన్నబడుతూ ఉండేది. పూర్వాంధ్ర వాఙ్మయాన్ని చూచినా మనకవులకు సంస్కృత భాషాభిమానం అపారమైనదని తెలుస్తుంది. తెలుగువారికి గల సాంస్కృతిక వాగభిమానాన్ని పురస్కరించుకునే విశ్వనాథ, ఆ వాక్కులకు ప్రతీక అయిన చిలుక అంటే తలిదండ్రులకు చాలా ప్రీతి అని వర్ణించారు. కోకిలంటే నిరాదరమని తెలిపారు. ఆ కాలంలో వేదశాస్త్రాలు అభ్యసించిన బ్రాహ్మణులకు సంస్కృత భాషపైన అధికారం ఉండేది. అందుకనే కవితలో చిలుకమ్మ వేదపనసలు చెప్పుకునే బ్రాహ్మణుని వరించింది. కోకిలకు మాటలు కూడా రావన్నారు కవి. వసంతకాలంలో మాత్రమే కోకిల కూస్తుందని చెప్పడం కవి సమయం. అలాగే తెలుగు నందనంలో వసంతం విరిసేవరకు కోకిలమ్మ పలుకలేదు. ఒకసారి నోరువిప్పిన కోకిల ఇంకా తెలుగు పలుకులను కూడబెడుతూనే ఉంది. ఆ మంజులా రావంలోని స్వచ్ఛత వసంతుని మరి మరి మురిపిస్తూనే ఉంది.

విశ్వనాథవారి భావుకత కవితనిండా పల్లవించింది. కోకిల, చిలుక కన్నెపిల్లలు. వయసు తెచ్చిన సహజమైన వారి అందాలను వర్ణించడానికి కవి ఏ ఉపమానాలను వాడలేదు.

"ఆ దొరకి కూతుళ్ళిద్దరు

మోదుగలు పూచాయి పెదవులు" అని కేవలం ఒకపంక్తిని వ్రాసారు. మోదుగపూలు ఎఱ్ఱనివి. ఈ పూలు తరుణత్వానికి రమ్యమైన చిహ్నాలు. పాఠకుడు ఒక్కసారి మోదుగ పూవును ఊహించుకున్నంత మాత్రాన ఆ కన్నెపిల్లల సౌకుమార్యం కళ్ళెదుట ప్రత్యక్షం అవుతుంది. కుటుంబంలోని వారందరిచేత నిరాదరింపబడిన కోకిల దుస్థితిని తెలుపడానికి కవి ఏ సమాసాలను ఉపయోగించలేదు.

"చిలుక తల్లీ నవ్విపోతే
తండ్రి మారూ పలుకకుంటే
తలి వంకా చూచి కోకిల
తెల్లపోతుంది"...

"చిలుక తల్లీ వెక్కిరిస్తే
తండ్రివచ్చి కసురుకుంటే
తల్లి వెనుకా దాగిపోతూ
తల్లడిలుతుంది"... అంటూ ఎంతో సహజంగా వర్ణించి ఆ భావాన్ని ఎంతో ఆత్మీయం చేసారు.

వేద బ్రాహ్మణుని వర్ణన వచ్చేటప్పటికి ఆ కాలపు పలుకుబడినే ఉపయోగిస్తారు.

"వేద పనసలు చెప్పుకుంఛూ
వాదముంకూ కాలు తవ్వుఛు"
"ఆతని వేదద్యానములు వింఛూ
ఆతని వర్చస్సుంత కంఛూ"

ఇందులో చ కారాన్ని వత్తి పలకడం ఆ సందర్భానికి ఎంతో ఉచితంగా ఉంది. దొర పాలించే పల్లెను వర్ణించే సందర్భంలో కవి ఒక నవ్య భావాన్ని వెల్లడించారు.

"ఉన్నవాళ్ళకు ఎంతనేల
దున్నుకుంటే చాలుతుందో
మించి ముట్టరు కూడ పైనా
చిన్న చెక్కయినా"

ఆ కాలంలో దున్నేవాడికి ఎంత భూమి చాలుతుందో దానినిమించి చిన్న చెక్కయినా ముట్టుకోలేదట. ఈ భావం నేటి ఇరవైసూత్రాల పథకానికి చక్కగా సమన్వయిస్తుంది.

ఈ కవిత అత్యంత సరళమైనది. తెలుగు సంస్కృతాల అన్యోన్య సంబంధం వివరింపబడే ఈ కవితలో సంస్కృత పదాల వాడుక తక్కువ. ముత్యాల సరాలలో వ్రాయబడిన ప్రత్యక్షరం ముద్దులొలుకుతూ ధారాశుద్ధితో శోభించింది.

# తాత్త్వికకళాజగత్తులలో కలలు బాగా ఎవరు కంటారు

## శ్రీ కొండిపర్తి శేషగిరిరావు

అందంగా కలలు కనటానికీ సుందర స్వప్నాలలో విహరించి మధురంగా భావించటానికీ, కళాకారులే తగిన సమర్థులనీ, వారి భావాల్ని ఏవీ గుంజిపట్టుకొని క్రిందకు లాగలేవని అనుకొంటుంటాం.

కానీ భావించటం అన్న దానిని పట్టుకొని, కళలమీదా, తత్వశాస్త్రంమీదా పరచిచూస్తే; ఒక తత్వవేత్త భావించినంత వైశాల్యంలో అంత సుదూరంగా ఎవరూ భావించలేరేమోనని అనిపిస్తుంది. ఈ తాత్త్వికుని ఊహ అన్నిటిలోనూ చొరబడటానికీ, ఇతను దానిమీద ఆధారపడి కలలు కనటానికీ; ఇంకా వీలుంటే వీటన్నిటిమీదా నిలబడి ఎంతో పెద్ద కల గనటానికీ అవకాశం ఉంది.

ఇలా భావించబడిన ఇతని కలలో ఎక్కువభాగం జరగటానికి అవకాశముంది. ఎందుకంటే ఇతని కలవేసిన ప్రతిఅడుగూ, ఆ అడుగు క్రిందనున్న 'సబ్జక్టు' పూర్వాపరాల వాసనను కలిగి ఉంటుంది. కనుక ఇతని కల ముప్పాతిక మువ్వీసాలు జరగటానికి ఎక్కువగా అవకాశముంది.

ఈ స్థితిలోని తాత్త్వికుని కల ఉచ్చులువేసి బిగించటానికి కూడా వీలుపడలేనంత బలంగా ఉంటుంది ఒకోసారి అంతబలంగా విశాలతలో విస్తృతిలో సాగిపోతుంది ఇతని కల.

అందుకని కలలు కనేవారిలో తాత్త్వికుడు మొదటివాడుగా నపోడు ఇతను కలలు కనటానికి వీలులేని చోటంటూ ఉండదు అంత విస్తృతమైంది ఇతని పరిధి. కనుక అంత సువిశాల పరిధిలో ఎక్కడ ఏ మూలనుంచైనా ఏ రకమైన కలనన్నా కనగలడు వీలుంటే అవి నిజమవగలవని కూడా చెప్పగలడు. అవకాశం ఇస్తే వాటిని నిజంకూడా చేయగలడు.

★ ★ ★

పోతే కళాకారుని తీసుకొంటే, ఇతను ఈ విశ్వంలోని భావననంతనూ తన గుప్పెట్లో పెట్టుకొన్నవాడుగా ఉంటాడు. ఇతను ఎంతగానో ఊహాజగత్తులో విహరించగలవాడుగా కనిపిస్తాడు.

కానీ ఇతని ఊహ ఎంతవరకూ తన కన్నుచూచినా, తన చెవివిని వాటిని, తన శరీరం తాకిన వాటినీ మాత్రమే అందంగా వ్యక్తపరుస్తుంది. ఆ తరువాత ఆ ఊహను ఇతను ఎంతో అందంగా వ్యక్తపరుస్తాడు. అంటే అవి ఇలాంటివీ అలాంటివీ, లేకపోతే వాటిని ఒక దాని ప్రక్కన మరొకదానినీ పెట్టి ఉపమానంతో పోలుస్తూ చెప్పగలడు. వినిపించగలడు. చూపించగలడు. పోనీ ఇంకా పైకిపోతే, వాటిలోలేని అందాల్నీ, కాని కొన్ని స్వభావాల్నీ ఊహించి వాటికి అంటగట్టి ఆ అందమే ఈ అందం అవే ఇవీ అని అనిపించగలడు.

ఇంకో విశేష మేమంటే, తన ఊహలనన్నింటినీ పంచదారతో కలిపి తినిపించగలడు. అలాంటివాడు కళాకారుడు.

ఇంతచేసినా అతను రామణీయతా సుందర సృష్టి అనే ఒక్క దానిమీద ఆధారపడే తన ఊహను నడపాలి.

అతని ఈ ఊహ వస్తుపరమైన దానిమీదా, ప్రకృతి పరమైన దానిమీదా, గతంమీదా, వర్తమానంమీదా అధికంగా ఆధారపడి ఉంటుంది. ఒకోసారి ఈ రెంటినీదాటి భవిష్యత్తుమీదకు కూడా అందంగా పోతుంది. అలాంటి స్థితులలో ఉండే కళాకారుని కల కేవలం అందం, ఆనందం అంటూనే కలవరిస్తుందీ పలవరిస్తుందీ కాకపోతే సుఖం అనో, కాకపోతే అనుభూతి అనో, లేక ఆహా! ఓహో! అనో అని అంటుందేగానీ, నిర్దిష్టమైన ఓ హేతుమయమైన స్పష్టమైన కలను అక్కడ కనలేదు. దానివల్ల కలను కనే తత్వంలోని బలాన్ని కళాకారుడు కొంత కోల్పోతున్నాడు.

★ ★ ★

అలా కళాకారుడు ఆగిపోయినచోట తత్వవేత్త లేస్తూ, ఇది ఇలా ఉంటుంది. అలా ఉంటుంది. ఈ కారణాలవల్ల ఇది ఇలా ఉండగలిగింది. ఆ కారణాలవల్ల అది అలా ఉండగలిగింది అని కారణాల కలలను కనటం ప్రారంభిస్తాడు.

ఇవి దాటితే ఇవి తగులుతాయి. వాటి స్వభావాలు ఇవి. ఆ స్వభావాలు ఇందువల్ల అందులోకి వచ్చాయి. అవి రాబట్టే ఇవి ఇలా ఉండగలిగాయి అని అంటూ—

ఇంకా ఇవికూడా దాటితే, అనే ప్రతిపాదనతో తన స్వాప్నిక జగత్తును ముందుకు నడపటానికి మెట్లను కట్టుకొంటూ ఇంకా ఇంకా ముందుకు సాగిపోతుంటాడు. కనుక తాత్త్వికుని కల ఎప్పుడూ ముందుకుపోతూనే ఉంటుంది. ఆ కల ఎప్పుడు ముందుకు పోలేదు అని అంటే సమాధానం చెప్పటంకష్టమేమరి.

ఈ మధ్యలో అతను చిన్నిటిమీదనో కలలుకంటాడు. ఎంతో సొంపైన కలను కంటాడు. ఎన్నిటినోదాటి కలలు కంటాడు. ఇలా పెద్ద పెద్ద కలలను ఎలా కనగలడు అని ప్రశ్నించుకొంటే దానికి అతని స్వాప్నిక జగత్తే సమాధానం చెప్పాలి గానీ మరొకరు సమాధానం చెప్పలేరేమోననికూడా అనుమానం.

* * *

ఇలాంటి ఈ రెండు స్థితులనూ ఇంకొంచెం పరిశీలిస్తే, కళాకారుడు తన కలకు ఒక రూపాన్నిచ్చి తన సుందరమైన కలను రసకృతులద్వారా బహిర్గతం చేస్తుంటాడు. ఇక్కడ కళాకారుడు ఒక పనిని చేస్తున్నాడు. ఈ దృష్టితో కనుక తాత్వికునిచూస్తే —

ఇంకేముంది తాత్వికుని పని,అయిపోయింది. అతని కల కల్లగానే మిగిలిపోయింది. ఒకదానిని సృష్టించడం అంటూ జరగటంలేదు అని అనిపిస్తుంది.

కానీ తాత్వికునిలో మనం ప్రవేశించి సమాధానంకోసం వెతికితే అది సమాధానం చెప్పుందిగదా, నేను నా కలలోఉండే 'మెటీరియల్' వంతా ఒడబోసి సారంతీసి సిద్ధాంతాలను సృష్టి చేస్తుంటాను అని చెబుతుంది.

కనుక కళా, తత్వశాస్త్రమూ అన్నవి రెండూ రెండు పనులను చేస్తున్నాయి. కాకపోతే ఒకటి తీపి పని, మరొకటి తీపు పని.

అందుకని ఈ రెంటికీ కలలు కనటంలో సమస్థాయిఉన్నా తాత్వికునికే కాస్త ఎక్కువ చోటున్నట్లనిపిస్తుంది.

తాత్వికుని కల తీయగా ఉండదు. అసలు కల అంటేనే తీయగా ఉండాలిగదా. కనుక కళాకారుని కలే నిజమైన కల, కలగా చెప్పబడుతున్న తాత్వికునికల కలకాదు, అని అంటే, పోనీ తాత్వికునిది ఊహ అందామా. ఈ తాత్వికుని ఊహైనా, కళాకారుని కలైనా, జాగ్రదావస్థలోనే జరుగుతోందిగదా. కనుక 'ఊహ' 'కల' అన్నవి వీరుభయులలోనూ సమస్వభావులే.

* * *

ఈరెంటినీ పట్టుకొని పరిశీలిస్తున్నప్పుడు సామాన్యులూ సమాజమూ అనుకొంటున్న మాటలను వింటే—

సమాజం అంటుందిగదా కళాకారుడు అంటేనే భావకుడూ తీయటి కలలు కనేవాడూ, అతను ఎంత దూరమైనా పోగలడు. అతనికి అంతులేని ఓ పెద్ద అందమైన కలఉంది. కానీ తాత్వికుని తర్కం ఎప్పటి కప్పుడు లాగిపట్టుతూ ఉంటుంది. ఆ లాగిపట్టటం వల్ల తాత్వికుడు కలనుకనే స్వేచ్ఛను కోల్పోయి, ఎంతసేపూ 'చూడబడినా' 'గ్రహించబడినా' హేతువుచుట్టూ, కారణంచుట్టూ గిరగిరా తిరుగుతుంటాడు అని అనిపిస్తుంది.

కానీ కాస్త ఆలోచిస్తే కళాకారుడూ లేక రస స్రష్ట, రసమూ అనుభూతీ అన్నదాంతో తన కలను పూర్తి చేస్తుంటాడు. కానీ తాత్వికునికి ఎక్కడికక్కడ ఎక్కటానికి మెట్టు రెడీగా ఉంటుంది. తర్కంవల్లా ఇంకా తెలుసుకోవాలి అనే జిజ్ఞాసవల్లా మరోమెట్టును ఏర్పరచుకొంటాడు. దాన్ని అతను ఎక్కిపోతుంటాడు.

కనుక బాహ్య దృష్టిలోఉన్న కళాకారుని కలలను కనేస్థానాన్ని తాత్వికుడు అందుకొంటున్నాడు పరిశీలనలో.

తాత్వికునికిఉన్న కలలు బాగా కనలేని స్థానాన్ని పూర్తిగా కాకపోయినా కొంతవరకు కళాకారుడు అందుకొంటున్నాడు, పరిశీలనతో చూచినప్పుడు.

కనుక పైకి కనిపించిన కలలుకనే కళాకారుని స్వరూపం తాత్వికునిదిగానూ, అంతబాగా కలలు కనలేని తాత్వికుని స్థితి కళాకారునిదిగానూ భాసిస్తూఉంది దార్శనిక దర్శనంలో.

కళాకారుడు అంతగా కలలు కన లేకపోవటానికీ, తాత్వికుడు ఇంకా కలలు కనటానికి మరో కారణంఉంది.

కళాకారుడు కలలు కనీ కనీ ఒక స్థితిలో ద్రవీకరించి అక్కడ కరిగి (కళాకృతిలో) అంతరించిపోతాడు. తాత్వికుడు ఆ స్థానంలో ద్రవీకరించినా కరిగిపోడు, ఓజస్సుతో ఇంకా కలలు కంటూనే అలా కలలు కనటానికి ఇంకా ప్రశ్నలు వేసుకొంటూ ప్రశ్నల మెట్లను కట్టుకొంటూ సమాధానపు కలలను కంటూ ముందుకు సాగిపోతాడు.

ఈ ఒక్క సత్యమే కళాకారుని కలలు ఆగిపోవటానికీ; తాత్వికుడు కలలు ఇంకా కనటానికీగల కారణం. ఆ ద్రవీకరణ స్థాయిలో కళాకారుడు కళా నిర్మాణంలో నిమగ్నమౌతాడు. తాత్వికుడు ఆ స్థితిలో ప్రశ్నను లేక ప్రశ్నలను తయారు చేసుకొంటుంటాడు ఇంకా ముందుకు పోవటానికి.

అందుకని

కళాకారుడూ తాత్వికుడూ సమస్థాయిలో సమసాం దశలో కలలను బాగా కనేవారయినా, కళాకారునికన్నా తాత్వికుడు ఒక్కవాసి ఎక్కువగా కలలు కనగలడేమోనని అనిపిస్తూ ఉంటుంది రసతాత్త్విక అంతర్ లోకాల పరిశీలనలో.

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు: వారి అనుభవాల జ్ఞాపకాలు

"శ్రీ విరించి"

శ్రీ శ్రీ. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తెలుగు వచన రచనలో కాకలు తీరినవారు; శిష్ట వ్యావహారిక భాషకు ఒరవడిపెట్టి గ్రంథ రచనలో నూతన సంప్రదాయాన్ని నెలకొల్పినవారు.

కవిత్వము — అవధానములవంటి ప్రక్రియలు యెన్నిచేసిన శాస్త్రిగారు ఇష్టముగా యెంచుకొన్న పనిముట్టు. 'అచ్చ మయిన తెలుగు తనమును వలచి వచ్చిన రచయిత ఈయన' ఇరవది యేండ్ల వయసు వచ్చేవరికే సానబట్టిన రత్నమువలె తయారయి నారు. అనేక కథలు-అఖ్యాయికలు వ్రాసి 'కథక చక్రవర్తి' అనే బిరుదు పొందినారు. వీరి రచన యేదీ చదవడము మొదలు పెట్టినా మధ్యతరగతి శ్రోత్రియ బ్రాహ్మణ కుటుంబములలో యిరుక్కు పోతాము; అయినా ఇబ్బెట్టు అనిపించదు. ఆ రోజులలో పరిస్థితులు అలా వుండేవి కాబోలు పాపం, అనిపిస్తుంది అంతే. వీరి కథలలో వైదిక కుటుంబములలోని నడతలు, వర్తనములు అగుపిస్తాయి. వ్యావహారికమయిన ముచ్చటలు, అప్పటి సాంఘిక ఆచార వ్యవహారములు గోచరమవుతాయి.

శ్రీ శాస్త్రిగారు ఖరనామ సంవత్సర చైత్రశుద్ధ చతుర్దశి గురువారము 23-4-1891 తేదీన జన్మించినారు. 1961లో కాలధర్మము పరమపదించినారు. వీరి మొదటి కథ 'ఇరువరము ఒక్కచోటికే పోదాము' అన్నది 1915లో ప్రచురితమయినది. 'మిథునానురాగము' అన్నది వీరి మొదటి నవల. 1923 వరకు గ్రాంథికముగా రచనలు చేసి తదాది రెండు సంవత్సరములలో సంపూర్ణముగ వ్యావహారిక భాషకు దిగిపోయినారు. శాస్త్రిగారు వ్యావహారికము, గ్రాంథికము సమాన మధురమయిన శైలిలో వ్రాయగలదిట్ట అనిపించుకున్నారు. 1938నుండి వీరు పద్యరచనను పరిపూర్ణముగా నిషేధించినారు.

అనేక ఖండకావ్యాలు, నాటకాలు, ఏకాంకికలు, నవలలు, కథలు వెలువరించారు. వీరి పత్రిక 'ప్రబుద్ధాంధ్ర' మొదటి సంవత్సరముపక్షపత్రికగావుండి ఆపైని మాసపత్రికగా రూపాంతరంపొంది దాదాపు పది సంవత్సరాలు సాహితీ ప్రపంచమును నవ్యరచనా రీతులతో వైఖరులలో ఓలలాడించినది.

శాస్త్రిగారు హిందీ-గాంధీ-ఖద్దరు యీ మూడింటినీ గిట్టని వ్యక్తి. తమ వ్యక్తిత్వమును చివరివరకు అట్లే నిలదొక్కు కున్నారు. మహాప్రవాహమువలె జాతీయోద్యమ పరుగులు తీసిన సమయమున శాస్త్రిగారు ఉన్నచోటనే స్థాయిగా నిలువబడి సంయమ ముతో వ్యవహరించగల స్థైర్యమును పొందివుండినారు.

శాస్త్రిగారు ఒక యుగసంధిలోపుట్టి పెరిగిన వ్యక్తి. శుద్ధ శ్రోత్రియ కుటుంబములో పుట్టి ఆ కుటుంబ వ్యవస్థ తాలూకు ఆచార వ్యవహారాలనుండి బయట పడటానికి నానా యాతనలుపడి గడిచి గట్టెక్కినవారు. దేశకాల పరిస్థితులలోను, మనుష్యుల వర్తనము లోను అర్థముకాని, లేని, మార్పులు వస్తున్న రోజులవి. వైదిక విద్యలంటే వైదిక కుటుంబాలలోనే వెగటు పుట్టుకువస్తున్న దినాలు అవి. ఈ మార్పులను త్వరత్వరగా అమలు చేసుకొన్నవారు కొందరు, ప్రతిఘటించినవారు కొందరు, చూచియు చూడనట్లు వున్నవారు కొందరు, సమాధాన పరచుకొని సమన్వయము చేసుకొన్నవారు కొందరు. అయితే శాస్త్రిగారు యేం చేశారు? యెలా చేశారు?

ఈ ప్రశ్నలకు సరయిన సమాధానం కావాలంటే వారి 'అను భవాలూ-జ్ఞాపకాలూను' చదవాలి. ఈ రచన ఒకరకంగా వారి ఆత్మ కథ. సాధారణంగా ఆత్మకథలో సమకాలిక జీవన దేశ—చరిత్ర ఓత ప్రోతముగా కలిసిపోయి వుంటుంది. ఇటువంటి ప్రతి కథలోను తరు వాతి తరాలవారు తెలుసుకోవలసినదీ, నేర్చుకోవలసినదీ యేదో కొంత తప్పనిసరిగా వుంటుంది.

'అనుభవాలు-జ్ఞాపకాలూను' అన్న గ్రంథం మొదటి సంపుటం 1955 జూన్‌లో మొదటికూర్పు వెలువడింది. కళాభివర్ధనీ పరి షత్తు, రాజమహేంద్రవరంవారు దీని ప్రచురణకర్తలు. ఈ సంపు టంలోనే ఈ క్రింది సూచనకూడా ముద్రితం అయివుంది:

'ఈ గ్రంథం యిప్పటికి నాలుగు సంపుటాలు రచన పూర్తి అయి వుంది. వీటిలో యిది మొదటి సంపుటం. తక్కిన మూడు సంపుటాలు ఈ 1955లో అచ్చు అవుతాయి.'

విశాఖపట్నం కవితా సమితివారు 25-4 1955న శాస్త్రి గారి 65వ జన్మదినం పురస్కరించుకుని వారికి ఘనమైన సన్మానం,

కనకాభిషేకం చేశారు సన్మాన సంఘంవారి యేర్పాటుతో. రెండవ సంపుటం, ఆ కనకాభిషేకానికి చిహ్నంగా ప్రకటితమై శ్రీ శాస్త్రి గారికి సమర్పింపబడింది. ఈ పుస్తకం లోపల పేజీలోనే, మొదట కూర్పు, 1000 జనవరి 1958 అని వుంది. దీనికీ ప్రకాశకులు కళాధివర్తిని పరిషత్తు, రాజమహేంద్రవరము వారే.

ఈ రెండో సంపుటము చివరి పేజీలో, ఈ గ్రంథం మొత్తం తొమ్మిది సంపుటాలు అవుతుందని అంచనా అనీ, ఒకటి-రెండు-సంపుటాలు అచ్చయి సిద్ధంగా వున్నాయనీ సూచన వున్నది.

పోతే మూడవ సంపుటం సెప్టెంబర్ 1966 లో ప్రథమ ముద్రణ అయింది. మొదటి రెండు సంపుటాలలో లేనిది దీనికీ 'ఆటో బయాగ్రఫీ' (ఆత్మకథ) అని సబ్ టైటిల్ (ఉపశీర్షిక) వున్నది. ఈ సంపుటం చివర యీ సూచనకూడా వున్నది:

'శ్రీ శాస్త్రిగారి అకాల మరణంవల్ల మూడవ సంపుటంతో ఆఖరు'. ఈ సంపుటాన్ని అద్దేపల్లి అండ్ కో వారు (రాజమహేంద్రవరం) ప్రచురించారు.

కాగా, వారి 'అనుభవాలూ జ్ఞాపకాలును' మూడే మూడు సంపుటాలతో ప్రచురణ నిలిచిపోయినాయన్నమాట.

మొదట శాస్త్రిగారు 'అనుభవాలు-జ్ఞాపకాలును' అన్న ఈ సంపుటాలు యెందుకు వ్రాశారో పరిశీలిద్దాం:

వారికి ఆత్మకథ వ్రాసుకోవాలన్న ఉద్దేశ్యంలేదు. 'నవోదయ' పత్రిక కోసం దాని సంపాదకులు నీలంరాజు వెంకట శేషయ్యగారు వారిచేత బలవంతంగా వ్రాయించారు. అంతకుపూర్వం శ్రీ శాస్త్రి గారు 'ఆనందవాణి' వారపత్రికలో 'నాదీపావళి ముచ్చట్లు' అన్న శీర్షికను యిటువంటి రచనలే చేశారట. ఇప్పటి పాఠకులకు యీ ఆనందవాణీ, ఆ నవోదయం రెండూ బహుశ తెలిసివుండవు. ఈ సంపుటాలలోనుండి మనం యిప్పుడు తెలుసుకుని ఆనందించగల గత కాలపు వైభవాలు, విశేషాలు అనేకం వున్నాయి. మార్గదర్శకం అయిన సూక్తులు చాలనే వున్నాయి.

'ఆంధ్రభాషలో చెత్తవాఙ్మయం చాలా వస్తోందిప్పుడు. దాని వల్ల జాతీయత చాలా దెబ్బతింటోంది. అలాంటిదిక ముందయినా రాకుండా దేశీయులు ప్రతిఘటించాలంటే వారి రోషాగ్నికి నా యీ రచనకూడా ఒక సమిధ అవుతుంది' అన్నారు శాస్త్రిగారు. మొదటి సంపుటం పరిచయ వాక్యాలలో (I-13)

శాస్త్రిగారు అసలు వచన రచన వయిపు-ఎలా దృష్టి మరల్చారు? ఎందుకు యీ మార్గాన్ని అవలంబించారు? వారిమార్గం మొదట దర్శనం అయి చివరకు ఎలా సుగమం అయింది? శాస్త్రిగారి వ్యక్తిత్వం ఎలాంటిది? వారి పూనిక, శ్రద్ధ, నిరంతర శ్రమ ఎలా రూపొందినాయి? భారత జాతీయతకు వారు సమకూర్చిన విశేషము ఎటువంటిది, ఎంత విశిష్టమయినది?...అన్న విషయాలను పర్యాలోచింప కుందుకు యీ సంపుటాలలోని విషయాలు చాలవరకు ఉపకరిస్తాయి.

* *

'వేదమూ, శ్రౌతమూ, స్మార్తమూ, జ్యోతిశ్శాస్త్రమూ, మంత్రశాస్త్రమూ, వీటి సమ్యద్బోధకు సాహిత్యవిద్య-' యివీ వారి కులవిద్యలు. యజ్ఞ యాగాది వైదిక కర్మానుష్ఠానం అనూచానంగా వుండిన వంశం వారిది. (I-13) ఈ విద్యలన్నీ నిరసన భావంతో వదలిపెట్టి ప్రయత్నపూర్వకంగా కొత్తదారిని తొక్కారు శాస్త్రిగారు. ఈ మార్పులు సుగమంగా జరగలేదు. ఈ సాధనలో-తపస్సులో - వారు యెంతో బాధకు గురి అయినారు, వ్యథకు బలి అయినారు, సంఘర్షణకు ఎర అయినారు. ఈ సంపుటాలనిండా యిందుకు ఉదాహరణం పలికే ఉదంతాలు కోకొల్లలు.

శాస్త్రిగారు నాలుగు పొరుగుఊళ్లలో వారాలుచేసుకు చదివారు. అప్పటి పద్ధతి అంతే. చుట్టాల యింటికి భోజనం కోసమే వెళ్లడం ఎబ్బెట్టు అనిపించి, యీ మాటా ముఖంమీదనే అనిపించుకునేంత వరకూ-పిఠాపురం ప్రవేశించేంతవరకూ-హోటలులో భోజనం చేయ లేదు. హోటలులోకూడా శ్రోత్రియులయిన బ్రాహ్మలు మడిబట్ట, పట్టుపంచ కట్టుకునే భోజనానికి కూర్చునే రోజులుఅవి. సత్రాలలో కూడా అప్పటికి వ్యాపార పద్ధతి అంతగా ప్రవేశించలేదు.

శాస్త్రిగారు విద్యార్థి దశలో వల్లూరు గ్రామంలో వుండగా ఒక డెబ్బయి యేళ్ల వితంతువు వొకావిడ కావాలని పరిచయం చేసుకుంది. ఈ పరిచయాన్ని పటికబెల్లం యిత్యాది తినుబండారాలు యిచ్చి పెంచుకుంది. ఇంతకూ ఆమెకు శాస్త్రిగారినుండి కావలసిన ప్రత్యుపకృతి 'మదనకామరాజు కథలు' యేకాంతంగా చదివి వినిపించడం. ఆమె యీ పుస్తకాన్ని నాలుగుమాట్లు చదివించుకుని విన్నది. ఈ పుస్తకమే శాస్త్రిగారికి వచన రచనలో ఆప్యాయత కుదిర్చింది. అంతకుముందు, వారు 'కథలకు పుస్తకాలుంటాయా?' అనుకునే వారు. కథలు వింటూవున్న - చెబుతూవున్న-అల్లుతూ వున్నాను. (I-137)

తరువాత వారు పేడపాడు గ్రామంలో అరేబియన్ నైట్స్ కథలూ, చార్ దర్వేష్ కథలూ, శుక సప్తతికథలు, రేచుక్క పగటి చుక్క కథలు-చదివారు. వాటిలో భాష అసహ్యంగావున్నా ఆ ధోరణి కోసమూ ఆ యుక్తులకోసమూ అని విడిచిపెట్టలేకపోయేవారట. (I-165). మూడవ తరగతిలో 'రుక్మిణీకళ్యాణం' చదివినప్పుడూ, దరిమిలా 'వసుచరిత్ర' లో వాచకనే సరిగా నడవనప్పుడూ పద్యంమీద కంటే వచనంమీద-వచనంలో మళ్ళీ సులభమయిన సరళ వచనంమీద రుచి అభిమానము కలగడానికి కారణం అయిందట. (I-141) వచనప్రీతి తరువాత తరువాత స్థిరపడిపోయింది.

ఈ సందర్భంలోనే శాస్త్రిగారు పిల్లలకు (ప్రారంభకులకు) యెటువంటి సాహిత్యం అందించాలో సూచిస్తూ యిలా వ్రాశారు:

'పిల్లల పరిశుద్ధ మనః ఫలకాలమీద మొదట మొదట మహా పురుషులరూపాలు అంకితం చెయ్యాలి కానీ కుక్కల క్షుద్ర రూపాలు కావు' (I-158)

'విద్యాభ్యాసం ప్రారంభించిన కొత్తలో మధురమూ సుల

భంగా లలితమూ, రసబంధురమూ అయిన భాషగల గ్రంథాలు చదివించడమూ, వల్లింపజెయ్యడమూ మిక్కిలి ఆగత్యం. (I-160)

వారికి వచనంలోవున్న సౌలభ్యం పద్యంలో కనబడలేదు. ఈ సౌలభ్యమే వచన రచనలోనున్నూ ప్రవేశపెట్టింది. (I-324)

విజయవిలాసం ఆంధ్ర వాఙ్మయంలో ధ్రువతార (II-135). దీనిపైన వారు సమీక్ష వ్రాసుకున్నారు-వచనంలో. వేంకటరామశాస్త్రిగారు యీ సమీక్ష చూడడం తటస్థించింది. 'ఇలాంటి రచనలు వాఙ్మయానికెన్నో కావాలి. మీ రచన విలువగలదవుతుంది. కనక మీరిక పద్యరచన కట్టిపెట్టి, కసిసం తగ్గించి, వచన రచన చెయ్యాలి' అన్నారు. అంతేకాదు, రామకృష్ణశాస్త్రిగారు 'పద్యబంధం చాల సులువు. రసవంతమయిన వచనం వ్రాయడం మాటలుకాదు. మీ వచన రచన విలక్షణంగా వుంది' అన్నారు. (II-137)

పద్యవ్యామోహంలో పడి కొట్టుకుపోతున్న నన్ను వచన రచనకు మళ్లించడం రూపంగా వారు (గురువులయిన రామకృష్ణకవులు) నాకు చేసిన మహోపకారం యీ జన్మలోనేకాదు. మరెన్ని జన్మల్లోనూ మరచిపోన్నేను' అంటారు శాస్త్రిగారు కృతజ్ఞతాంజలి ఘటిస్తూ. (II-140)

సాహిత్య ప్రియులకు కావలసింది రసం, రసం అన్నది వాక్య నిర్మాణంలో పొటమరిస్తుంది గాని శబ్దరూపాల్లోనూ క్రియారూపాల్లోనూ కాదుమరి' అంటూ గ్రాంథిక వాదులను 'వ్యావహారిక రచనలు చదివినప్పుడు మీకు రసానుభూతి కలగడంలేదూ?' అని అడుగుతారు. అంతేకాదు, ఆత్మ ద్రోహం చేసుకో[illegible]ా జవాబున్నూ చెప్పమంటారు. (II 144, 146)

రామకృష్ణ కవుల దగ్గర చేరిన ఆరుమాసాలకే తమలో యేదో కొత్తదనం జాగృతం అయినట్టు అనిపించిందట శాస్త్రిగారికి. అక్కడ వారి 'ఆత్మ ప్రత్యయం' బలపడిందట. (II-248-249)

వీరి 'వీరపూజ' తెలుగులో అపూర్వమూ విశిష్టమూ అయినది. బహు స్వతంత్రమయిన రచన కూడాను. శ్రీ కౌతా శ్రీరామశాస్త్రిగారిద్వారా విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి పరిచయభాగ్యం పొంది, వారి సహాయ సహకారాలవల్ల ఈ పుస్తకం అచ్చువేయించుకుంటారు. రెండు నెలలు ఆ పనిమీద శాస్త్రిగారు మదరాసులోనే ఆంధ్రపత్రిక ప్రెస్‌లో దాదాపు వారి అతిథిగా వుండిపోయారు. ఆ సమయంలోనే 'మర్యాద రామన్న కథలు'ను బజారు భాషనుండి సులభ గ్రాంథికంలోనికి సవరించి యిచ్చారు వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు కోరగా. శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారినీ పండిత దీవి గోపాలాచార్యులుగారినీ పరిచయం చేసుకున్నారు.

శాస్త్రిగారు కవిత్వంలోనికి దిగడం తండ్రిగారికి సుతరామూ యిష్టంలేదు కులవిద్యలను వదలడం వారికి ఊహాతీతమయిన ప్రసక్తి. తండ్రిగారు చిన్నన్నగారు ప్రతిబంధకాలు కలిగించినకొద్దీ శాస్త్రిగారికి తెలుగు సాహిత్యంపట్ల అభిరుచి అభిమానము యెక్కువ కాసాగాయి. చదువు-అంటే సంస్కృతమే చదువు. కవిత్వం చెప్పినా సంస్కృతంలోనే చెప్పాలిగాని తెలుగులోకాదు-యిదీ అప్పటి పెద్దల దృష్టి.

'సనాతనుల దృష్టిలో సంస్కృతం నేర్చినవాళ్లే చదువుకున్నవాళ్ళు. అధునాతనుల దృష్టిలో ఇంగ్లీషు నేర్చినవాళ్లే చదువుకొన్నవాళ్లు. ఆ సనాతనులూ అధునాతనులూకూడా అచ్చంగా తెలుగువాళ్లేను మళ్లీ. కానివారి కుభయులకూగూడా తెనుగు తమ మాతృభాష అన్న అభిమానమూలేదు; జ్ఞానమూలేదు. మళ్లీ మాట్లాడితే.' అని నిర్వేదం ప్రకటిస్తారు శాస్త్రిగారు (I-198) వారికి పునం గజంయెత్తు వచ్చేటన్ని పుస్తకాలు రచించాలనే పూనిక, స్ఫూర్తి ఒక ఇంగ్లీషు నవల చూచినమీదట కలిగింది. ఆ ఇంగ్లీషు నవలాకారుడి పుస్తకాలన్నీ పేరిస్తే మూరెడెత్తు అవుతాయని వారి బంధువుల అబ్బాయి చెబుతాడు. కాని, ఆరోజులలో 'తెలుగులో కవిత్వం చెయ్యగూడదు. అది అప్రతిష్ఠాకరం, పతనమున్నూ. మావాళ్ల దృష్టిలో తెలుగు ఒక సభ్యభాషకాదు. తెనుగులో సాహిత్యకృషి అంటే అకార్య కరణం' అని అప్పటి పరిస్థితి వివరిస్తారు. (I-216)

'సర్వాధికారాలలోను యిత్తర్వు కిచ్చేసినవిపోగా, అచ్చుపడివుండిన విన్నికాక మొదటికూర్పే కావలసివచ్చింకా డెబ్బయిదాకా వున్నాయి, నా గ్రంథాలు' అంటారు ఒకచోట. (I-240)

తండ్రిగారు, చిన్నన్నగారు వ్యతిరేకత చూపి సాధించినా వారి పెద్దన్నగారుమాత్రం తెలుగు సాహిత్యం చదవమని ప్రోత్సహిస్తారు. అంతేకాదు. తెలుగు కావ్యాలు యే వరసలో చదవాలోకూడా చెబుతారు; 'నన్నయ్య భారతం; మనుచరిత్రలో మొదటి మూడు ఆశ్వాసాలు; పారిజాతాపహరణం పూర్వార్థం; శృంగార నైషధం, తిక్కన భారతం'-ఈ క్రమంలో చదివితే 'గంభీర రచనలమీద ఆదరభావం కలుగుతుంది, దృఢపడుతుంది. అప్పుడు అర్థం సాధించాలన్న దీక్ష దానంతట అదే పుడుతుంది...తెలుగులో నీకు మంచి అభిరుచీ, సాహిత్యమూ కలగాలంటే యిది సరయిన పాఠ్యక్రమం' అంటారువారు. (I-194) అవకాశం రావడంతోటే శాస్త్రిగారు అన్నగారు చెప్పిన సలహాను తు. చ. తప్పకుండా పాటించారు. అది లాభించినదని చెప్పారు.

శ్రీ రాజా మంత్రిప్రగడ భుజంగరావు పంతులుగారి చాటు ప్రబంధం 'వారకాంత' క్షుణ్ణంగా చదివి దానిని వచన నాటకంగా మలుస్తారు. 'నాటకాంతం కవిత్వం' అన్న ఆలంకారికుల మాటను 'నాటకాద్యం కవిత్వం' అని స్వీకరించు కుంటారు తామే (I-283). అప్పటికింకా పద్యాలమీద వ్యామోహం వున్నది కనుక వారకాంతలో చాల పద్యాలు ప్రవేశపెట్టారు. వీరిని కవిత్వం చేయవద్దనటానికి పెద్దలు చెప్పిన కారణాలుకొన్ని విచిత్రమయినవి వున్నాయి. ఉదాహరణకు వడ్లాది సుబ్బరాయకవిగారికి కవిత్వం చెప్పడంవల్లనే అన్ని పెళ్లిళ్ళు చేసుకోవలసి వచ్చిందట. (I-293)

'పంచాంగాలు చెయ్యడమూ, జాతకాలు చెప్పడమూ, తమ్మాంలంగా వార్షికాలు సంపాదించుకోవడమూ నాకిష్టంలేదు. తెలుగు కవిత్వం చెప్పినేనామాత్రం; సంపాదించుకోగలను' అని తెగేసి తలి

గారికి చెప్పగలగడానికి ముందు శ్రీ శాస్త్రిగారు యెన్నో ఆటంకాలు మానసిక క్లేశాలూ, శారీరక యాతనలూ ఎదుర్కోవలసి వచ్చింది. 'తెలుగు పుస్తకాలే చదవవద్దంటే - అందులో కవిత్వం చెప్పడానికే ప్రారంభించావూ ?' అని తండ్రిగారు విరుచుకు పడతారు ఒకమారు.

తెలుగు పుస్తకాలు చదవకుండా చేయడానికై – కవిత్వం రాసే సమయం మిగలకుండా చేయడానికే తండ్రిగారు, చిన్నన్నగారు కలిసి వీరికి విధించిన శిక్షలలో కొన్ని :

అమరం వల్లె వేయించడం – అస్తమానమూను,

పంచాంగం లెక్కలు కట్టించడం - దాని అచ్చుపని అప్పగించడం.

ప్లీడరు గుమాస్తాగా చేర్పించడం.

తండ్రిగారికి కవిత్వం రాయడంకంటె కొడుకు ప్లీడరు గుమాస్తాగ తయారవడమే మేలయిన పని అనిపించింది. విచిత్రం! కాగా, శాస్త్రిగారికి అది కులవిద్యలకంటె లక్షరెట్లు హేయం అనిపించింది. (I-367) ఎలాగయితేనేమి ఒక సహృదయుడు కలుగజేసుకోవడంవల్ల ప్లీడరు గుమాస్తాపని యెక్కువ రోజులు అక్కర్లేకుండానే వొదిలిపోయింది. కానయితే తండ్రిగారు–యెంతోమంది చేత చెప్పిస్తారు, కొడుకును ఋజుమార్గంలోనికి మళ్ళించాలని, కవిత్వపు ఛాయలనుంచి తప్పించాలనీని !

పామర్రు కాపురస్థుడయిన ఒక కమ్మదొరగారు 'కవిత గల్గిన రాజ్యాధికారమేల ?' అని మెచ్చుకోలుగా – ప్రశంసతో కొడుకును కౌగిలించుకోవడం, కవిత్వాన్ని స్తుతించడంతో తండ్రిగారిలో ఎట్టకేలకు కొంతలో కొంత సద్భావన కలుగుతుంది. 'కులవిద్యలు ఎలాగా విడిచిపెట్టావు. ఆ కవిత్వం సంగతులన్నీ కూలంకషంగా తెలుసుకో; నలుగురూ మెచ్చుకునేట్టు చేయి రచనలు–' అంటూ ప్రోత్సహించి నట్టుగా మాట్లాడుతారు (I-388) తండ్రిగారు. తల్లిగారు సరేసరి! తండ్రిగారు 'చొక్కాలుకూడా తొడుగుతున్నాడూ. అప్రాచ్యుడూ' అన్నప్పుడు ఆ వేషంతో వారి కంటపడకుండా జాగ్రత్త పడమని తల్లిగారు హెచ్చరిస్తారు. క్రాఫింగు పెట్టుకున్నప్పుడూ కొంత రగడ జరుగుతుంది. శాస్త్రిగారు నాటకాలలో వేయటం, ఆ సమాజంతో సంబంధం పెట్టుకోవడం తండ్రిగారికి యిష్టంలేక పోయినప్పటికీ విడిపోతావని తల్లిగారిద్వారా కబురు అందడంవల్ల చూచీ చూడనట్టు ఊరుకున్నారాయన. శాస్త్రిగారు సంగీతం నేర్చుకున్నారు. ఇదీ తండ్రిగారికి యిష్టంలేదు. ఏమంటే, సంగీతమూ కవిత్వమూ, చిత్రలేఖనమూ యిలాంటి లలిత కళలు వేదశాస్త్రాలవంటి మహావిద్యలూ సభ్య విద్యలూ కావు. నటవిటకవి గాయకులు పంక్తిబాహ్యులు–కనీసం, అప్పటి రోజులలో.

ఇంటివద్ద ప్రతి బంధకాలు తొలగినంత మాత్రంచేత అంతా రాచబాట అయిందనుకుందుకులేదు. ఛందస్సు నేర్పుతానన్న కొత్తపల్లి సూర్యనారాయణగారు కుచ్చితం చేయడం, గమకం నేర్పకుండా సర్వదేవుడుగారు కాలహరణం చేయడం సమ్మెటపోటులయినాయి

వారి సాధనకు. అందుచేతనే కొండేపూడి సుబ్బారాయుడుగారు ఛందో సందేహాలు తీర్చినా మరొకరు గమకాలు నేర్పినా గొప్ప పండితుడు, మహాకవీ అయిన యే మహానుభావుణ్ణో ఆశ్రయించాలనే తీవ్ర ఆకాంక్ష కలిగింది. ఆంధ్రపత్రిక కొత్త సంవత్సరాది సంచికలో ప్రచురిత మయిన కవుల ఫోటోలుచూచి యెన్నో శంకలు సందేహాలు బేరీజు వేసుకుని రామకృష్ణకవులవద్ద ప్రవేశించాలని నిర్ణయించుకుంటారు, చేరుతారు. ఈ సందర్భంగా కొత్తగా అప్పుడే ప్రచురితం అయిన ఆంధ్రపత్రిక కొత్త సంవత్సరాది సంచికను మెచ్చుకుంటూ శాస్త్రిగారు 'షని శ్రీ నాగేశ్వరరావు పంతులుగారి ధర్మార్థానికి ధ్రువతార; నిష్కామ సేవకు జయపతాక' అంటారు (II-67).

రామకృష్ణకవులవద్ద శిష్యరికంలో కవిత్వంపట్ల మోజు పెరగడమూ విరగడమూ కూడా జరుగుతుంది.

'శబ్దశక్తి అవగాహన కావాలి రసనిష్ఠ యేర్పడాలి. శబ్దార్థ పరిజ్ఞానం వున్నంతమాత్రాన చాలదు. పంక్తి సమన్వయించుకోగల శక్తి వుండాలి. రసస్వరూపం గుర్తించగల ప్రతిభ వుండాలి. అది అనుభవించగల యోగ్యత వుండాలి. విశిష్ట భాగ్యాలివి' అంటారు. (II-108)

'ఛందస్సు తెలిస్తే కవి అయి వుండవక్కర్లేదు, ఎవరయినా కల్పెయ్యొచ్చు పద్యాలు. అయితే అవి కమ్మెచ్చున లాగినట్లు నడిపించడం విశేషం. నడక అంటే యెగుడుదిగుడుల్లేకపోవడం మాత్రమేకాదు. రెయిలు పెట్టెలకులా అనుస్యూతత యేర్పడాలి.'—యిటువంటి పదునయిన భావాలు యేర్పడుతాయి వారికి.

అష్టావధానం, శతావధానం, ఆశుకవిత్వం—అంటే యేకొంచెమున్నూ ప్రీతిలేదు వారికి ఎప్పుడూ (II 113) అయితే ఆది మధ్యం. భావనారాయణస్వామిగారనే వకీలు—పోలవరం ఆయన 'అష్టావధానం చేయలేని వాడివి యేం కవివయ్యా?' అంటే పౌరుషంవచ్చి ఆ సాధన చేస్తారు. అవుననిపించుకుంటారు. దరిమిలా మల్లాది సత్యనారాయణశాస్త్రితో కలిసి అష్టావధాన నేత్రావధాన ప్రక్రియలు నడిపి కాస్తో కూస్తో డబ్బూ సంపాదించుకుంటారు.

'తెలుగుదీక్ష' పూనారు శ్రీపాదవారు. అందువల్లనే ఇంగ్లీషు జోలికి వెళ్ళలేదు (II-164) ఇంగ్లీషు చదువుకోనందుకు అంత విచారించకపోయినా 'అయ్యో'! అనిపిస్తూ వుండేదట అప్పుడప్పుడూ. నిజానికి ప్రపంచం అంతటా బహుళ ప్రచారంగల ఇంగ్లీషు రాకపోవడం నాకే కాదు ఎవరికయినా దౌర్భాగ్యమే అంటారు ఆయన. (I-27)

'భాష పరసీమలు చూడాలి.

గజం ఎత్తు పుస్తకాలు రచించాలి' యిదీ వారి ఆకాంక్ష. (I-238) రాశిలోను వాసిలోను వారు యీ మాట నిలబెట్టుకున్నారు కూడాను.

* * *

శాస్త్రిగారిది విశిష్టమయిన వ్యక్తిత్వం. వారికి అపూర్వమయిన అభిప్రాయాలున్నాయి నిరంతర తపస్సువల్ల ఆ అభిప్రాయాలను సానబట్టుకున్నారు. ఏ పనిచేసినా పూనికతో, శ్రద్ధతో సర్వహించారు దానికోసం నిరంతరమూ శ్రమించారు. చదువుకోవడానికి పుస్తకాలు లేకపోతే వాటికోసం రోజూ ఎనిమిదిమైళ్ళు నడచి వెళ్ళటానికి జంకలేదు ఫిడేలు సాధకం చేయడానికీ యిలానే రోజూ ఆరు మైళ్ళు నడచివెళ్ళారు. ప్రబుద్ధాంధ్ర ప్రచురణలో యెన్ని ఒడుదుడుకులు వచ్చినా సాహసంతో యెదుర్కొన్నారు, చేతనయినంత వరకూ. 'వీరపూజ' అచ్చువేయించుకుందుకు కేవలం పద్నాలుగున్నర అణాలు చిల్లరతో మదరాసుకు ప్రయాణం అయినారు ఈ పుస్తకం అచ్చుకు ఒక ఆసామీ నూరు రూపాయలు యిస్తాననగా మూడు సంవత్సరాలు ప్రతిబుధవారము రాను పోను ఎనిమిదిమైళ్ళు నడిచారు.

వారు వెలిబుచ్చిన కొన్ని స్థిర అభిప్రాయాలు యీ రోజుకూ సర్వసమ్మతమయినవి; విలువ అయినవి.

'సంస్కారం అన్నది ప్రాక్తనం. బహుజన్మల్లో చేసుకున్న విద్యా పరిశ్రమకు పరిణామం అది. (II-3)

'జనుల చిత్తవృత్తులను సంస్కరించి, జీవితాలు సరళరేఖ మీద నడిపిస్తూ రసబంధురాలున్నూ చేసే ఉత్తమోత్తమ కళలను నిరసించడం వివేకమా? కాదు గనుకనే వేదశాస్త్రాలకు తప్పనిసరి అవుతోంది పతనం'. (II-13)

'విద్యార్థికే గనుక పట్టుదలవుంటే వొక పండితుడు కుచ్చితంగా ప్రవర్తించినంత మాత్రాన యేమీ దిగడిపోదు; ఆ పండితుని నైచ్యమే వెల్లడి అవుతుందిగాక.' (II-61)

'తెనుగు వొక సలక్షణమయిన భాషేకదా, ప్రత్యేక శ్రద్ధతో బాగా పరిశ్రమ చెయ్యకుండా దాని గాంభీర్యం యేమి అవగాహన అవుతుంది ఎవరికయినా? (II 105)

'ఎవరి గ్రంథంవారు అచ్చువేయించుకోవలసి రావడంకంటె మరి దౌర్భాగ్యంలేదు కవులకు. వనితలకు తామయి వలపు వెళ్ళవేసి రావడం వంటిది కవుల కిది.' (II-179)

'మల్లె పువ్వులోనుంచి అనుస్యూతంగా వ్యక్తం అవుతుంది సౌరభం. పద్యంలోనుంచయినా, వచనంలోనుంచయినా భావమున్నూ అలాగే ద్యోతకం అవుతూ వుండాలి; విరవధికంగా. విచారణకున్నూ ఆగాలి అది...ఆలోచనామృతంగాని సంగీతంలాగ ఆపాద మధురంకాదు కవిత్వం.' (II-283)

'రాయగా రాయగా భాష స్వాధీనం అవుతుంది. రచన విధానం పరిష్కృతం అవుతుంది. క్రాంతి దర్శిత నిశితం అవుతుంది, తపస్సు సిద్ధించి మహర్షి అవుతాడు కవి.' (II-183)

'గ్రంథకర్తలకు స్వాతంత్ర్యం ఒకటేకాదు, బాధ్యతా వుండెంతో.' (II-323)

'రచయిత యే దేశం, జాతి, భాష అవే వివరాలు లోకులకు అక్కర్లేదు. అతని రచనలు యెలాంటివి, తమకు ఆనందం కలిగిస్తున్నాయా లేదా అన్నదే ప్రాముఖ్యం. (II 333)

డాక్టర్ దీవి గోపాలాచార్యులుగారి ప్రోత్సాహంఆసరాగా తీసుకుని సవిమర్శగా 'వీరపూజ' వరవడిలో భారతవీరుల చరిత్ర వ్రాయాలంటే సంస్కృత భారతం చదవాలిముందు -అని నిర్ణయించుకుంటారు

శాస్త్రిగారు. ఒకమారు విమర్శలకు ప్రాధాన్యం యిచ్చేవొక పత్రిక ప్రారంభించండి అంటారు రామకృష్ణకవిగారు ఒకమారు. వారేదీనికి నామకరణం కూడా చేస్తారు. అయితే 'స్వత్వం' పోకుండా వుండేందు కని ఆ పేరు తమ పుస్తకంలో వ్రాయలేదు శ్రీపాదవారు. ప్రబోధ్యాంధ్ర అనే పేరు అప్పటికే వారి మనసులో మెదులులోంది. అదే పేరు అన్వయించుకున్నారుగాని గురువులు చెప్పారుగదా అని మార్చుకోలేదు.

'బహు రసవంతమయిన ద్విపద రచనలనే యీసడించారుకదా మన పండితులు, వచన రచనల నాదరిస్తారా మరి!' అని యెంత నిర్వేదం నిరాశ ప్రకటించినా తమ సాధన, తపస్సు మాత్రం వదల లేదు అప్పటికే వీరేశలింగంగారు గద్యతిక్కనగా పేరుపొందారు. వారి రచనల విమర్శకులెవ్వరూ చేయని విమర్శలు చేయడానికి జంకలేదు శ్రీపాద వారు. 'సుబ్రహ్మణ్యశాస్త్రి నొకరే చెయ్యగల పని అది' అంటారు పానుగంటివారితో యీ సందర్భంలో.

విజ్ఞాన చంద్రికవారు ప్రచురించిన రాణీసంయుక్త కథలో శ్రీపాదవారి సందేహం: 'సంయుక్త పృథ్వీరాజు పెళ్ళాడవచ్చునా? సంయుక్త తండ్రి జయచంద్రుడూ, పృథ్వీరాజూ అక్కాచెల్లెళ్ల బిడ్డలు కావడం మూలంగా అన్నాతమ్ములుగదా!' ఇది విని శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు 'కొత్త ప్రశ్న యిది. ఎవరూ చేసివుండని ఆక్షేపణ. ఆలోచించిగాని తేల్చడానికి వీలులేనిదిన్నీ' అన్నారుగాని విరసించి పారవేయలేదు.

ఇటువంటి స్వతంత్రమయిన ఆలోచనా ధోరణి శ్రీపాదవారిది.

'నా తెనుగుభాష యుగయుగాలుగా ప్రవహిని అయి వుండి వదిగాని ఆ భాషలోనుంచి ఒకమాట, యీ భాషలోనుండి మరోమాట యెరువు తెచ్చుకుని భరతవిద్య ప్రదర్శిస్తున్నది కాదు. నా తెనుగుభాష సరస్వతికే తేనేచినికులందించిందిగాని నిరుచప్పనిదికాదు. నాతెనుగుభాష ఎక్కడ పట్టినా చక్రవర్తుల రాజ్యాంగాలు నడిపింది కాని పరాన్నభుక్కుగాదు. నా తెనుగుభాష స్వతంత్రంగా బతకగలదిగాని కృత్రిమ సాధనాలతో ప్రాణవాయువు కూర్చుకోవలసిందీ కాదు, అన్యకను దోహదాలతో పోషింపబడవలసిందీకాదు. యీ భారతదేశంలోనూ—యీ విశాల విశ్వంలో కూడా తెనుగువాళ్లుగా నేనే నిర్వహించవలసిన కార్యక్రమం కొంతవుంది. నా దృఢ విశ్వాసం యిది. అందుకోసం అన్ని సీమల పలుకుబళ్ళూ బోధపరచుకొని అన్నిసీమల జీవశక్తీ కూర్చుకుని స్వస్వరూపజ్ఞానంతో దృఢంగా నిలవగలగాలి మేము' అంటారు వారు. (III-62)

ఒక్కొక్క సీమలో—తమ ప్రాంతం, విశాఖ, నెల్లూరు, కడప అవంతపురం, వంద్యాల, హనుమకొండ సంచరించినమీదట అయిదు ప్రాణాలూ సంక్రమించి ఆంధ్రరక్తం పరిపూర్ణం అయినట్లు అనుభూతం అయిందట వారికి. (III-60)

పదకొండో శతాబ్దిలో యే రుచివుందో—జాతికి, యిరవయ్యో శతాబ్దిలోనూ అదే రుచివుంది స్థిరంగా. అంటే జాతికి సరయిన చైతన్యం లేదన్నమాట. నీటితో స్తంభించిపోయిన చెరువుకీ జాతికీ వొక్కటే పోలిక కావడం దౌర్భాగ్యం' అంటారు (I-326) తెనుగుతనం, భారత జాతీయత యీ రెండూ యెలా సమన్వయం అవుతాయో సుదీర్ఘంగా చర్చిస్తారు శాస్త్రిగారు. 'భారతదేశానికి ప్రత్యేక భాషయేదీ, ప్రత్యేక వేషంయేదీ ప్రత్యేకసంప్రదాయమున్నూ యేదీ—భారత జాతీయత యేర్పడటానికి? ఈ విషయమ్మై మనవారికి సరిఅయిన పరిజ్ఞానం వున్నట్లు లేదు, పరప్రత్యయనేయత తప్ప' అంటారు. (II-210) ఆత్మీయ సంస్కారం అబ్బందే అందరూ యేకం కాలేరు' అంటారు కూడా. స్వధర్మపట్ల వారికి యెంతో అభిమానం. దీన్ని నిర్లక్ష్యం చేస్తున్న వారిపట్ల కించిత్తు కినుకాను.

'సొసైటి ఫర్ ది ప్రమోషన్ ఆఫ్ ది ఆంధ్ర లిటరేచర్' అని ఒక సంస్థ ప్రారంభిస్తారు (SPAL-యిది సూక్ష్మ నామం ధానికి), యిద్దరు మిత్రులతో కలసి అయితే. అది ఒక్క పుస్తకంతోనే మూతపడిపోయింది.

వీరేశలింగంగారి పట్ల వారి రచనలపట్ల యింత గౌరవం వున్నా, ఆయనకు మన దర్శనాల పరిజ్ఞానం లేకపోవడంవల్ల బంకించంద్ర చటర్జీలాగ పథకత్వంలో ఏకత్వం సాధించుకుని యీ విశాల ప్రపంచంలో తాను భారతీయుడుగా నిలదొక్కుకోగలగడం సాధ్యం కాలేదంటారు (II-388, 92)

శ్రీపాద వారి దృష్టిలో జాతీయతకు రెండు కేంద్రాలు వున్నాయి. ఒకటి ఆంధ్రజాతీయత, రెండవది భారత జాతీయత. అసలు భారతదేశంకాదుయిది, 'భరతఖండం' అంటారు. అందులో అంగ, వంగ కళింగాది చప్పన్నదేశాలు (II-400). ఇవన్నీ అంతర్గత దేశాలు. ఈ భిన్న దేశాలకు ప్రత్యేక భాషలున్నాయి. భరత ఖండానికేగాదు. దేశభాషల ప్రాముఖ్యానికి యింతకంటే నిదర్శనం అక్కర్లేదంటారు శాస్త్రిగారు.

'ఛప్పన్నదేశాల వారినీ యేవిధంగానూ చాలించని 'ఏకత వుందంటే ధానిక్కీలకం యిదుగో యిక్కడుంది. మన ధర్మమూ — సంస్కృతభాష అవినాభావనాలు. అది సంస్కృతం మనకు జాతీయ భాష కావడం' అంటారు. జాతీయ భాష అన్నది 'ఉగ్గడబద్ద శబ్దాల వంటిదికాదు. జాతి జీవనాడికి అది ప్రవర్తకం' అనికూడా అంటారు. భాషైకదేశ వ్యవస్థ ఈశ్వర నిర్మాణం అనీ ఇప్పుడేకాదు యెప్పుడో భరత ఖండంలో యేవొక్కదేశానా వ్యవహారం వుండిన భాషకాదు సంస్కృతం అనికూడా అంటారు 'మొదటమనం ఆంధ్రులం. తరువాత భారతీయులం, ఆంధ్రదేశం భరతఖండంలో ఒక భాగం గనుక, భారతీయత మనకు సహజంగానే సిద్ధిస్తోంది అని సిద్ధాంతీకరిస్తారు. (II-423)

'రచయితలు బయలుదేరినంతమంది విమర్శకులు బయలు దేరలేదు మనలో. విమర్శకుడు ప్రాచీనము నవీనము అయిన సాహిత్య శాస్త్రం బాగాతెలిసిన వాడయివుండాలి. అవహేళనపరుడు కాగూడదు. తనకు ప్రామాణికత ప్రధాన ధర్మం అనికూడా గుర్తుంచుకోవాలి' అంటారు (III-92) ఇటువంటి విమర్శకులకు తమ ప్రబుద్ధాంధ్రలో

పోరవడి పెట్టినారు.

* * *

శాస్త్రిగారికి మంచి 'సెన్సాఫ్ హ్యూమర్' వుంది. 'పూర్వ కవులకు అంతగా లేనిది, నవీనులకు తమ రచనలకు పేర్లు పెట్టటంలో కొత్త అభిరుచులు యేర్పడ్డాయి' అంటూ గ్రంథకర్తల పేర్లతో కలిపి పలికితే విపరీతార్థాలు స్ఫురించే గ్రంథాల జాబితా యిస్తారు; వీరేశలింగంగారి 'అభాగ్యోపాఖ్యానం' నుంచి శ్రీశ్రీగారి 'మహాప్రస్థానం' వరకు. తమ 'శ్మశాన వాటికా' యిందులో చేరుస్తారుగాని విడిచి పెట్టారు. (III-231)

కవిత్వ ఖండన మండనాలలో వారి సెన్స్ ఆఫ్ హ్యూమర్‌కు సాక్ష్యాలు కోకొల్లలు.

మూడవ సంపుటంలో అనుబంధంగా శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రిగారి 'వీలునామా' వంటి పుత్తరం ప్రచురిత మయింది. ఇది చదివితే గృహస్థుగా ఎంత పేదరికాన్ని అనుభవించారో స్పష్టం అవుతుంది 'నిరర్థక జన్మ అయిపోయిందినాది. రచనలయినా పాపురాసి జాతికి సమర్పించుకోలేకపోయాడు' అంటారుగాని చెట్టుక్రింద వున్న తమ కుటుంబానికి యేమీ చేయలేకపోయినానని నిరాశ నిస్పృహలు ప్రదర్శించారు. నాదేశానికి, భాషకు సేవేం చేయలేకపోయానని నిర్వేదం ప్రకటిస్తారు.

వారు ప్రకటించిన చిన్న కథల సంపుటాలే 27 వున్నాయి. మూడవ సంపుటంలోని సూచనలో అద్దేపల్లి అండ్ కో వారికి వీటి తాలూకు సంపూర్ణ హక్కులూ వున్నట్లున్నాయి. ఈ పుస్తకాలు పునర్ముద్రణభాగ్యం పొందుతున్నాయో లేక ముక్తినే పొందినాయో తెలియదు. ఇవిగాక శాస్త్రిగారు వ్రాసిన యితరగ్రంథాలు అనేకం వుండివుండాలి. వారే ఒకచోట చెబుతారు: యింకా 70 వ్రాత ప్రతులు వున్నాయని, నాటకాలు 'వారకాంత', 'ప్రేమపాశం', 'నిగళ బంధం', 'రాజరాజు' యింకా అనేక ఏకాంకికలు (కలంపోటు అనేది ఒకటి) అసలు వున్నాయని తెలుస్తోంది. అలాగే 'అత్త-అల్లుడు', 'అలంకృతి', 'అభిసారిక', 'బాలిక-తాత' మొదలయిన ఖండకావ్యాలు వున్నట్లు ప్రకటితము. రేడియో ప్రసంగాలూ వున్నాయి. 'మిథునానురాగము', 'స్మశానవాటిక', రక్షాబంధనము' యిత్యాదులయిన నవలలున్నాయి. దాదాపు పది సంవత్సరాలపాటు 'ప్రబుద్ధాంధ్ర' లో వారు వివిధములయిన రచనలు చేసివుండినారు. నన్నయ శ్రీనాథ జయంతులు నడిపినారట. వారి కవిత్వము గురించి విన్నో విపుల వ్యాసాలు వ్రాసివుంటారు.

ఒక ఉద్యమముగా సాహిత్యసేవ చేసిన వీరి కృషి కాలగర్భములో కలిసిపోవలసినదేనా? సామాజిక చైతన్యం, స్త్రీ హేకల రచనలలో అప్పటి సమాజము ప్రతిబింబితమయినతీరు, మార్పుకూర్చినవైఖరి యీ తరమువారు గమనించవలసిన అవసరము లేదా? వారు సాహిత్యము, విమర్శ, సమకాలికజీవనముల గురించి వ్యక్తముచేసిన అభిప్రాయములలో యీనాటికి చెక్కుచెదరక సబబనిపించేవి యెన్నో వున్నవిగదా—వాటి ఉత్తేజమును యీనాటి సాహితీవరులు, పాఠకులు సరకు చేయవలసిన అవసరములేదా? స్ఫూర్తిదాయకమై, శిష్ట వ్యావహారికరచనలో నూతన శకమును పోషించిన యీ సాహితీవేత్త రచనల సర్వకాలీనతను ప్రస్తుత సందర్భములకు సమన్వయ పరుచుకొని అవగాహన చేసుకోవడం అయినా మన కనీసధర్మము అవుతుంది.

'అనుభవాలూ-జ్ఞాపకాలూను' మిగతా సంపుటములు వ్రాతప్రతులలో వున్నట్లయితే వాటి ప్రచురణ అవశ్యకర్తవ్యము. అన్ని సంపుటములను తిరిగి సమీక్షించి, ప్రస్తుత స్థితికి ఉపకరించు పద్ధతిని సమగ్ర సంపుటము ప్రకటించడము జాతికి ఉపయుక్తమయినపని. శాస్త్రిగారి వీలునామా ఉత్తరం శ్రీ పురిపండా అప్పలస్వామి గారికి ప్రధానంగా ఉద్దేశించబడినదే అయినా, అది పుస్తకంలో అచ్చు వేయబడింది గనుక 'పబ్లిక్ డాక్యుమెంట్' అయిపోయింది. ఈ వీలునామాను అమలు పరచవలసిన బాధ్యత ఆంధ్ర ప్రజానీకం అందరి మీదావున్నది. శాస్త్రిగారు మరణించిన తర్వాత దేశంలో అనేక మార్పులు జరిగినాయి. 'నాజాతి-నాభాష' అనుకుని జీవితం ధార పోసిన శాస్త్రిగారివంటి ఉదాత్త పురుషునకు దేశం యేరకంగా కృతజ్ఞత చూపాలో వివరించి చెప్పవలసిన పనిలేదు. అయితే యివి కేవలం పెదవులతో సానుభూతి (లిప్ సింపతీ) చూపే రోజులు.

తెనుగుభాషకు జాతికి వీరుచేసినసేవ ప్రథమశతాబ్దములోనే మరుగుపడిపోకుండా యేదయినా స్థిరము, ఉపయుక్తము అయిన కృషి జరుగవలసివున్నది. ఏ సాహిత్య ఎకాడమీవారో, విశ్వవిద్యాలయములవారో పూనుకొని యేమిచేయ తగునో నిర్ణయించవలసివున్నదని యీ వ్యాసకర్త సవినయ విన్నపము.

---

('అనుభవాలూ-జ్ఞాపకాలూను' మూడు సంపుటాలు నాకు లభ్యంచేసి యీ వ్యాసం తయారు చేయడానికి దోహదంచేసిన శ్రీమాన్ వి. వి. కృష్ణమాచార్యులు — బెంగుళూరు — గారికి నా కృతజ్ఞతలు.

వ్యాసం యిచ్చిన రిఫరెన్సులు: రోమన్ అంకె సంపుటము, ఇంగ్లీషు అంకె అందులో పేజీని.)

# సంజీవి పర్వతం

శ్రీ కొడవంటి లీలామోహనరావు

రోడ్డు ప్రక్క నన్ను దింపేసి సర్వీసు బస్సు ముందుకి సాగిపోయింది. త్రోవంతా బంపిరెడ్డివల్ల ఒళ్ళు హూనమైంది. చల్లని పైరుగాలి వంటికి తగిలేసరికి కొంత రిలీఫ్ అన్పించింది. ఝల్లని మెల్లని పంటకాలువ గల గల మనస్సులో ఉత్సాహం నింపింది. గట్టిగా ఊపిరిపీల్చి, సూట్ కేస్ తీసుకొని బయలుదేరాను. నాలుగడుగులు వేసేసరికి గుండె ఝల్లుమంది. అంతదూరంలో సంజీవి పర్వతం. ఆకాశానికి విస్తరించి ఉంది. నల్లగా చిక్కగా అంతటా చెట్లు. కారుమేఘంలా భయంకరంగా ఉంది.

— మామయ్యకి ఆ ఊళ్ళో షాపు ఉంది. రెండు రోజులు ఐడిల్‌గానే గడిపేసాను. షాపుదగ్గర కొంతసేపు కూర్చోవడం, తిరిగి ఇంటికి రావడం. మామయ్య మొదటే కాషన్ ఇచ్చాడు. "సంజీవి పర్వతంకేసి వెళ్ళకు. మీ ప్రాంతం కొండలాటిదికాదు. పక్కా అడివి." నా సంగతి వాళ్ళకు తెలుసు. ఫ్రెండ్సుతో కలిసి కొండలూ, గుట్టలూ, తిరగడం నాకు అలవాటు. ఆ అడ్వెంచర్సులో కొన్నిసార్లు కొద్దిలో ప్రమాదాలు తప్పడం కూడా జరిగింది. నేనీ ఊరు రాక మునుపే సంజీవి పర్వతం గూర్చి విన్నాను. దానిగూర్చి ఏవో కథలు ఉన్నాయి. ఎవరో గొల్లవాడు కొండ గబగబా దిగుతుండగా కాలికి దెబ్బతగిలిందట. చేతికందిన ఆకులు తెంపి దిగుతూనే పసరు రాసాడట. గాయమైన గుర్తే లేకుండా పోయిందట. అది సంజీవి అని తెల్సుకొని మళ్ళీ దానికోసం ఎంత వెదికినా కన్పడలేదట. అందుకే ఆ కొండకా పేరు.

ఆఖరుకి ఓరోజు ఉదయమే అటువైపు బయలుదేరాను. త్రోవలో చెట్లనిండా రామచిలకలు విపరీతంగా గోలచేస్తున్నాయి. ఆకులు కనబడనంతగా చిలకలు ఉన్నాయి. ఒక చెట్టుమీదనుండి మరో చెట్టుమీదకి ఎగురుతూ అలికిడి చేస్తున్నాయి. ఆ ప్రాంతం వాటి అరుపులతో చాలా కోలాహలంగా ఉంది. నేనింతవరకూ అటువంటి దృశ్యం చూడలేదు. కొండ మొదట్లో కొందరు మనుషులు కన్పించారు. నావేపు వింతగా చూసారు. నా ప్రయత్నం తెలుసుకొని ఒకరిద్దరు మందలించారు.

కొండంతా జీబుగా ఉంది. సన్నని కాలిత్రోవగుండా ఎక్కడం ప్రారంభించాను. కొంతదూరం వెళ్ళేసరికి ప్రకృతి నాకోసమే సాక్షాత్కరించిందా అన్పించింది. చుట్టూ విశాలమైన ప్రదేశం—ఏరియల్ వ్యూ కన్పడింది. పచ్చని పంటపొలాలు మైళ్ళకొలదీ దూరంగా చిన్న చిన్న గ్రామాలు, వాటిని కలుపుతూ బాటలు—అక్కడా అక్కడా గొంగళీ పురుగుల్లా బస్సులు. చల్లని గాలి కొడ్తోంది. కొంతసేపు అలా చూస్తూ ఉండిపోయాను.

నాలుగడుగులు వేసిం తర్వాత చదునైనచోటు తగిలింది. అక్కడ అనుకోనివిధంగా ఒక సంఘటన జరిగింది. ఉలిక్కిపడ్డాను. నన్ను చూసి ఆమె కూడా కంగారుపడింది. కాని అంతలోనే సర్దుకొని పుల్లలు ఏరుకోసాగింది. ఇంత ఎత్తులో, ఒంటరిగా—నాకు ఆశ్చర్యం వేసింది. కాని మాట్లాడకుండా కొండ ఎక్కడం కొనసాగించాను. పోను పోను మరి కాలిత్రోవలేదు మరీ చీదరగా ఉంది. సన్నని కొండ వాగు పారుతూ ఉంది. చెట్లూ, జీబుగా పొదలూ, మార్గంలేదు. మనిషికంటే ఎత్తైన పుట్టలు ఎక్కడ బడితే అక్కడ ఉన్నాయి. కీచురాళ్ళ శబ్దంతప్ప మరేవిధమైన చప్పుడూలేదు. ఎక్కడా పక్షి అరుపైనా విన్పడ్డంలేదు. అటువంటి పరిసరాల్లో ఒంటరిగా ఉన్నా నన్న ఆలోచనే భయంకరంగా ఉంది. అప్పటికిక తిరిగి వచ్చేసాను.

కొండ పూర్తిగా ఎక్కినవాళ్ళు లేరని చెప్పారు. ఒకరిద్దరు వెళ్ళినవాళ్ళు తిరిగి రాలేదట. పైని ఎక్కడో నిత్యం తపస్సు చేసుకుంటూ మునీశ్వరులు ఉంటారనీ, వాళ్ళ కంటపడినవాళ్ళు తిరిగి రారని చెప్పుకుంటారు. ఏది ఏమైనా చొరరానిదిగా ఉంది. సాధించాలంటే తగిన బందోబస్తుగా వెళ్ళాలి. భయం, సంతోషం, ఆశ్చర్యం వెంటవెంటనే అనుభవంలోకి వచ్చే థ్రిల్ ఇది. ఈ ప్రయత్నం విడిచిపెట్టకూడదనుకున్నాను.

ఈసారి వెళ్ళినప్పుడు ఆ అమ్మాయి నీటివాగు దగ్గర కూర్చుంది. కట్టెలమోపు ప్రక్కనుంది. లేవబోతుంటే దగ్గరకు వెళ్ళాను. పేరడిగాను. "లచ్చిమి" అంది. చామన చాయ. మెరిసే కళ్ళు. ఆకర్షణ ఉంది.

"ఎక్కడుంటున్నావు?" అన్నాను.

"ఈ వూరే. మాలపేటలో."

కట్టెలమోపు ఎత్తుకుంది.

"కట్టెలకి ఇంతదూరం ఎందుకు వచ్చావు?"

"నీకోసమే..."

చెంపమీద కొట్టినట్టయింది. విస్తుపోయాను. వెంటనే గట్టిగా నవ్వింది.

"ఒట్టే అన్నా. నాకిటు రావడం అలవాటు" అని గబగబా వెళ్ళిపోయింది.

నేను మాత్రం షాక్‌నుండి తేరుకోలేదు.

ఆ ఊరు చాలా చిన్న గ్రామం. పెంకుటిళ్ళు మూడో, నాలుగో. మిగతావన్నీ పాకలు. హరిజనులందరూ ఒక దగ్గిర. వాళ్ళకి వేరే నుయ్యి. పైవాళ్ళు అక్కడికి పోరు వాళ్ళంతా పొలాల్లో కూలీ నాలీ చేసుకుంటారు. ఏరోజు కారోజు వెచ్చాలు కొనుక్కుంటారు. ఆ వాడ అంతా చాలా చీదరగా ఉంటుంది. మనుషులంతా రోడ్డుమీదే కూర్చుంటారు. ఇంటి పనులన్నీ రోడ్డుమీదే. వాళ్ళ గుడిసెలు బొరియలు మాత్రమే.

రెండు మూడుసార్లు నేనటుకేసి వెళ్ళడం మామయ్య పసి కట్టినట్టున్నాడు.

"ఒరేయ్ మాలపేటకేసి వెళ్ళకు. తప్పు పడతారు," అన్నాడు.

"నాకా పట్టింపు లేదు. మా పూర్లో మేం హరిజనవాడ కెళ్ళి సోషల్ సర్వీస్ చేసేవాళ్ళం. రోడ్లు తుడిచి, వాళ్ళ పిల్లలకి నీళ్ళుపోసి, పుస్తకాలిచ్చి- రకరకాల పనులు చేసేవాళ్ళం" అన్నాను.

"ఇది మీ పట్నంకాదు. ఇక్కడ ఉన్నన్నాళ్ళూ ఇక్కడ పద్ధతులకి కట్టుబడవలసిందే" అన్నాడు మామయ్య.

నేను మాటాడలేదు. జవాబు చెప్పకుండా నా పని నేను చేసుకుపోవడమే మంచిది.

నేను కొండపైకి వెళ్ళివస్తూండగా లక్ష్మి కన్పించింది. "సంజీవి నీకు దొరుకుతుందేమో..." అన్నాను. నవ్వింది కాని కళ్ళు సీరియస్‌గా ఉన్నాయి.

"అదంతా ఒట్టిది. అయినా యిప్పుడెందుకు? అవాడు దొరికితనేమో..." అంది.

నాకు అర్థం కాలేదు.

"నువ్వనేదేమిటి?" అన్నాను.

తనేమీ మాటాడలేదు. నేను కొండపైకి పోడానికి లేచాను.

"అట్టే పైకి పోయాక ప్రాణాలు పోతాయి" అని కేకేసింది.

కొంచెం అల్లరి పెట్టాలనిపించింది.

"పోతే యేం?" అన్నాను.

ఊరుకుంది. కొద్దిగా నవ్వుకుందేమో కూడా.

"ఆడ సూసింది సెప్పు" అంది.

బండరాళ్ళున్నచోట ప్రాకి ఎక్కవలసి వచ్చింది. పొదల్లో నుండి దూరి కొంతపైకి పోయాను. చాలా రిస్కీగా ఉంది. ముళ్ళు తగిలి చొక్కా చిరిగిపోయింది. ఒళ్ళు అక్కడక్కడ రక్కుకు పోయింది.

తిరిగి వచ్చేసరికి నా కోపమే ఇంకా బయలు దేరకుండా ఆగినట్టుంది.

''తెలిసిపోనాది. మరెం సెప్పక్కర్లేదు'' అని పక పకా నవ్వేసింది. కల్మి లేని నవ్వు, మెరిసేకళ్ళు, చలాకీతనం. నేను మరచి పోలేను.

తరువాత్తరువాత నాకు కొంత సమాచారం తెలిసింది. రెండేళ్ళ క్రితంమాట. పెద్దనాయుడుగారి అబ్బాయితో ఆపిల్లకు సంబంధం ఉండేదట. కళ్ళంలో కలిసేవారట. తండ్రికి తెలిసి తిడితే ఏం డ్రిన్ తాగి పోయాట్ట. ఊరంతా ఈ పిల్లనే తిట్టుకున్నారట. ఈ విషయం నన్ను షాక్ చెయ్యలేదు సరికదా నేను ఆవిడ్ని మెచ్చుకోకుండా ఉండలేకపోయాను. ఇంత జరిగాక ఆ తెగువ, పెంకితనం ఆవిడ నిలబెట్టుకుందంటే నేను అభినందించక ఏంచేయను ? ఆవిడ వ్యక్తిత్వం ఎంత గొప్పది ! నీచంగానూ, హంతకురాలిగానూ చూసే మనుషులమధ్య అంతకంత ఎంకెగా ఉండడం రేరిటికాక మరేమిటి ?

''నువ్వు మీవూరు తిన్నగా వెళ్ళేట్టు లేవు'' అన్నాడుమామయ్య.

''లేదు, లేదు. నాలుగు రోజుల్లో వెళ్ళిపోతాను'' అన్నాను.

మామయ్య ట్రాన్సిషన్ పీరియడ్‌కి చెందుతాడు. కొత్త భావాలూ, కొత్త అభిరుచులూ తెలుసును—కాని నలుగురితో కలిసిపోయేరకం. నన్ను ఖండించనూలేదు. ప్రోత్సహించనూలేదు. తన దగ్గర ఉన్నంతకీ నేనేమీ అవకతవక పనులు చేయకుండా ఉంటే చాలు నతనికి.

ఆరోజు పెందళకడే సంజీవి పర్వతానికి బయలు దేరాను. కొండవాగు దగ్గర కూర్చొని ఆలోచిస్తున్నాను. అంతలో లక్ష్మి అటు వచ్చింది.

''అప్పుడే ఒచ్చేసినావా'' అంది.

నాకు గుండెలు తీవ్రంగా కొట్టుకోసాగాయి. బుర్రంతా వేడెక్కి పోయింది. లక్ష్మి నవ్వింది. నా అవస్థకే నవ్వినట్టుగా కంగారు పడ్డాను. చివరకి అన్నాను.

''నేను రెండు మూడు రోజుల్లో మావూరు వెళ్ళిపోతాను.''

ఏం మాట్లాడలేదు. ధైర్యం చిక్కబట్టుకున్నాను.

''నాతో వచ్చేయకూడదూ ?''

చురుక్కున చూసింది. కళ్ళు ఎరబడ్డాయి.

''అవును. నేను పెళ్ళిచేసుకుంటాను.'' అన్నాను.

ఆవిడ ఆశ్చర్యం అంతా ముఖంలో కన్పిస్తోంది.

''రా'' అని పెద్ద బండమీదికి తీసుకువెళ్ళింది. ''చూడు'' అంది.

దూరంగా పొలాలు. మధ్యలో చిన్నపాక.

''అవును తెలుసు. సిరికివాడు. తన స్వార్థం చూసుకున్నాడు'' అన్నాను.

తెల్లబోయింది. పూర్తి చేరకుండానే గబగబా వెళ్ళిపోయింది. నాకేమీ తోచలేదు. నాపని అయినట్టో కానట్టో తెలియలేదు. ఇంటికి తిరిగివచ్చేసాను. ఈ వ్యవహారంలో దిక్కునే పోవాలి. దిగిం తరువాత ఏటూ తేలకపోతే అంతకంటే వ్యర్థ మరొకటుండదు. రెండు రోజులయింది. మరి లక్ష్మి కన్పడలేదు. పిచ్చిగా తిరిగాను. ఇంక కథ ముగిసి పోయిందనుకున్నాను; హరిజనవాడకేసి మాటి మాటికి వెళ్ళాను. కాని ఎక్కడా కన్పడలేదు.

మూడోరోజు ఎప్పటిలాగే కొండకేసి వెళ్ళాను. రోజూవెళ్ళే చోటుకి వెళ్ళేసరికి ఉలికి పడ్డాను. ఎదురుగా రాతిమీద ఒంటరిగా కూర్చొనిఉంది. జబ్బుపడిలేచిన దానిలాగాఉంది. నన్నుచూసి పేలవంగా నవ్వింది.

''ఏమైంది ? అన్నాను.

''నువ్వన్నదే నిజం. ఈ రెండ్రోజులూ యమబాధ పడ్డాను'' అంది. పాపం ఇన్నాళ్ళూ అతనికి తనమీద వల్లమాలిన ప్రేమ అనే ఆలోచించింది. ఆ ప్రేమ కోసమే చచ్చిపోయాడని అనుకుంది. తాను బ్రతికుందంటే తనకు అంత ప్రేమ లేదనీ, తనకి ప్రేమించేశక్తి లేదనీ అనుకుని ఉండాలి. ఆరోజు గుండె తేలిక పడినట్టుగా మాట్లాడింది.

మరునాడు నేను మామయ్యతో చెప్పి బయలుదేరి పోయాను. నాల్రోజులు పోయాక మారేజి రిజిస్ట్రారు ఆఫీసులో కాగితాలిచ్చి ఇంటికి వచ్చాను. అప్పుడే మామయ్య దగ్గరనుండి ఉత్తరం వచ్చింది, లక్ష్మి నవ్వుతూ పక్కని చేరింది. ఆ ఉత్తరంలో ఒకచోట చూపించాను. ''ఈ మధ్య ఊర్లో గడబిడ అయింది. లక్ష్మి అని ఒక మాల పిల్ల సంజీవి పర్వతం మీదికి వెళ్ళి మరి రాలేదు. ఎంత వెదికినా కన్పడలేదు. నీకు చెప్పానుగా – కొండపైకి చాలా మీదికి పోయిన వాళ్ళు తిరిగి రాలేదని. ఇంకానయం, అటువంటి ప్రమాదం నీకు జరగలేదు...''

నేనూ, లక్ష్మి విరగబడి నవ్వుకున్నాం.

~~~~~~
~~~~~~

# వెలిదండ

శ్రీ కే. కిశోరుబాబు

శ్రీ కే. అశోకుబాబు

వెలిదండ పేరు విన్నప్పుడు సాహితీప్రియుం భావుకులకు వెలిదిండ్ల వేంకటపతి స్ఫురిస్తాడు. అతని కుటుంబం ఆర్కాడు సీమలో ఉండేది. వారు నియోగి బ్రాహ్మణులు. కౌశిక గోత్రులు. ఈ వంశంలో రెండు మూడు తరాల కవులున్నారు.

వేంకటపతేగాక అతని తమ్ముని కుమారుడు "అళఘురి", వేంకటపతి కుమారుడు "అయ్యన్న" గూడా కవులే. అరుద్రగారు వేంకటపతి సోదరుల్లో ముగ్గురైనా కవులై ఉంటారన్నాడు గాని అళఘురి సాక్ష్యాన్నిబట్టి వారైదుగురు గూడా కవులే అనటాని కాస్కారముంది. కాని వారి రచనలేవీ దొరక్కపోవటం విచారకరం.

అళఘురి సుదంతా పరిణయ తాళపత్రులనుబట్టి పరిశోధనా పరమేశ్వరులగు శ్రీ నిడుదవోలుగారు వీరింటిపేరు వెలిదిండ్ల–వెలి దండ్ల–వెలిగండ్ల అని కనిపిస్తున్నదని, వెలిదండ్లగాని, వెలిదిండ్ల గాని గ్రామనామమైతే వారు మొదట నెల్లూరు మండలంలోని పాక నాటి సీమలో ఉండి ఉంటారని తమ దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మ యంలో తెలిపారు. వారి కుల గోత్రాలుగూడా వారే తెలిపారు గాబట్టి దాన్నిబట్టి వారింటిపేరు వెలిదిండ్లగాని, వెలిగండ్లగాని కాక వెలి దండ కావటానికి వీలుంది. ఆ యింటిపేరుగల కౌశిక గోత్రానికి చెందిన కవిపండితుల కాలివాలాలైన నియోగుల కుటుంబాలు మా ప్రాంతంలో చాలాఉన్నాయి. వారిని గురించి ఈ కథ గూడా ఒకటి ప్రచారంలో ఉంది.

## పూర్వగ్రామం కథ

వెలిదండ ప్రస్తుతం కలువకుర్తి తాలూకాలో ఉంది. ఆ తాలూకాకు పూర్వం "వంగూరు విషయ"మని పేరు. ఆ గ్రామం గూడా నేడదే తాలూకాలో ఉంది.

పూర్వ గామం ప్రస్తుత గ్రామానికి దక్షిణంగా "పాటిగడ్డ" అనే ప్రదేశంలో సుమారు మైలు వైశాల్యం గలిగి పేటలుగా విభ జింపబడి చాలా అందంగా ఉండేది. పట్టణంలో నీటి యేర్పాటు గూడా ఉండేది.

ఆ పట్టణాన్ని దొరలు పాలించేవారు. వారికోట మిక్కిలి బలి ష్ఠమై నలువైపుల పెద్ద పెద్ద గవనులతో, బురుజులతో మేరు వులా ఉండేది. కోటలోని అంతఃపురాల నెల్లప్పుడూ కోజ్జాలు రక్షి స్తుండేవారు. అందుకు వారికి గ్రామంలో బావులు, పొలాలు మాన్యంగా ఉండేవి.

ఈ పట్టణానికి తూర్పున రెండుమైళ్ళ దూరంలో "గుండాల" అనే గ్రామముంది. అక్కడ ఓ పెద్ద రాతిపై చారిక లతో ఏడు గుండాలేర్పడ్డాయి. వాటినాధారంగా చేసికొని అక్కడ రామలింగస్వామి వెలిశాడు. ఆ కారణంగా అదిక్కడ పేరందిన క్షేత్ర మయింది. అక్కడి స్వామి ఏటేట ఇక్కడినుండే మహావైభవంగా జాతరకోసం "గుండాలకు" తరలిపోతుండేవాడు. ఇది కాకతీయుల నాటిమాట.

దేశాన తురుష్కాక్రాంతమైన పిమ్మట మహమ్మదీయుల కన్ను ఆ పట్టణంపై బడింది. వెంటనే వారు దండెత్తివచ్చి పట్టణా న్నాక్రమించుకొన్నారు.

అంతవరకక్కడుండే దొరలు రెడ్లు. వారు మంచి సలుకు బడి, బలగము గలవారు. మహమ్మదీయులు వారికోటను ముట్టడించి లోపలి వారిని బయటకి రానీయకుండా నిర్బంధించారు. అపుడు పెద్ద దొరగారు తన గుఱ్ఱాన్ని కోట గోడపైనుండి దూకించుకొని బయ టకి దాటి సుల్తానుగారి దగ్గరకు వెళ్ళి ముట్టడి ఆపవలసిందని హుకుం తెచ్చాడు. అతడలా దాన్ని తెస్తుండగా మహమ్మదీయ సైని కులు కొందరతన్ని దారిలోనే పట్టుకొని నరికవేసి సుల్తానుగారి హుకుం తమవారికి తెలియకుండా దాచి తమ పని ముగించుకున్నారు.

ఇక ఆ దురాక్రమణకు అక్కడుండే దొరలు నిలువలేక కాకు నూరికి వెళ్ళిపోయారు. వారలా వెడుతు, తమ నిధులతో పాటు మహమ్మదీయులకు మిగల్చకుండా తమ యిండ్ల కప్పులుగూడా విప్పుకు వెళ్ళారు.

–కాకునూరు ప్రస్తుతం షాద్‌నగర్ తాలూకాలో ఉంటుంది. పూర్వం అక్కడో పండితుడు కకారాశీతి నూరిర్వాలు చెప్పి "కాకు నూరని" ఆ గ్రామ నామాన్ని సార్థకం చేశాడట–

దొరలు వెళ్ళిన తరువాత మహమ్మదీయులు గ్రామంలో తమ సంపూర్ణాధిపత్యాన్ని స్థాపించుకొని అక్కడుండే హిందూదేవాలయా ల్లోని సుందరమైన మూర్తులన్నీ విరుగకొట్టి పారవేసి, ఆ ఆలయా లకు పోటీపడి మసీదులు గట్టి, పట్టణాన్ని మతకేంద్రంగా రూపొం దించుకొని దానిపేరు "సుల్తాన్ నగర్" అని మార్చివేశారు.

ఆ విధంగా పట్టణంలో తమక్కావలసిన కట్టుదిట్టాలన్నీ చేసుకొని దాన్ని ఓ నవాబు పాలించటం మొదలుపెట్టాడు.

అక్కడినుండి దొరలు వెళ్ళారుగాని వారి దివాన్జీ కుటుంబం మాత్రం అక్కడే ఉండిపోయింది. క్రొత్తగా ఏర్పడ్డ నవాబు పరి పాలనానుభవం గలవాడని అదే దివాన్జీని గౌరవించి మంత్రిగా నియ మించుకున్నాడు.

దివాన్జీ నవాబుకడ మంత్రిగా కుదిరాడు కాని అతని అను యాయులు చేసే మత విగ్రోహం చూస్తూ చూస్తూ భరించలేక పోయాడు. అందువల్ల ఏలాగైనా నవాబుగారికి ఉద్వాసన చెప్పాలనే గట్టి సంకల్పం అతనిక్కలిగింది.

ఈలా ఉండగా కాకతాళీయంగా నవాబుగారికి మక్కాను దర్శించాలనే కుతూహలం కలిగింది. ప్రభువు మారినా మంత్రి మార

నందువల్ల రాజ్యం యథాప్రకారంగానే శాంతంగా ఉంచుకొన్న నవాబు పట్టణాన్ని మంత్రిగారి కప్పజెప్పి తాను యాత్రలన్నీ చేసి తొందరగా వస్తానని చెప్పి సకుటుంబంగా మక్కాకు వెళ్ళిపోయాడు.

నవాబు వెళ్ళిన పిమ్మట గ్రామంలోని పెద్దలంతా దివాన్జీతో మహమ్మదీయుల దుండగాలు సహించలేక అతడు తిరిగి వచ్చిననాటి కెలాగైనా అతన్నెదిరింతామని కూడబలుక్కున్నారు.

నవాబు యాత్రలన్నీ సేవించుకుని చెప్పిన గడువునాటికి పట్టణానికి వచ్చి ఊరి వెలపల విడిసి దివాన్జీగారికి తాను వచ్చిన వార్త తెలిపి, వాయిద్యాలతో ఎదుర్కొని తోడుకొని పోవలసిందని దూతను పంపించాడు.

అది విని దివాన్జీ కొందరు పెద్దలతో నవాబు దగ్గరకు వెళ్ళి నీవు మాకు పట్టణాన్ని అప్పజెప్పిందిలేదు, మేం నీకు మళ్ళీ అప్పగించేది లేదు. మా పట్టణాన్ని మేం పాలించుకుంటున్నాం. కాబట్టి మీ గ్రామానికి మీరు వెళ్ళండని నిర్మొగమాటంగా చెప్పివేశాడు.

అది విని నవాబుగారు తానూహించని సమాధానానికి దంగై పోయి దివాన్జీకి నచ్చజెప్ప ప్రయత్నించాడు గాని గ్రామస్థులు తమ పట్టు విడవలేదు.

నవాబు రెండు దినాలు అలాగే గ్రామకంఠంలో విడిచి మూడోనాడు హుటాహుటిని సుల్తాను ప్రభువుల దగ్గరకు వెళ్ళి తన దివాన్జీ చేసిన విశ్వాసఘాతం చెప్పుకొని సైన్యాన్ని సహాయమర్థించి పెద్ద దాణువతో దివాన్జీపైకి యుద్ధానికి వచ్చాడు.

గ్రామస్థులకు, నవాబుకు ప్రస్తుత గ్రామానికి తూర్పు దిక్కున తుముల యుద్ధం జరిగింది. గోలకొండ సిపాయీలు గ్రామస్థుల నూచకోత కోసి దివాన్జీ కుటుంబాన్ని సజీవంగా పట్టుకున్నారు.

నవాబు తనపై తిరుగుబాటుచేసిన ఆ దివాన్జీ కుటుంబాన్ని మిగిలించదలచుకోలేదు. అందరి వ్యక్తులందర్నీ అల్లా సాక్షిగా తాను ప్రతిదినం ప్రార్థన సల్పే మసీదుముందు తలలు నరికించాడు.

అలా అతడు వారి కంఠనాశోత్సరణం చేయిస్తుంటే గ్రామంలోని వారంతా తల్లడిల్లిపోయి ఏ విధంగానైనా అతని కుటుంబాన్ని కాపాడాలనుకున్నారు. అప్పుడా యింటిప్రక్కన ఉండే ఓ కమ్మరి అవ్వ ఏలాగో ఆ యింట జొరబడి ఓ చిన్న పిల్లాడినో గంపలో కూర్చోబెట్టుకొని గడిని దాటి బయటపడింది.

ఆమె ఆవిధంగా బయటపడిన తరువాత భటుల కాపిల్లానిపై అనుమానం తగులగా ఆమె తన యింటిలోనుంచి ఇంత పెరుగన్నం తెచ్చి ఆ పిల్లాడికి తినిపించి, తమ పిల్లాడే అని వాక్కులహంచేసి, బాలుని ఏలాగో ఆ బాధనుండి తప్పించి కాపాడింది.

ఆ పిల్లవానిపేరు "జక్కన". అవ్వ ఆ పిల్లవానిని నాలుగైదేండ్లు తన స్వంత బిడ్డనిలా పెంచి తరువాత ఓ బ్రాహ్మణ కుటుంబానికి అప్పగించింది.

అలా అప్పుడు రక్షింపబడినపిల్లవాడే పెరిగి నేటి వెలిదండ పేరుగల నియోగి కుటుంబాలకు మూలపురుషుడైనాడు. అతని వంశం మూడుపువ్వులు ఆరుకాయలై ప్రాకింది. ఇప్పటికి వెలిదండలోని కరణాలు తమను రక్షించిన ఆ కమ్మరి కుటుంబంలో వివాహం కొంతకాలం చేయని వారి కుటుంబానికి కృతజ్ఞతగా కొంచం పాటించి నట్లు స్వానం చేస్తారట! ఈ విషయం (కథగూడా) మాకు మిత్రులు శ్రీ వెలిదండ వేంకటరావు గారు చెప్పారు.

ఈ యుద్ధానంతరం గ్రామవాసులు మారణహోమం జరిగిన గ్రామస్థలాన్ని విడిచి ప్రస్తుతం గ్రామమున్నచోటికి జరిగారు. అప్పుడా స్థలం గ్రామానికి వెలపలగాఉండే "చిన్నతండ" దాన్ని వెలితండ అని పిలిచేవారు. రానురాను ప్రధాన గ్రామమే అక్కడ స్థిరపడిన తరువాత గ్రామానికదేనామం రూఢియై "వెలిదండ" అయిపోయింది.

విక్రమార్కచరిత్ర కర్త జక్కన్న ఇంటిపేరు గోత్రం తెలియకుండా పోయినాయిగాని అతడీ జక్కన వంశానికి చెందినవాడే ననే అభిప్రాయం ఈ ప్రాంతపు పెద్దల్లో ఉండేది. ఇంటిపేరు, కులం, గోత్రం తెలిసిన వెలిదిండ్ల వేంకటపతి జక్కన వంశానికి సరిపోతున్నాడు కాబట్టి ఈ కథలోని సత్యం అన్వేషించవలసిఉంది. ఈ వెంకటపతి తన కృతిని ముగడల రామదాసామాత్యునికి అంకిత మిచ్చాడు. రామదాసామాత్యుని ఇంటిపేరైన ముగడల గూడ మహబూబ్ నగర్ జిల్లాలోనిదే. దీన్ని ప్రస్తుతం మఖ్తల్ అంటారు. మఖస్థలి అని దాని ప్రాచీననామం. అదిగూడా గొప్పచరిత్రగల పట్టణం.

## ప్రస్తుత గ్రామం కథ :

ప్రస్తుతం వెలిదండ గ్రామంలోమూడు హనుమదాలయాలు, మూడు విష్ణాలయాలు, రెండు శివాలయాలు, ఓ వీరభద్రాలయం, రెండు పోచమ్మగుళ్ళు, ఓ మైసమ్మగుడి, ఏనిమిది మసీదులు, ఓ గుంబదు, ఓ కుతుబ ఉన్నాయి.

గ్రామంలోని మూడు విష్ణ్వాలయాల్లో రెండు రంగనాధాలయాలు, ఒకటి చెన్నకేశవాలయం.

తెలంగాణాలో చెన్నకేశవుని పిమ్మట చెప్పదగిన దేవుడు రంగనాధుడే. రంగనాధరామాయణకర్త ఈ దేవునిపేరనే వెలసినవాడు.

ఇవిగాక ఈ గ్రామంలోఉండే రాకాసి మడవలకు, భూగర్భంలో బయటపడ్డ నీటి హౌజులకు లెక్కలేదు.

ప్రస్తుత గ్రామానికి తూర్పుగా గుండాలదారి ప్రక్కనగల పనిపడున్నత పాఠశాల ముందుండే బావిని గ్రామస్థులో పర్యాయం బాగుచేస్తుంటే అందులో పెద్ద పెద్ద ఎముకలు బయటపడ్డాయి. అవిజూచి వారు అవి గుర్రాలవిగాని, లేకుంటే ఒంటెలు ఏనుగుల వంటి పెద్ద జంతువులవిగాని కావచ్చు అని భావించారు.

ఈదారిలోనే ఓ మసీదు. ఓ గుంబదు ఉన్నాయి. గ్రామానికి సుమారు నాలుగు ఫర్లాంగులపై "బుధవారపుపేట" అనే స్థలం ఉంది. అక్కడో అంజనేయుడున్నాడు. అతని కపుడపుడు పూజలు కూడా జరుగుతుంటాయి.

గ్రామానికి దక్షిణ కంఠంలో "మాదిగ పోచమ్మ" అనే దేవత ఉంది. ఆ దేవతను ప్రత్యేకంగా హరిజనులు పూజిస్తారు. ఆ దేవత

రెండు ఫర్లాంగులమీద "పాటిగడ్డ" ఉంది. అదే పూర్వ గ్రామపీఠం. అక్కడగూడా ఓ ఆంజనేయుడున్నాడుగాని అతనికి పూజాదికాలుతేవు.

ఆ ఆలయానికి దక్షిణంగా చెన్నకేశవాలయముంది. అందులో ప్రస్తుతం మూర్తిలేదు. దానిముందు ఓ పుష్కరిణిఉంది. ఆ పుష్కరిణిలో కట్టిన స్తంభాల్లో ఓ స్తంభంపై దశావతారాలున్నాయి గాని మాసిపోయాయి.

దాన్ని ఒకప్పుడు పూడిక తీస్తుండగా అందులో కోదండపాణి హస్తం, మురళీ కృష్ణుని వ్యత్యస్త పాదాలు, మూతి పగిలిన హనుమంతుడు, తలలు విరిగిన ఆళ్వారుల ప్రతిమలు బయట పడ్డాయి.

దశావతార ప్రతిష్ఠ ఈ ప్రాంతంలో వర్ధమాన పురంలో ఉంది. దాని తర్వాత ఇది రెండోస్థానమని చెప్తారు.

పాటిగడ్డమీద చెన్నకేశవాలయానికి తూర్పునమరోపోచమ్మ గుడి ఉంది. ఈ దేవతను హరిజనేతరులు పూజిస్తారు. ఈ పోచమ్మ గుడి పడమరగా మైసమ్మగుడిఉంది. ఆమె ఆనాటి కోటకు అధిష్ఠాన దేవత.

ఈపాటి గడ్డకు దక్షిణ పూర్వమంతా గుట్టలమయం. అందులో మొదటి గుట్టకు "పీర్లగుట్ట" అని పేరు. దానిపై ఓ మసీదుంది. అందులో పూర్వం పీర్లను నిలిపేవారు.

రెండోగుట్టకు శివుని గుట్ట అనిపేరు. దానిపై ముందు వైపు శివాలయముంది. దానికి తూర్పుగా ఓ నీటదొనఉంది. వేసవిలో తప్ప తక్కిన కాలాల్లో అందులో నీరుంటుంది. ఆకాలాల్లో శివాభిషేకాని కానీరే ఉపయోగిస్తారు, ఆ గుట్టకు రెండోవైపు రంగనాథాలయముంది. అందలిమూర్తి శేషశాయి. అది మిక్కిలి సుందరంగా ఉంటుంది. దానివెనక ఓ గుండముంది. దాన్ని "పుట్టగుండ" మంటారు. దానిలో నీరెల్లపుడు ఉంటుంది. ఈ నీరే స్వామి అభిషేకాని కుపయోగిస్తారు.

ఈ ఆలయంలోని భజనమందిరంలో పూర్వం చాలా విగ్రహాలుండేవి కాని ఈనాడవి లేవు.

ఈ ఆలయానికి తూర్పున గుట్టక్రింద ఓ చిన్న చెఱువువేసి దానికి "రంగసముద్రమ"ని పేరు పెట్టారు. వర్షాకాలంలోని ఆ గుట్టలపై నీరంతా దానిలోనికి జారి అది నిండుతుంది.

ఈ గుట్టల వాలకం వానిపై ఉండే ఆలయాలుచూస్తే వానిలో శివాలయం మొదటిదిగాను, రంగనాథాలయం రెండోదిగాను. మసీదు వానికి పోటీగా కట్టిందిగాను తోస్తుంది.

గ్రామానికి పశ్చిమ కంఠంలో వీరభద్రాలయముంది. అందులోని మూర్తి మూడడుగులుంటుంది. దాని ప్రక్కగా ఓ బావిఉంది. దానికి "అయ్యబావి" అని పేరు. బహుశా అది ఆనాటి గ్రామాధికారిది కావచ్చు. ఈ ఆలయానికి ఫర్లాంగు దూరంలో "పంజగుట్ట" పై మరో మసీదుంది. దాని కీశాన్యంగా "కుతుబ" ఉంది. ప్రస్తుతం పండుగ దినాల్లో మహమ్మదీయులక్కడే తమ నమాజు చేసుకొంటారు.

గ్రామాని కుత్తరంగా ఊరుదాటగానే దృఢమైన కట్టడాలు గల రెండు బావులున్నాయి. అందులో మొదటిదానికి చిన్నకొజ్జా బావి, రెండవ దానికి పెద్దకొజ్జాబావి అని పేరు.

చిన్నకొజ్జా బావికీశాన్యంగా ఇంకో మసీదుంది. దానికి "జాతర మసీద"ని పేరు, ఒకప్పుడు పీర్లపండుగలో అక్కడ జాతర సాగేది. పెద్దకొజ్జా బావికి ఉత్తరంగా మరో మసీదుంది. దానికి "తలగొట్ల మసీద"ని వ్యవహారం.

ప్రస్తుతం పంచాయితీ ఆఫీసుకు పడమటి వీధి ఆవల ఓ మసీదు, ఉత్తరం వీధిలో మరో మసీదు, దాన్ని దాటగానే మరో మసీదు ఉన్నాయి. ఇపుడు వాటిలో పీర్లను నిలుపుతారు

గ్రామాని కుత్తరంగా రెండోవీధి దగ్గర ఇంకో రంగనాథాలయముంది. ఆదేవునికిపుడు పూజాదులున్నాయి. గుండాలకు జాతర సమయంలో వెళ్ళే దేవుడావారం ప్రకారం ఇప్పటికీ ఈ ఆలయం నుంచే వైభవంగా పల్లకిలో వెడతాడు. కాని ఇపుడు గుండాలలో ఏడు గుండాలు లేవు. వానిలో నాలుగు మరీ నిటంగా ఉండి జాతర సమయంలో మనుష్యులు పశువులు జారిపడుతు ఉండటం వల్ల ప్రజలు వాటిని పూడ్చివేశారు.

"గుండాల గుండాల్లో బెత్తంవేస్తే గుదిబండ గుండంలో తేలేదని ప్రసిద్ధి. గుదిబండ అచ్చంపేట తాలూకాలోని కొండనాగులలో ఉంటుంది. కాని ఈ విషయాన్ని నమ్మటం కష్టం. ఇక్కడ జాతర పుష్యంలో జరుగుతుంది.

ఈ రంగనాథాలయానికి పడమరగా మరో ఆంజనేయాలయముంది. ఈ ఆలయంలో శివ ప్రతిష్ఠగూడాఉంది. ఈ చోటుకు "అంగడి వారపుపేట" అని పేరు ఈలా ఈ గ్రామం అనేకమైన ఆలయాలతో, మసీదులతో నిండిఉంది. ఇది ప్రస్తుత గ్రామస్వరూపం. మాకీ గ్రామ వివరాలన్నీ శ్రీ. రుక్మాంగదరెడ్డిగారు అందజేశారు. వారికి కృతజ్ఞతలు.

ఇక్కడ పేటలపేర్లతో మిగిలిన ప్రదేశాలు, భూగర్భంలో బయటపడిన నీటి హౌజులు ఈ పట్టణంయొక్క గత వైభవాన్ని స్ఫురింప చేస్తాయి.

అంతేగాక రంగనాథాలయంముందుగల పుష్కరిణిలో బయటబడ్డ విరిగిన విగ్రహాలు, పాఠశాలముందు బావిలో బయటపడిన ఎముకలు, తలగొట్ల మసీదు. ఇవి పురస్కరించుకొనిచూస్తే గ్రామస్థులుచెప్పే కరణంగారి కథ నిజమనటానికాస్కారముంది.

ఇక్కడి ఆలయాలను మసీదులనుబట్టిచూస్తే జైనంపై శైవం, దానిపై వైష్ణవం, వానిమీద మహమ్మదీయం ఒకదాన్ని ఒకటి తోసి రాజని ఎట్లా నిండుకున్నాయో ఆజాడలు స్పష్టంగా కన్పిస్తాయి కాబట్టి ఇది పరిశోధకులు, పురాతత్వశాఖవారు తప్పకుండా చూడవలసిన గ్రామం



# అనంతవాణి

శ్రీ జ్వాలాముఖి

గంట!
జాతి జనసత్వాలమంట

గంట
అనాదిగా నిలిచినినదిస్తూన్న
భావితరాల అభయహస్తంపంట

గంట
నిన్నటి భయంకరాపరాధాల పగటి కలల్ని
నేటిని వేధిస్తూన్న గుండె లవిసే పీడకలల్ని
రేపటి కర్తవ్యంలో ప్రక్షాళనచేసిన
సుదీర్ఘ యాత్రల మైలురాళ్ళ జెండా —
చీకటి వెలుగుల సంకుల సమర సన్నాహంలో
వేకువను సంధిస్తూన్న మహోదయంపంట —

గంట
చెలరేగిన చీకటి తుఫానుల్లో
చుట్టువేసిన దురాగతాల దుమారంలో
కంటిపాపల్ని పొడిచే క్రూర వికారంలో
అడుగడుగునా పోరాడి నిలిచిన సహారా ఓడ
చేదు నిజాల సుడిగాలిలో ఓటమి నెదిరించిన మహా ప్రాణంజాడ

గంట
ఎండమావుల కెగసిపడే ఆశల్ని మోయలేదు
వలపు ఒయాసిస్సుపోయగాల పంచన డేరా వేయలేదు!
ఘడియలకు-అడుగులకు మధ్య లయ చెడకుండా
దారితప్పిన అనుభవాలు గమ్యాలను గల్లంతు చేయకుండా
కాళరాత్రి కాంతి బహిష్కారంలో సాగిన కాగడాయాత్ర
ఉజ్వల ఉదయానికి ఊపిరిపట్టిన ఉదయతార

గంట పిలిచింది
కలిచివేస్తూన్న శూన్యంలోంచి
చెదిరిన గుండెల్ని బెదిరిన చూపుల్ని
చెమ్మగిల్లిన అనుభూతుల్ని గాయపడిన కలల్ని!

గంట పలికింది
చరిత్ర గతుల సంఘర్షణ స్మృతుల్ని
అజ్ఞానం మింగేసిన ఆలోచనల అపశ్రుతుల్ని —

కాలం కాందిశీకుల శరణాలయంకాదు
కాలం క్షతగాత్రుల అంపశయ్య కానేకాదు
కాలం నిజానిజాల పోరుతో నిస్తుల తేజం
కాలం చీకటి కోణంలో సూర్యోదయగానం —

కాలమానంలా కదలాడుతూన్న జీవనాడి గంటను
వియద్వీచీ ప్రాచీతరంగాలు ఆలింగనం చేసుకున్నాయి
దిగ్బంధనంలో మౌనం ముక్తకంఠమై రెప రెప లాడింది
విచికిత్సలో చికిత్సాలయం వైతాళిక గీతం పాడింది
టంగ్ టంగ్—టంగ్ టాంగ్—టాంగ్ టాంగ్—ంగ్ ంగ్ ంగ్—

ఫిర్యాదుల్ని విచారించే పితామహుల వారసత్వం
ధర్మాన్ని నిర్వచించే ధర్మవ్యాధుల విశుద్ధ సంస్కృతి
గణగణ గంట నోటి పంటల్ని
అన్యాయం సహించని కంటి మంటల్ని
నిషేధించింది నిర్బంధించింది
అవాక్కుగా మిగిల్చి నిజాన్ని నిర్మూలించింది —

సత్యంవద నాలుక పీకేసిన మహర్షి విషాదం
భాషకందని మానిషాదకవితావేశం
పోటెత్తిన సముద్రాల హోరు—పెల్లుబికిన పృథ్వీగీతం
లయకూర్చిన విలయ ఝంఝామారుతం
గంటను ధ్వజస్తంభంలా మోగించిన గణ గణారావం
చీకటి ఆకాశం వాకిలి తెరచిన పక్షుల కలకలారావం
టాంగ్ టాంగ్—టాంగ్ టాంగ్—టాంగ్ టాంగ్

నిద్ర చెడిన లంక
ఝల్లుమన్న ఆత్మ రతి
గంటను పగులగొట్టి పాతరవేయమంది
ధన్ ధన్—ధన్ ధన్—ధనాంధం—ధాం ధాం —

పంచభూతాల్లో కంచు ప్రాణా లూదుతూ పగిలింది గంట
కణ కణాలలో గణగణల్ని మేలుకొలిపింది గంట
'నిశ్శబ్ద నిర్గుణ నిరాకార భీభత్సం' లో జేజేల జీవాలు పోసింది గంట
నిర్మల స్వప్నాల సాకారరూపాలకు సోపానాలు వేసిందిగంట —

ముక్క చెక్కలు కాని అనాది అతృప్తాత్మల అనంతవాణి
చెకుముకిరాళ్ళలో లీనమై కాలాన్ని కల్లోలితం చేసింది...
టన్ టన్—ట్యన్ ట్యన్—టియన్ టీయన్—న్న్న్న్న్న్—

ధ్వనులు ధ్వనులు—ప్రతిధ్వనులు
ప్రకృతి ధమనుల్లో రెచ్చిన విచ్చిన కనులు
భూమి సిరల్లోంచి నదీనదాల ఒరల్లోంచి
ఆకాశం పొరల్లోంచి ఆదర్శం కలల్లోంచి

జేగంటలు భూమంటలు భూనభోంతరాళాల గంటలు గంటలు
తల్లడిల్లిన భూమ్యాకాశాల దిక్చక్రంలో నవోదయం పంటలు
చీకటి కోటకు కన్నంవేసిన ఉదయతార మహోపరి నిర్వాణం
తూర్పు పగుల నున్న భూమి తెలుకమన్న ఉధృత వాతావరణం —

# ఎగిరిపోతున్న కాలం ఏమౌతుందని అడుగకు

కే ఎ స్వీ

ఎగిరిపోతున్నకాలం ఏమౌతుందని అడుగకు
ఎవరిముందూ విప్పుకోలేని ఈ శూన్యానికి
అర్థమేమిటని అడుగకు
అనాదిగా ఆకారం లేకుండా వస్తున్న నాకు
కంతల బొంతను తొడిగి
రసస్పందనలు పులిమి
నయవంచనచేస్తున్న పంచభూతాలగురించి తర్కించకు
ఈ నీడకు మరో పది నీడల్ని తొడిచ్చి
ఏడ్చుకొమ్మనీ నవ్వుకొమ్మనీ అంటున్న
ఇంద్రజాలం గురించి తలపించకు
ఆలోచనగురించి అసలే ప్రశ్నించకు
అంధకారాటవుల
ఆత్మీయాహ్వానం నేను వినిపించుకోలేదనుకోకు

ఈ క్షణం
కవచాలన్నీ వదిలేసి
నన్ను నన్నుగా
ఉండనివ్వు
ఈ ఉచ్ఛ్వాస నిశ్వాసాలలోనే
వేయి చావులు చావనివ్వు
వేయి బ్రతుకులు బ్రతకనివ్వు
నా హృదయాన్ని వేణువుగా నీ చేతి కందిస్తాను
నాలుగు ఆలాపనలు విరువివ్వు
దోసెడు కన్నీళ్ళకు పిడికెడు రాగాలు బదులిచ్చి
ఈ ప్రాణాన్ని తేలిక పడనివ్వు

# గీతాభ్యుదయమ్

—"సాంధ్యశ్రీ"

## 1

అలనాటి చీకటి వేకువలో
  అలా ఎందుకన్నారబ్బా గురుదేవులు (1)
నేడు
నా జాతికెన్ని అభ్యుదయోషస్సులు..
చూడు గాలి రివటల్లో సైతం ప్రగతి గీతికలు...!

వస్తూనే
విస్తుపోయేటట్లు
రక్తవర్ణంలో ముంచబడ్డ భారతార్కుడు....
పీఠమేదైతేనేం ?
పాఠం తీర్పు - తూర్పు.... !

పవన సౌధాగ్ర ప్రగతి శిఖరాలపై
ఎవరీ తాతలు
గతకాలపు వార్తాహరుల్లా
పహారాలుకాస్తున్నారు – గంటాలతో
జాతి జాతి
జాగ్రదావస్థలో
నిర్నిద్రాముద్రిత నేత్ర సీమల్లో
ఉత్సవాలు జరుపుకుంటుంటే
కచ కుచ భారమ్ములు తప్ప
వర్ణింపని
కప్పుర విడెమ్ములు
ఇంకా
దిక్కులుచూడటం తప్ప
కొత్త బుక్కుల బుక్కులు తీసుకోవేం.... ?

విన్న
జ్ఞాపకం ఉందా.... ?
కలాన్ని ఎత్తి కాగితంపై పొడిచినపోట్లు....
మరినేడో
కలం తిప్పి వ్రాస్తే
మారిపోయిన అక్షర పుటల వాట్లు.... !

## 2

ఈ రోజు చిత్రమేమిటోగాని
సంప్రదాయ కుంత విహతమ్మైన
దివా స్వప్న మిథ్యా ప్రగతి గామిని
దాస్య విముక్త పునరుజ్వలత్ మహనీయునిగా
అభ్యుదయ వాదిగా
మలచింది ....
పాదానరుడు
సదా స్మరణీయుడైనాడు ....
నిన్నట

ఛాంద సారణ్యాన్ని
సుందర వచన కవితానందనంగా
వికపింది... !
ఆత్మ నమ్మకోని మహాకవుల కలాలు
పవన నియంత్రిత వృత్తపరిధిలో
క్రొత్త గొంతులెత్తిన ప్రథమ సమావేశ మీనాడే ....
ఇది నవ శకానికి నాంది....నరశకానికి .... !

## 3

వేదకాలం వాదుమాని
కొత్త మార్పుల్ని జౌదల దాల్చింది ....
నవలా తీర్పులతో...ఓర్పుగా...
అందుకే అన్నాడా ...? ఆ వృద్ధుడు
సాక్షాత్తు మానవ సంతతివాడు.... ?
"ఇది విరాట పర్వమ్రా" అని

## 4

ఏమైతేనేం.... ?
నిన్నటివరకు గుణంలేని గుండెకింత గుణాన్ని
వెలుతురులేని గుడిసెకింత వెలుతురు దారాన్ని

అతిక్రమించాలని - నేడు
పద్యాలతో పంక్తులతో
అవతారం దాల్చిన
అడుగుజాడ కవులతో
గగనేందిర వాణి గాలిలో అందికదా
(2)"అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే
ఇతిమత్వా భజన్తేమాం బుధా భావ సమన్వితాః"

## 5

కృపణ భావంతో
నృపతి
కవిని శాసించిన గతం విగతమై పోయిందిక...
ఐతే
వర్తమానం భావిక ఏమై పోతుందన్న
తర్కానికి
గీతాభ్యుదయంలోని - చరమ సూక్తి
(3)"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ"...
సమాధానమై ంది...

---

టీక : 1. కవిసమ్రాట్ విశ్వనాథవారు ఆంధ్ర ప్రశస్తి అనే కావ్యంలో "ముఖలింగ" క్షేత్రాన్ని గురించి వ్రాస్తూ — "నా జాతి పూర్వ పథా"... ... అంటూ వ్రాసిన పద్యాలు నా మనోవీధిలో మెరిసాయి. ఆ పద్య పాదాలు నాకు యిలా వ్యంగ్యమైన ప్రేరణను యిచ్చాయి.

2. గీతా శ్లోక మిది.

3. గీతాశ్లోకమిది, 1పాదం మాత్రమే!

---

# నేస్తం

## శ్రీ జి. రామశేషయ్య

పగలు ప్రకాశించే సూర్యుడు
నాకు మీ తుడవి అందునా —

మరి రాత్రిమాట ?

హెచ్చుతగ్గుల్ని లెక్కచేయక
చంద్రుడు నాకు మీ తుడందునా —
అవంతైనా అదెంతైనా సరే
అమవస నిసిలో ఆ మాత్రం
వెలుగులు పంచే దెవ్వరు ? !
మేఘాలను చీల్చే
మెఱుపుతీగె క్రాంతి —
క్షణికమైనా అదే — ప్రా
మాణికమె మ్మతే ! !
స్వల్ప వ్యవధిలో — ఆ
నల్ల చైతన్యాన్ని
ప్రదర్శించే కెరటం మాట ! ?
ఉదయావికెల్లా విచ్చి వాసిల్లే
సుమ వళి చూపుతున్న బాట ! ?

పుంజీకృతోత్సాహ శోభితమై
ఉజ్జీవించే ఉనికితో నా చెలిమి
అనవరతం స్పందించే పడికెడు
గుండియయే నా కలిమి బలిమి.

# కందుక కేళి

డా. నాయని కృష్ణకుమారి

నిస్తబ్ధ కాసారంలో
  విసిరి పృథు శిలాఖండాన్ని
చిరునవ్వులు చిందిస్తూ
చిద్విలాసంగా నువ్వు !

మనసు కేంద్రమైనచోట
సందేహ తరంగ వలయాలు !
మెదడు గట్టును మెట్టి
ఎదురుగా వెనక్కి వచ్చే
వ్యతిరేక ప్రతీప శక్తులు !

నా మనసొక బంతి !
నీ చేతుల్లో పడుతూ లేస్తూ
ఆట ఆపేసి
ఆప్యాయంగా నువ్వు గుప్పిట నిమిరే
అమర క్షణం కోసం
ఎదురుచూస్తూ !

ఋతమో అనృతమో
బ్రతుకు ముడి
విడిపోని వికట గ్రంథిగా మారి
నిన్ను విప్పమంటూ
దీనంగా కోరుకుంటూ !

ఈ బ్రతుకులో
విభ్రమించే అస్పష్టోహాలు
నీవు గాలిలో చెక్కే అక్షరాలై
ఏవో సందేహ సూచక
హస్త చాలనాలకు
అర్థాల్ని వెతుక్కుంటూ
ఆరాధిస్తూ ! —

నీ అడుగు కొన వేలి స్పర్శలో
పరీక్ష ఫలితాలు వెతుకుతున్నాననేకదా
నన్నుచూస్తే
నీకు ఆట !



# పరమహంసలా...

శ్రీ తిరునగరి

ఏ మృదు చాంద్రీ స్పర్శతో
పులకించి పోయిందో ఈ మనస్సు !
వెన్నెలపదాలు పాడుతున్నది
అమృతం తాగిన చకోరంలా
ఏ విశాంత పవనోర్మిలనంతో
ఆనందంతో పరవశించిందో ఈ హృదయం

జాగృతి తేజోమూర్తియై
ఋగ్వాక్యాలను కూజిస్తున్నది
తమసానదీ స్నానం చేసిన ప్రాచేతసమౌనిలా
ఏ సాయం సంధ్యారుణిమల్లో
కుంకుమ పూదోటల్లో విహరించిందో ఈ చేతన
రానున్న కాలాల రాగరంజిత స్వప్నాలను కంటున్నది
విరిజవ్వనంలో ఏదో మాధుర్యంలో తేలిపోయే
మదిరాక్షిలా

ఈ గుండె ఒక క్షీర సముద్రం
మథించగా, మథించగా, మథించగా
వచ్చిన హాలాహలాన్ని
జీవితేశ్వరుడు గళంలో దాచుకున్నాడు పదిలంగా
త్రచ్చగా త్రచ్చగా వచ్చింది
అమరత్వం ప్రసాదించే అమృతం
ఆ అమృతం – ఈ ఆనందం
జీవితపు చల్లకుండను చిలుకగా అవతరించిన నవనీతం

బ్రతికిన నాలుగు నాళ్ళైనా
ఆనందామృతాన్ని జుర్రుకొమ్మంటున్నది కాలం

స్వేచ్ఛగా భావనాపక్షాలూపుకుంటూ విశాలవిశ్వమంతా
చుట్టివస్తూ అమరగీతం పాడుకొమ్మంటున్నది జీవితం
జీవితమనే హార్మోనియంపై
సంతోషపు సరిగమలు మీటుకొమ్మంటున్నది హృదయం

ఈ హృదయం ఒక పియానో
దాని మాధుర్యం అనుభవైకవేద్యం
ఈనాడు ఎగసి ఎగసి పడుతున్నది
పచ్చని వనాల్లో గెంతే కురంగంలా
ఎంతో చైతన్యంతో ఉద్దీపిస్తున్నది
పరమార్థం తెలుసుకున్న పరమహంసలా

అందుకే

కవినై కమ్మని గీతం వ్రాసుకుంటున్నాను !
గాయకుడనై గొంతెత్తి పాడుకుంటున్నాను
అనిత్యాలైన కష్టాలనూ-కన్నీళ్ళనూ-ఐహికమైన
కంటకాలనూ
అదేపనిగా ఎదుర్కొంటూ–జయిస్తూ
చిరునవ్వుల సేవనం చేస్తున్నాను
మురిపాల మనస్సుతో ముందడుగు వేస్తున్నాను
వెన్నెల పదాలు పాడుకుంటున్నాను
తేజోపథాన్ని సందర్శిస్తున్నాను
రానున్న కాలాల రాగరంజిత స్వప్నాలు కంటున్నాను
పరమానందమూర్తినై నేడు
పరమహంసలా...నేను.

# మార్పు

## శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

నిద్రగాక మొన్న నీవును నేనును
  తిరిగినార మచట తీరభూమి,
సైకత స్థలాల దూకులాడుచు, హాయి
నవ్వుకొనుచు ఇసుక రువ్వుకొనుచు —

అపుడీ గుండెల పొంగివిండ విరతమ్మౌలోలమె వేల దూ
రపు కాలంపు మలీమసస్మృతి దుమారంబింతయున్ లేదు-వే
ర్తపు కోణమ్ములలో అతృప్తుల విపీచ్ఛాయలున్ లేవు-స్వ
ర్గపు స్రోతస్విని వీచికాద్వయముగా రాణించి నా మిర్వురున్ !

మలిసంజ గగనంపు మసృణ చాంపేయాభ
వెన్నెలగామారి విరిసికొనెడు
అమృతంపు వేళలో అచట తరంగిణీ
భంగ స్పృశిత గృహ ప్రాంగణమున
మెట్లపై వసియించి మెల్లగా వీచెడు
అమల దక్షిణ సమీరములలోన

గళమెత్తి నీవు రాగమ్ము లాపింపగా
మ్రోగె నా హృద్వీణ శ్రుతిని గలిపి — —

తనువులు జారె అప్పుడట - దారులు మూసిన వసివైపులన్ —
ఘనమగు వర్తమానమె అఖండపు కుడ్యములన్ సృజించె వీ
థువుల నాల్గు మూలల-ప్రమత్తత జోగుచు తూలిపోవుచున్
క్షణముల రీతి వారినవి గంటలె, దివ్యుల కాలమానమై !

... ... ముప్పదేడులు చల్లగా మురిగి జరిగె —
మరల కలసితి మిచట ఈ మార్గమందు —
కాని నన్నును నిను బిగికౌగలింత
ఒడిసి కొన్నది భూతమీ గడియలందు !

నోరార నవ్వజాలము —
తారా నీ రంధ్ర శుభధామము దెసగా !
సారించలేము దృక్కుల —
సారహీనపు కబుర్లు, సంభాషణలే !



# ప్రాకృతభాషలో మాట్లాడే ప్రేయసికావాలి

శ్రీ వనమాలి

నేను సంస్కృత భాషని
మూడు పూటలూ తాగుతాను
టానిక్కు తాగినట్టు.

నా హృదయంలో కండరాల్ని పెంచుకుంటున్న భావాలు
బంగారు పంజరాలో చిలకల్లా
తరచు సంస్కృత శ్లోకాల్ని పలుకుతుంటాయి.
అప్పుడప్పుడూ ఆ భాష నాటకాల వనభోజనాల్నికూడా
అనుభవిస్తుంటాను

పాడుతున్న ట్రాన్సిస్టర్లాటి
ఆ రెండు పుస్తకాల్లోంచి పదే పదే
నాకు సూత్రధారుడి గొంతు వినిపిస్తుంది.

చదువుతున్నప్పుడు ప్రతి పాదవెనక
నాకు నాయికా నాయకుల
సంభాషణలు కనిపిస్తాయి.

ఒకానొక విపణి వీథిలో
కనిపించిన భానుణ్ణి అడిగాను
ఆరోగ్యవంతమైన పండ్లదుకాణం పక్క నిలిపి
"మీ కవుల ప్రతీ నాటకంలో నాకెందుకని
వసంత ఋతువు మాత్రమే కనిపిస్తుంది?" అని
"మేమన్ని ఋతువుల్ని ప్రేమించాం" అన్నాడాయన
కానీ ఆయన పదాలు
మామిడి పూతలా నా వంగిన
శిరస్సుమీద రాలాయి.

అవును !
నేనుకూడా అన్ని ఋతువుల్ని ప్రేమించాను
కానీ పొగడబోతే ప్రతిసారి
నా శ్వాస పొగమంచులా వాలింది
కోత కొచ్చిన వరిచేనుమీద.



# డాక్టర్. జి. నాగయ్యగారి
# -దాక్షిణాత్య సాహిత్య సమీక్ష-

## మొదటి సంపుటము - ఒకపాటి అనుశీలనము

శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి

ఆంధ్ర వాఙ్మయంలో తులనాత్మక పరిశీలనము - ఒక కొత్తదారి; ఆ ప్రస్థానంలో ఒక మార్గదర్శక చిహ్నం ఈ నాగయ్యగారి గ్రంథం; ఇది వివిధ విషయపూర్ణము, అనేక గ్రంథపఠన శోధన ఫలితము, బహుభాషా పాండిత్య ప్రభావం. తన భాషదప్ప ఇతర మెరుగక "నా భాషే గొప్పది" అనడం ఆపాత మధురమైనమాట- దురభిమాన సూచకము. "ఎల్లనృపులు గొల్వ బాసాడ ఎరుగవే? దేశ భాషలందు తెలుగులెస్స"-అని, అన్నిభాషలు తెలుసుకొని కృష్ణదేవరాయలు అన్న ఈ మాట పసిడి తునక. తెలుగునాటి నడిగడ్డన ఉన్నవారికి సాధారణంగా ఇరుగు పొరుగువారి భాషల సంగతి అంతగా తెలియకున్నది-సంస్కృతమో ఇంగ్లీషో దప్ప. ఇట్లా తెలుసుకోక పోవడమే వీరాంధ్రుని ప్రత్యేకత అని గూడ అంటారు. తెలంగాణా వారికి ఇది అన్వయించదు-వారు బహుభాషావేదులు. ఇక చుట్టు పొలిమేరలలో ఉన్నవారిలో చాలామందికి ఆయా భాషల పరిచయము, కొందరికి పాండిత్యము అబ్బి భాషల పోల్చిచూపి సుదింపు చేయగలుగుతున్నారు. సాహిత్య అకాడమీ వివిధ సాహిత్యాల రచనలను పరిచయం చేయుచున్నది. వివిధ భాషామణులే సమగ్ర హైందవ సంస్కృతి సూత్రానికి కూర్చబడుతున్నవి. ఈ గ్రంథం ఆట్టి సంప్రదాయానికి ఎంతో సహాయకారి. "వివిధ భాషలనుగురించి తెలుసుకోవడం, తెలుసుకొని ఆనందించడం ఒక మధురమైన అనుభూతి" అని డాక్టర్ తిమ్మావఝ్ఝల కోదండరామయ్య, ఈ పొత్తపు "ముందుమాట"లో అన్నది మధురసత్యం.

పూర్వం మానవల్లి రామకృష్ణయ్యబోటి పెద్దలు ఈ తులనాత్మక పరిశీలనా ప్రక్రియను కొంత ప్రారంభించినారు. ఇప్పుడు దక్షిణ నాలుగు భాషాపండితులు చాలామంది అనేక భాషలను పారమంటి నేర్చి, పోల్చి మేలిమి సరుకును బయట పెట్టుతున్నారు. ఇక ఈ నూతనాలంకారాలతో ఆంధ్రభారతి భాసించగలదు.

### దాక్షిణాత్య సాహిత్యాల విశిష్టత

డాక్టర్. బి. ఎస్. రెడ్డి యాజమాన్యాన శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీలో దాక్షిణాత్య సాహిత్యముల తులనాత్మ అధ్యయనాన్ని ఒక శీర్షభాగం కల్పించి ఈ నూతనోద్యమానికి అస్తిభారం వేర్పరచడం పొగడదగినచేత. ఇంతవరకు సంస్కృతము ఇంగ్లీషు భాషల విలువను చాలా తెలుసుకొని ఉన్నాము; హిందీలో గూడ మంచి పరిశ్రమే జరిగి ఉన్నది. మన చుట్టుపట్ల ఉన్న ఉడియా మహారాష్ట్ర కన్నడ తమిళములను కొంత దూరానఉన్న మళయాళమును - వీటి సాహిత్యాలను తెలుకొనే పరిశ్రమ ఇప్పుడిప్పుడే జరుగుతున్నది; ఇది మన భాష పెరుగుదలకు సహాయకారి. ఇప్పుడు ముఖ్యంగా దాక్షిణాత్య (ద్రవిడ) సాహిత్యాలకు నవ్యయుగం. ఈ నూతన కృషివల్ల ఇతర భాషలలోని గొప్పను తెలుసుకోగలుగుతున్నాము. అంతేగాదు, దీనివల్ల నా భాషే గొప్పదన్న దురభిమానం సమసిపోయి, ఆ దాని ప్రధానాలతో తోడిభాషలెట్లా అభివృద్ధి జెందుచున్నవో మనసుకు రాగలదు.

అజంతమైన తెనుగు శ్రుతిమధురమైనా, అనాదిగా విశిష్టంగా అభివృద్ధి జెంది, సంస్కృత ప్రాబల్యాన్ని అంటనీయకుండా ఎదిగిన తమిళవికాసం దక్షిణాపథంవారు గర్వింపదగినది.

### డాక్టర్ గూడూరు నాగయ్యగారు

ఈ గ్రంథకర్త-డాక్టర్ నాగయ్య కన్నడం, తమిళం, మళయాళ భాషలలో గట్టిపండితుడు; ఇక తెనుగు, సంస్కృతం, ఇంగ్లీషుల సంగతి చెప్పనేవనిలేదు. వీరి పాండిత్యం కల్ల పసిడిమెరుగుగాదు; పుటాలు బడిన కుందనపు బంగారువాయ. దీనికితోడు నిశిత విమర్శక ప్రజ్ఞ—విస్పష్ట రచనా నైపుణ్యము మెరుగుబెట్టుతున్నవి. లోతు పరపుగల ఈయన వివిధ భాషా పరిజ్ఞానం రాశిపోసిగల ఈపుస్తకాన్ని వెలువరిస్తున్నది. ద్రావిడ భాషలన్నీ ఇంతగా తెలిసి సమన్వయించి వ్రాయగలిగినవారు ఆంధ్రులలో అరుదు. ఈ రచనలో ఒక ప్రయోజనకరమైన విషయం:— ఒక విషయాన్ని వివరించి విమర్శించి, అక్కడకక్కడనే వివిధ గ్రంథాలలోని వైరుధ్యాన్ని (ముఖ్యంగా రామ

కథ విషయంలో)సామరస్యాన్ని విడదీసి చెప్పడం (Cross References) పాఠకుని విజ్ఞానాన్ని పెంచడమే గాకుండా ఆనందాన్ని అతిశయింప జేస్తున్నది. ఇవి అన్నిటా చాలిన వారి చేతనైనపని. ఇదే ఈరచయిత ప్రత్యేక ముద్ర. ఈ గ్రంథంలో తెనుగు విమర్శక పండితులందరి వ్రాతలనుండి ఉదాహరణములు గలవు; ఇట్లే ఇతర భాషలనుండి గూడ. ఇది ఓపిక కావలసిన లోతు చదువు.

## తమిళభాషా విశేషం

ద్రావిడభాషలలో తమిళం, క్రీస్తుశకారంభంనుండే పూర్ణ వికాసరి పొందిన భాష. ఇందు సంస్కృత సంపర్కంలేకనే స్వాతంత్ర్య రేఖలతో సర్వతోముఖంగా భాసించిన పూర్ణభాష. ఇది అప్పటమైన దేశి ! ఇందలి సాహిత్యమంతా గేయరూపం; (పాటలు) అందువల్లనే జానపదులనుగూడ ఆకర్షించి, ఊరూ నాడు అంతా వ్యాపించినది. ఇక కన్నడం కాలమానంలో రెండోది, తర్వాత తెనుగు; దీనికి చెల్లెలు మళయాళం.

అప్పుడు తమిళం సంస్కృతాన్ని తాకలేదు, ఇప్పుడు దగ్గరకు చేర్చుకొన్నది. కన్నడము తెనుగు (ఆంధ్రము) ఆర్యసంప్రదాయాను వర్తులై తమ్ము సంస్కృతానికి దత్తపుత్రికలుగా జేసుకొన్నవి; క్రమేణా ఇవి అన్నివిధాలా సంస్కృతీకరణములై పోయినవి.

డా. నాగయ్య ఈ విషయాలు చెపుతుంటే ఆశ్చర్యము ఆనందము జమిలిన పెనవేసుకొంటవి. ఓః! ఈయనది ఎంతటి పరిశ్రమ-ఎంతటి సుగమ రచనా పాటవము ! విషయపూర్ణమైన ఈ పుస్తకాన్ని పలుమారు నెమరువేసుకొని జీర్ణించుకోవలసిఉన్నది.

మొదట దాక్షిణాత్యభాషల చరిత్ర, స్వభావం, అభివృద్ధి తులనాత్మకంగా చర్చించినాడు. ఆవల ప్రత్యేక విషయాలుగా :— 1. రామ కథ; రంగనాథ కంబరామాయణములు 2. సాహిత్యములు-దేశి, 3. యక్షగానములు — ద్రావిడ దృశ్యరీతులు — అను శీర్షికల క్రింద విపుల వ్యాఖ్యానం చేయబడిఉన్నది. ఈ సంపుటం మొదటిభాగమే, ఇంకా రెండు రానున్నవి.

ఇక ఒక్కొక్క శీర్షికను పరిశీలించుకొందాం :—

## 1. రా మ క థ -
## రంగనాథ కంబరామాయణాలు

రామాయణాన్ని గురించి తెనుగులో ఇంత సమగ్ర చర్చ వెలువడి యుండలేదు. ఇంచుమించు యాభైయేండ్ల నాడు తాపీ ధర్మారావు 'భారతి' పత్రికలోనే "రాముడు సీతకు ఏమి కావాలి ?" అన్న శీర్షికలో, ఇది ఒక చొప్పదంటు ప్రశ్న కాదని, వివిధ రామాయణాలు విన్నా చదివినా ఇదే అనుమానం కలుగుతుందని ఒక ఘనమైన వ్యాసం వ్రాసి కలకలంపుట్టించినారు. అంతకుముందే, డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి, మదరాసు గోఖలేహాలు ఉపన్యాసంలో (1921) భారత విమర్శచేసి, సాంప్రదాయిక వాదులకు షాకు, నవ్యులకు సంతోషమూ కలిగించినారు. ఇదే సమయంలో వేదం వెంకటాచల అయ్యరు (కళాప్రపూర్ణ వేదం వెంకటరాయశాస్త్రి సోదరుడు) ఇంగ్లీషులో భారత విమర్శ నవ్యదృష్టితోచేసి ప్రచురించినారు (1922) ఇది భండార్కర్ పరిశోధక మండలికి సహాయపడినది. పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి భారత విమర్శ తెనుగులో ఒక బాంబువంటిది. ఈయనే కట్టమంచి ఆయన సూచన మీద రామసూయం ఒక నరమేధమని ఒక పుస్తకం ప్రచురించినారు. ఆ తర్వాత సురవరం ప్రతాపరెడ్డిగారి "రామాయణ విశేషాలు" వచ్చినది; ఇందు రామాయణాన్ని గురించి సమగ్ర చర్చగలదు. నిన్న మొన్నటి ఆరుద్రగారి వ్రాతలు వీటి సారాంశమే.

ఈ నాగయ్యగారి రామకథా విమర్శ అపూర్వ విషయ పూర్ణమై, రాముడు సీతకు ఏమి కావాలనో తెలియనీక తికమక పెట్టుతున్నది.

## రామకథలో వైవిధ్యం

దీనికంతా కారణం రామాయణాన్ని వాల్మీకి ఒక కావ్యంగా వ్రాయడమే ! కుశలవులు - అనే వీధిగాయకులు పాడుతుండిన జానపద గేయాన్ని లౌకిక సంస్కృత కావ్యంగా వాల్మీకి మొదట వ్రాసినాడు. ఆవల ఆయన కవిత్వానికి పైత్యం జోడింపైనది. ఇది భారతంవలె ఇతిహాసం కానందున, ఇందు అభూత కల్పనా చాతురి వీరవిహారం చేసినది. దీనికితోడు, పరమట ఇరాను మొదలు తూర్పున ఇండోనేషియా, ఉత్తరాన టిబెటు లావోసు వరకు రామకథ వ్యాపించి, దేశ కాలానుగుణంగా మార్పులు చెందినది. భిన్నమతాలవారు తమ కనుకూలంగా కథను మార్చి మొదటి రూపాన్నే గుర్తుపట కుండాచేసి వేసినారు.

భిన్నాభిప్రాయములకు చిత్ర విచిత్ర కల్పనలకు మొదటిపుట్ట పద్మ పురాణం. తర్వాత బ్రహ్మాండ పురాణము, అధ్యాత్మరామాయణము, అద్భుత రామాయణము మహారాష్ట్రుల ఆనంద రామాయణముఉన్న భిన్నకథలను ఒకదానికొకటి జోడించి, ఇచ్చిపుచ్చుకొని కల్పించి పెంచి తారుమారుజేసి రామాయణాన్ని గచ్చపొద జేసినవి. ఇక జైనబౌద్ధులు ఇతర మతాలవారు కథను సంకరం చేసిపారవేసినారు. లావోస్ బూటాను కథలు ఇంకా విచిత్రాలు. ఇవిగాక రామకథ చాలా పురాణాలలోను, భారతము కథాసరిత్సాగరంలోను ఉన్నది.

వీటిలో చాలా అంశాలు అవాల్మీకీయాలే !

ఇట్లే ద్రావిడభాషలలో కవుల స్వకపోల కల్పితాలు స్వైరవిహారం చేసినవి. వాల్మీకి మూలాన్ని చేబట్టి కతకు సొంత కొమ్మలు రెమ్మలు పుట్టించినారు. తెనుగున గోనబుద్ధారెడ్డి తన రంగనాథ రామాయణంలోను, కంబమహాకవి తన తమిళ రామాయణంలోను, తెనుగు తమిళ దనాల కల్పించి నూతన ఔచిత్యాల దూర్చినారు.

కంబునికి భరతుడు ఆదర్శ పురుషుడు, వేయిమంది రాములైనా ఒక భరతునికి ఈడు జోడు గాదని అంటాడు.

డా.నాగయ్య ఈ రామకథ వివిధభాషలలో వివిధరామాయణాలలో ఎట్లామార్పబడినదీ,చేర్పబడినదీ విపులంగావర్ణించినాడు. ఈపట్టుననే ఆయన వివిధ భాషాజ్ఞానము-పాండిత్యము—విమర్శక పాటవము

బయటబడేది అందులో ఆ సంగతి. ఇందులో ఈ విషయము అని అక్కడక్కడనే ఉదాహరించడమే ఈ రచనకు ఒక మెరుగు. వ్యక్తుల బాంధవ్యాలు అన్నీ తారుమారై ఎగాదిగై ఉన్నవి. విటి నన్నిటిని తీరికగా ఓపికగా చదివి అడుగడుగున విస్మయం పొందవలసి ఉన్నది. ఇవి చదివితే మీరూ రాముడు సీతకు ఏమికావాలని అంటారో లేదో చూస్తాం.

## రంగనాథ-కంబరామాయణాలు

గోన బుద్ధారెడ్డి దేశీ ఛందమైన ద్విపదలో తెనగు పలుకుబడులతో రంగనాథ రామాయణం పేరిట రామకథ చెప్పినాడు. కంబుడు తమిళంలో పాటలుగా తమిళతత్వ ప్రతీకగా వ్రాసినాడు. ఇద్దరూ రాముని దేవుడు చేసినారు. హిందీ తులసిదాసు ఈ ఇద్దరికి సమ ఉజ్జీ. ఇద్దరూ తమ తమ నాగరకతలను, స్థానికాభి రుచులను జాతీయ తత్వాలను దూర్చినారు. ఈ రెంటి తులనాత్మక చర్చ ఈ గ్రంథంలో చాలా సొంపుగా ఇంపుగా ఉన్నది. ఇద్దరూ ఎనెన్నో కల్పించినారు. కంబునకు రావణునిచేత సీతను తాకనీయడు; ఈ రావణుడు సంస్కారి సంగీత ప్రియుడు. వీణ ఈయన ధ్వజచిహ్నం కంబుని రామాదులు శాకాహారులు.

ఇకరెడ్డి, తెనుగునాట ఇప్పుడు వ్యాపించియున్న జానపద గేయాల వన్నిటికి మూలవస్తువు కల్పించినాడు లేదా, దేశవ్యాప్తంగా ప్రచారం ఉండిన గ్రామీణ కథలను గ్రంథస్థం చేసినాడు అని అన్నా అనవచ్చు. అవాల్మీకములుగా హరికథలలోను పుక్కిటి పురాణాలలోను వినబడే విపరీతపు వింతకథలే ఇందు చెప్పబడియున్నవి. ఉడుతభక్తి ఊర్మిళనిద్ర-సులోచనవృత్తాంతము - కాలనేమికథ శబరి ఎంగిలి పండ్లను భక్షణము-లక్ష్మణుని నవ్వు మొదలైనవి రంగనాథలో ప్రత్యేకాంశాలు.

ఇప్పుడు ప్రచారంలో ఉన్న అవాల్మీక వివిధ గాథలు ఎక్కడెక్కడ ఏ యే రామాయణాలలో ఉన్నవో అన్నీ ఇప్పటంమీద ఏరి పుస్తకంలో కుప్పలు బోసి ఉన్నారు. వరుసబెట్టి ప్రతి కాండాన్ని చర్చించున్నారు.

చదివి ఆనందించవలసినదే, వ్రాయను అలవికాదు. బుద్ధారెడ్డి కంబుడు చేసిన పాత్ర చిత్రీకరణాలు కళాపూర్ణాలు. ఈ రెండు రామాయణాల ఈ తులనాత్మక చర్చ ఆనందదాయకమేగాక, జ్ఞానాభివృద్ధికి తోడ్పడుచున్నది. ఈ గ్రంథంలో వివిధ భాషలలోని రామకథలు అనుశీలింపబడియున్నవి-ఆసక్తిని గూరుస్తున్నవి-చదవండి

## 2. దాక్షిణాత్య సాహిత్యములు-దేశి

### ఇక రెండవ శీర్షిక :-

ఇది రచయిత వ్యాకరణశాస్త్ర ప్రదీపకము. నాలుగు ద్రావిడ భాషలందు ఛందోరీతులను పోల్చి చెప్పి పండితులకు విద్యార్థులకు ఎంతో ఉపయోగకారిగా వ్రాసినాడు. మార్గ అంటే-భావ భాష మొదలగు సమస్త విషయాలలో సంస్కృత ప్రతిరూపమైనదని; దేశి అంటే-దీనికి భిన్నంగా, ప్రాంతీయపు అచ్చపు దేశిభాష భావం నాగరతలు గలిగినదని బాగా ఊనటంకినాడు దేశిలో నిబద్ధ అనిబద్ధ రెండువిధాలు. ఏతాళి అనుకోకుంటే నాటుసరుకు అందాం జాను పదానికి గూడ స్వదేశి అనే అర్థం ఇవ్వడం ఆమోదకరమే.

### తమిళం

వివిధ భాషా ఛందస్సులను వివరిస్తూ, తమిళభాష క్రీస్తుశకారంభానికే పూర్ణవికాసం చెందినది అని చెప్పినారు. ఈ కాలంలోనే తిరువళ్ళువర్ తిరుకురళ్, ఇలంగో అదిగళ్ శిలప్పదికారం (మంజీరగాథ) మణిమేఖలై మొదలైన మహాకావ్యాలు సృష్టింపబడినవి. వీటిపేర్లు ఇతివృత్తము ఛందము భావ భావాలు కవి సమయాలు అన్నీ స్థానికాలే గాకుండ స్వతంత్రాలు; ఇవి సంస్కృతపు పోలికలే లేకుండా ముందుకు సాగినవి. తమిళ వ్యాకరణమే తొలి కప్పియం. క్రీ. పూ మూడవ శతాబ్దంలోనే పుట్టి పరిశ్రేణులకు సంజ్ఞలకు అనవ పేర్లే పెట్టినది పాణిని సంస్కృత వ్యాకరణం తర్వాత ద్రావిడ భాషలకు ఇదే ప్రథమ వ్యాకరణం కావచ్చు. ఈ ద్రావిడ మహావాఙ్మయ ప్రపంచంలో కంబుని రామాయణం మొదటి సంస్కృత అనువాదం కావచ్చును. ఎట్లా తమిళం దేశిగానే పుట్టి పెరిగినది. తమిళానికి బౌద్ధ జైన ప్రాబల్యం ఎక్కువ.

### కన్నడము

కన్నడ భాషావికాసం తెనుగుకంటే ముందే ప్రారంభమైనది. దేశి పద్ధతులు ఛందముల రూపొందినా అంతా సంస్కృతాను సారంగానే సాగింది.

### తెనుగు

తెనుగుగూడా ఎక్కువగా సంస్కృతీకరింపబడినా, కందం సీసం రగడ తరువోజ ఏలలోటి దేశిఛందాలు వెలసినవి. ఆటవెలదిని వేమన బాగా ఆడించి ముందుకు దెచ్చినాడు. ద్విపద తెనుగు సొంతం అయినా తెనుగు భాషావికాసం 11వ శ.లో నన్నయతో సంస్కృతి మార్గాన ప్రారంభమైనది. రేనాటి ధనంజయ చోళుని 6వ శ. శాసనము; 9 శ. లో కందుకూరు పండరంగని తెనుగు పద్యాల శాసనం 10 శ. లో బెజవాడ గుణక విజయాదిత్యుని పద్యశాసనం దేశిరూపాన్ని కలిగిఉండినా, కన్నడానికి ఎంతో వెనుక తెనుగు వికాసం నొందినది.

### మళయాళం

మళయాళం తమిళానికి రూపాంతరంగా చాలాకాలంఉండి సామ్రాజ్యంనుండి విడిబడిన చిన్నరాజ్యంవలె స్వతంత్రమైనది. (బెంగాలీ పలుకుబడినుండి అసమీ బయట బడినట్లు) సంస్కృత భాషా ప్రభావం ఇంత ఎక్కువగా గలిగిన దాక్షిణాత్యభాష ఇంకొకటి లేదు. దేశి ఇక్కడ ఉంటేలేనట్లు ఉన్నది చెరిసగంగా సంస్కృతము మళయాళం కలిసిన మణిప్రవాళ బాణి (రత్నాలు-పగడాలు) అనే పద్యరూపం ఈ భాషకు ఒక ప్రత్యేకత.

ఇట్లా నాగయ్య విషయ పూర్ణంగా సమగ్రంగా వర్ణించి

క్రింది సిద్ధాంతాల నేర్కొన్నాడు :- దక్షిణాది భాషలన్నిటిలో ఒక సామ్యమున్నది (ఇది కాల్డ్‌వెల్ కనిపెట్టిన కిటుకు) ఈ నాలుగు భాషలలో మొదట దేశి ప్రధాన సాహిత్యం బాగా ఉండి క్రమేణా మార్గకు చోటిచ్చి వెలిగినది. మొదట దేశి జనానురంజకంగా ఉండి, సంస్కృతపు పలుకుబడివల్ల మారి రెండూ ఆదరింపబడుతూనే వచ్చినవి. తమ ప్రత్యేకతను – భాషలో ఛందములో నిలుపుకోవాలని ఈ నాలుగు భాషలు ఇంకనూ ప్రయత్నిస్తూనే ఉన్నవి. కాని, దేశి తమిళమునందే నిండుకొని ఉన్నది తెనుగు. మలయాళములో సంస్కృతభాషా ప్రభావం ఎక్కువగా కనబడుతున్నది ఇప్పుడు మరల ఈ భాషలలో దేశీయత ఎక్కువగుతున్నది.

ఈ శాస్త్ర విద్యా ప్రవణం బరువైన విషయాలను చెప్పినా, చదివేవారిని ఆకర్షిస్తున్నది.

## 3. యక్షగానములు - ద్రావిడ నృత్యరీతులు

ఈ ప్రక్రియ ఈ నాలుగు ప్రాంతాలలో పుట్టి పెరిగి శాఖోపశాఖలై తమ ప్రత్యేకతను నిలుపుకొని రాణిస్తున్నవి. యక్షగానమని సంస్కృతనామం తగిలించు కొనిఉన్నా ఈ "జక్కులపాట" సిసలైన దాక్షిణాత్య గ్రామీణ గానవృత్త నృత్యాత్మకమైన వినోదక్రీడ. కవి సార్వభౌమ శ్రీనాథుడే భీమేశ్వర పురాణంలో ఈ నామకరణం చేసి వట్టున్నది. ఇటువంటివాటికి ఈయన మొనగాడు. 'రాయబారం" అనే పారశీకపదాన్ని తెనుగులోకిదించి 'కాగితం' అనే పదాన్ని సృష్టించి వట్టున్నది. భీమేశ్వరం పురాణాన్ని శుద్ధదేశి చేసినాడు. కంబుడు సరయూ నదిని కావేరి చేస్తే, ఈయన ఉత్తరహిందూ దేశ దేవతలనంతా గోదావరీ తీరానికి తెచ్చినాడు. ఈ ప్రత్యేక వినోదవాణి దక్షిణ సంస్కృతికి అవతంసము. దీని మొదటి పేరు కొరవంజి; కొరవ అంటే ఎరుకలవారు. యక్షగానము - వీధిభాగవతము (బోగాతము) - వీధినాటకము – కొయ్యబొమ్మలాట – తోలుబొమ్మలాట - జంగంకథ - బుర్రకత - హరికథ - పురాణకథనము (కాలక్షేపం) మొదలైనవి, ఈ అరటి పాదిలో పుట్టిన పిల్లలు. యక్షులు లేక, జక్కులు తెనుగు జాతులు; జక్క-ఎక్క-అక్క పర్యాయ పదాలు.

ఇవి ఆంధ్రలో 9 వ శ. నుండి ప్రచారంలో ఉన్నవి. పాల్కురికి సోమనాథుడు (1160-1240) తన దేశి కవితలో ఈ దేశి రీతులను వర్ణించి, వీటి భేదాలను - బయలాట - దొమ్మరాట - తోలుబొమ్మలాట - వెడ్డంగము పిలలు - దాసరి చిందులు గంతులు - కేళికలు అని పేర్లు చెప్పుతున్నాడు ఇవి పరస్పర పోష్య పోషక భావంతో పెరిగినవి.

ఆంధ్ర, కర్ణాటకములలో ఒకే కాలంలో ఇవి వ్యాపించినవి. ఉభయభాషలలో అనేక గ్రంథాలు (వీధినాటకాలు), ఇప్పుడు వాట కాలవలె వెలువడినవి. తంజావూరు నాయక రాజులు ఈ కళను పోషించినారు. విజయరాఘవుడు, తర్వాత రాజ్యానికి వచ్చిన మహారాష్ట్ర శాహాజీరాజు స్వయంగా తెనుగులో అనేక యక్షగానాలు వ్రాసి ప్రయోగింపజేసినారు. క్రమేణా యక్షగానాలు వీధిభాగవతాలైపోయినవి. ఇట్లే తెలంగాణా రాయలసీమలో గూడ ఇవి ప్రచారంలోకి బాగావచ్చినవి

త్యాగరాజు, నారాయణతీర్థులు, మేలట్టూరు వెంకటరామ శాస్త్రి యక్షగానాలు వ్రాసినారు.

### పాత్రోచిత భాష

వేదం వెంకటరాయశాస్త్రి, గురజాడ అప్పారావు నాటకాలలో పాత్రోచిత భాషను ప్రవేశపెట్టినారు శాస్త్రికి సంస్కృత నాటకాల పలుకుబడి కుదిరినది. కాని తంజావూరు శాహాజి రాజు (1684-1712) వ్రాసిన యక్షగానాలలో ప్రాంతోచిత భాషను ప్రవేశపెట్టినాడు. హాస్యానికి, కటిక వానిని వాని యాసను ఉపయోగించినాడు. తెనుగుకవి అయిన ఈ మహారాష్ట్రరాజు, సంస్కృత నాటకాలవలె యక్షగానాలలో అంకవిభజన చేసినాడు.

### తెనుగు యక్షగానం ప్రాచీనమైనది

కన్నడంలో 17వ శతాబ్దంలోనే యక్షగానాలు ప్రారంభమైనవి. ఇంతకుముందే తెనుగులోను, రెండవదిగా తమిళంలోను రూపొందినవి; మూడవదే కన్నడం, అస్సాము అంకీయనాట్, బెంగాలు జాత్రా నాటకము, మహారాష్ట్రుల తమాషా ఇట్టివే. తమిళంలో దీనిని తెరుక్కూత్తు అన్నారు; ఇందు హాస్యగాడిని కోమలి అన్నారు. ఆంధ్ర దేశంలో వీధినాటకాలు ఆడేవారిని మేళము; స్త్రీవేషాన్ని భామ అంటారు. మలబారు కథకళి వీటి స్థానిక రూపాంతరమే.

కొయ్యబొమ్మల మన జంగాలు ఆడించేవారు; తోలుబొమ్మలు ఆడించేవారు; తోలుబొమ్మలు (ఆం) మహారాష్ట్రుల సొమ్ము. తోలుబొమ్మలు తెనుగు జానపదులకు ప్రధాన వినోదంగా ఉండినది ఇది ఇండోనేషియా, ఇండోచైనాకు గూడ ఎగబాకినది. ఇందలి హాస్యానికి, బంగారక్క జుట్టుపోలిగాడు కేతిగాడు పుట్టినారు.

యీ వీధినాటకాల తర్వాత హరికథ ప్రజలకు భక్త్యుపదేశమునకు మహాప్రక్రియ అయినది. ఈ భాగవతారులు దక్షిణ దేశాల అన్నిటిలోను గలరు. మహారాష్ట్రంలో అభంగాలు భక్తిగానగుళికలు.

### కర్ణాదేశ నిర్వచనం

"ఎవరేమన్న నాకేమి కొదువ? నిజము నాదు భాష కర్ణాట భాష" అని శ్రీనాథుడు గర్జించినది మొదలు, ఈ కర్ణాట శబ్దానికి అర్థాలు వేరువేరుగానే చెపుతూ వస్తున్నారు. పాతవాసనల పండితులు చరిత్ర పొందెరుగక, చెవికి ఇంపైనదని, నల్లరేగడదేశమని చెప్పసాగినారు. కర్ణ (శాతకర్ణ)నాడు కర్ణాటకమని చరిత్రవాదులు అన్నారు. ఈ ప్రదేశం కృష్ణకు దక్షిణ భాగంగానే వీరు నిర్ణయించినారు. ఈ గ్రంథం ఈ విషయంలో ఒక గట్టి సంగతిని బయట బెట్టుతున్నది : కన్నడ భూపతి నృపతుంగుడు (1814-1817) కవి రాజ మార్గమన్న తన గ్రంథంలో కావేరి గోదావరుల మధ్యమున్న దేశమే కర్ణాటము-అని బాగా నొక్కి చెపుతున్నాడు. కర్ణాట సంగీత మంటే సరిపొయ్యే అన్వయం ఇదేగదా!

ఈ వ్యాసమంతా, నాగయ్య వంటకంలో ఒక మెతుకు ఎత్తి చూపడమే, విందు విందుకు పుస్తకమంతా చదవండి

[- పుస్తక వివరం: డెమి.; పేజీలు 270; వెల 20 రు. ప్రతులకు జి. లక్ష్మమ్మ, 18 1 699, భవానీనగర్, తిరుపతి; బంగారే బుక్సు, వెల్లూరు 4]

# కందుకూరు తాలూకా కవిపండితులు

## శ్రీ విక్రాల శేషాచార్యులు

ఏ కార్యమునైనను తగురీతిగ విభాగించుకొని చేసినచో నది సుకరముగ కొనసాగఁగ దు. అట్లే కవిపండితులయొక్క విషయమును వ్రాయనెంచినచో నేదోయొకవిధముగ విభాగించుకొని వ్రాయుచో సులభముగను (కొంతవరకు) సాకల్యముగను నెఱవేరనవకాశముకలదు. అయితే ఆవిభాగము దేశమును బట్టియా, కాలమునుబట్టియా, కులమునుఁబట్టియా అని యోచన కలుగును. కులమునుఁబట్టి చేయు విభాగము కేవలము పక్షపాత బహుళముగ నుండును. ఆ దేశకాలములనుఁబట్టి చేయు విభాగముకూడా వివాదగ్రస్తమైయే యుండును. అయినను విమర్శక వతంసముల అభిప్రాయములే ఇట్టి కార్యముల యందు ఆశ్రయణీయములు.

మా మిత్రులైన శ్రీయుతులు అష్టావధాని శ్రీ రేపూరి అనంత పద్మనాభరావు యం. ఏ. గారు (పూర్వము కందుకూరు ప్రభుత్వ కళాశాలాంధ్ర శాఖాధ్యక్షులు నేడు కడప ఆకాశవాణీ నిలయం ప్రొడ్యూసర్) "కందుకూరు మండల సాహిత్య చైతన్యం"లో "ప్రకాశంజిల్లా కందుకూరు మండలం ప్రాచీన కాలంనుంచి సాహిత్య రంగంలో ప్రథమస్థానం పొందివుంది" అనినమాట ప్రత్యక్షర సత్యము. ఈ తాలూకాలో పుట్టి శాస్త్ర సాహిత్యరంగములలో వినలేని కృషిఁజేసి కీర్తిశేషులయిన కొందఱ ప్రముఖులను గ్రామముల వారిగా నీ వ్యాసమునందుఁ జేర్చొనుచున్నాను.

## 1. గుడూరు గ్రామములో

1. 14వ శతాబ్ది మధ్యభాగమునందు ఎఱ్ఱా ప్రగడ.

భారతములో నారణ్య పర్వశేషమును, భారతమునకు శేషమైన హరివంశమునుఁ దెనిగించి ఆంధ్రభాషలో మహాభారతమునకు సమగ్ర[illegible]ఁకిన ఘనుఁ డీతఁడు. మఱియు నృసింహ పురాణమును, రామా యణమును రచించిన కవిచంద్రుఁడు. ఈతని రామా[illegible]న్నది. ఈయన నన్నయ తిక్కన్న[illegible]కు దీటుగా వారి భారతశేషములను పూరించి వారికి మూడవవాఁడై ప్రపంచములో బ్రహ్మ విష్ణు రుద్రులు త్రిమూర్తులన్నట్లు ఆంధ్రభాషా ప్రపంచములో నీ మువ్వురు కవి త్రయము వారని ప్రఖ్యాతికిఁ గారణమైనాఁడు. ఈతఁడు నృసింహపురాణములోఁ జూపిన ప్రబంధోచిత వర్ణనల కౌశలముచేత ప్రబంధపరమేశ్వరుఁడని ఖ్యాతిగాంచెను. ఈ యెఱ్ఱనార్యుఁడు తన కవితా చతురిమముచేత ప్రోలయ వేమారెడ్డి ఆస్థానకవియై అర్ధాంకి చేరుకొనెను.

2. గుడ్లూరు గ్రామములోనే మఱియొక కవి 16వ శతాబ్ది పూర్వార్ధములో వెన్నెలకంటి సూరనార్యుఁడు—

చతుర్విధ కవితా చాతుర్యధుర్యుఁడైన ఈ కవికుంజరుఁడు మహాపురాణములలో మూడవదియైన విష్ణుపురాణము నాంధ్రీకరించెను. ఇందు అప్పుడు సంస్కృత భాషలో చెప్పఁబడిన వివిధ ద్వీపములు వాటిలోని వివిధ దేశములు నదీ పర్వత పట్టణాదులు మానవుల జాతిభేదములు మున్నుగాఁగల భూగోళ విషయములన్నియు నిందు బహుచక్కఁగ వివరింపఁబడి యున్నవి. ఈ సూరన ఆ ప్రాంతీయుఁడేయైన రాఘవరెడ్డి అను రెడ్డిప్రభువుయొక్క ఆస్థానకవి తన విష్ణుపురాణమును ఈ రాఘవరెడ్డికే అంకితముఁ గావించెను

ఈ సూరనార్యుఁడు చేసిన గుడ్లూరు వర్ణనము —

గౌరీ సమేతుఁడై గరిమతో నెవ్వీట
వేపారు నీలకంఠేశ్వరుండు
వారాశి కన్యతో వర్తించు నెవ్వీట
గిరిభేదినుతుఁడైన కేశవుండు
యోగినీ సహితుఁడై యొప్పారు నెవ్వీట
బసిడి పోలేరమ్మ భవుని కొమ్మ
పాపవినాశమై ప్రవహించు నెవ్వీట
మన్నేఱు మిన్నేటి మారటగుచు

కుంజరములు వేళ్లు కొలువంగ నెవ్వీట
గొడుగు చక్రవర్తి పుడమియేలె
నట్టి రాజధానియై యొప్పు గుడ్లూరి
నొనర నేలుచుండె యొక్కనాడు.

ఈ సూరనకు నాల్గవ తరము మనుమఁడు

3. వెన్నెలకంటి వేంకటాచలము.

ఈయన కృష్ణవిలాసమను కావ్యమును రచించెను.

ఈతని వంశస్థుఁడేయైన

4. జన్నమంత్రి.—

భక్తిరస భరితముగ మృదుమధురమైన దేవకీనందన శతకమును నిర్మించెను. ఇతఁడు సంస్కృత భాషలో కూడా కవి. ఆ భాషలో కవిరాక్షసుఁడని చెప్పబడువాఁ డితఁడు. ఈ పేరును దేవకీనందన శతకములో కూడా వాడుకొని యున్నాఁడు. "కవిరక్షశ్శిష్యుఁడుత్సాహియై" అని కొంచెము మార్పుతో, ఇతఁడు రచియించిన కవిరాక్షసీయమను సంస్కృత కావ్యము సవ్యాఖ్యానాంధ్ర టీకాతాత్పర్యముగ పలు పర్యాయములు ముద్రణముఁబొంది చాల ప్రసిద్ధి నొందినది.

ఈ యూరివాఁడో కాడో కాని ఈ వంశమువాఁడే అయిన

6. జక్కన మంత్రి - స్వవంశీయుఁడైన సిద్దమంత్రి కంకిత ముగ విక్రమార్క చరిత్రము రచించినాఁడు.

## 2. తెట్టుగ్రామములో

1. పొదర్ల వెంకన్న: - } అను సోదరులు సుప్రసిద్ధులు. వీరు వెం... సంస్థానాధిపతు లైన వేంకటేశ్వర ప్రభువుల
2. ఉత్తన్న: - } యాశ్రితులు. వీరు విరచించిన గ్రంథము లెవ్వియు గానరావు.

కాని వెంకన్న వెంకటగిరి సంస్థానాధిపతి యిచ్చిన దుర్ఘటము లైన సమస్యలను పూరించిన పద్యములు జగద్విదితములు. ఈ వెంకన్న అభినవాంధ్ర కవితాపితామహ బిరుదశాలి. ఈతఁడు వెంకట గిరి ప్రభువుల సమక్షములో నాశువుగఁ జెప్పిన తెట్టు గ్రామ వర్ణనము—

తెట్టు కుమార కృష్ణ జగతీవరనందన రాజ్యలక్ష్మికిం
బట్టు, ధరాంగనామణికి బాపట బొట్టు, రిపూరగాళి వా
కట్టు, సముజ్జ్వలద్ద్యుతికిగట్టు, బుధాళికి వేల్పుబెట్టు, నా
గ్పట్టుల కున్కిపట్టు సు మదీయ నివాసము యాదవభూపతీ॥

## 3. బిట్రగుంట గ్రామములో

1480 ప్రాంతమున

1. పిల్లలమఱ్ఱి పినవీర భద్రుఁడు :—

ఈయనది బిట్రగుంటగ్రామ మనుటకు

పృథివి కవతంస మణియైన బిట్రగుంట
దానకందుగ నవతారమైనవాఁడు
భైరవస్వామి సకల సంపదల నొసఁగి
మనుచు చిల్లర వెన్నయామాత్యవరుని॥

అని బిట్రగుంటలోనుండు భైరవస్వామి తన కృతిపతిని యేలుఁగాత్రయని చెప్పుటయే చాలును. ఈయన నివాసమైన బిట్ర గుంట కందుకూరు తాలూకాలో కలికివాయ దాపుననున్న బిట్రగుంట కాని వెంకటేశ్వరపాలెమువద్ద నుండు కొండబిట్రగుంటకాదు. భైరవుని గుడి కలికివాయ బిట్రగుంటలోనే యున్నది కనుక.

ఈ పినవీరన బహు ప్రబంధ నిర్మాత. వాటిలో శృంగార శాకుంతలము, జైమిని భారతము, [2]మనువంశ పురాణములు ముద్రితములు. నవరస దర్పణము, నారదీయము, మాఘమాహా త్మ్యము, మానసోల్లాససారము, అను గ్రంథములనుసు రచించినట్లు శాకుంతల గ్రంథావతారికవలనబట్టి తెలియుచున్నది. వీటిలో శృంగార శాకుంతలము తన నివాసమైన బిట్రగుంట కనతిదూరముననున్న సోమరాజుపల్లి వాస్తవ్యుఁడైన చిల్లర వెన్నమంత్రి కంకితముగఁ జేసెను. ఆ కారణమున సోమరాజుపల్లెను సుదీర్ఘముగ వర్ణించినాఁడు. ఆ పద్యము —

లవణాబ్ధివేల హేలాకాంచియగు నాంధ్ర
ధరణీమండలికి ముత్యాలజల్లి,
సంగ్రామపార్థ రాజన్య రాజశ్రీకిఁ
బెంపు మీఱిన జగజంపువెల్లి,
దాతలు సముదంచిత ప్రసూనములుగా
కామితార్థము లిచ్చు కల్పవల్లి
అణువదివాల్గు విద్యలకు నపూర్వ ఘం
టా పథంబైన పట్టణముతల్లి;

ఘంటన్నప కౌస్తుభములకుఁ బాలవెల్లి,
కదన జయలక్ష్మి తొలుచూలుఁగన్నతల్లి,
విపుల భుజగర్వ దర్శిత విమతరాజ
రాజి హృద్భల్లి ధరసోమరాజు పల్లి॥

ఈతని జైమిని భారతము సంస్కృత జైమిని భారతమునకు సంపూర్ణానువాదముకాదు; సంస్కృత జైమినిభారతములోని అశ్వమేధ పర్వమునకు మాత్రమే ఆంధ్రీకరణము.[1] సంస్కృత జైమిని భారత ములోఁగూడా అశ్వమేధ పర్వ మొక్కటియే కాలకాలమునాడు బొంబా యిలో ముద్రితమైనది. ఈతఁడు రచించిన మనువంశపురాణము మ దా సులో 1898వ సంవత్సరములో అనగా నిప్పటికి 77(డెబ్బదియేడు) యేండ్ల నాడు అచ్చు బనను అప్పటి యా గ్రంథములు ఐపోయినప్పుడు ఎవ్వరివద్దను లేక భాషాసేవక లోకములో నిస్మృతి పథము నొందినవి.

ఈ బిట్రగుంట గ్రామమునందే మఱి ముగ్గురు కవులు. ఈ పినవీరభద్రుని

2. తాత— } ఈ ముప్పురుకూడా భువన భాసుర కృతి నిర్మాతలని
3. తండ్రి గాదయామాత్యుఁడు - } జైమిని భారతము వలనఁ
4. అన్న పెదవీరనయు— } దెలియుచున్నది. కాని యిప్పుడు వారి గ్రంథము లలభ్యములు.

## 4. కందుకూరు గ్రామములో

1. కందుకూరు రుద్రకవి —

ఈయన కృష్ణదేవరాయల ఆస్థానమందలి యష్ట దిగ్గజ ములలో నొకఁడని కొన్ని చాటుపద్యముల ఆధారముతో చారిత్రకులు చెప్పెదరు. ఇబ్రహీంకుతుబుషా గోలుకొండనవాబు 1558 లో రుద్రకవికి చింతలపాలెము అను గ్రామమును అగ్రహారముగ దానముఁ జేసెనట. అందుకు కీ. శే. శ్రీ వేటూరు ప్రభాకర శాస్త్రులవారు ప్రకటించిన ఒక తామ్రశాసనమునందలి యీ క్రిందిశ్లోకమును మా మిత్రులు పూర్వోక్తులైన శ్రీ అనంతపద్మనాభరావుగారు "కందు కూరు మండల సాహిత్య చైతన్యము" అను వ్యాసములో నుదహరించి నారు. ఆ శ్లోకము—

శ్లో॥ అద్యాశీతి చతుశ్శతాధిక సహస్రం (1480) శైకశాబ్దాగతాః

అస్మిన్ శ్రీ యువత్సరే జయతిదొ మాసేచ మాసే తథా।
పంచమ్యాం ³ద్యుమతిం త్రిణీ జనపదం రు దస్య విద్యత్కవేః।
ప్రీత్యా శ్రీ ఖరామ భూపతి రదాత్ క్షోణీధరాఖండలః

ఈకవి నిరంకుశోపాఖ్యానము అను పద్యకావ్యమును, సుగ్రీవ విజయము అను యక్షగానమును, జనార్దనాష్టకము, జనార్దన పంచరత్నములు అను గ్రంథములను రచించెను. "బలవదరీ దరీ కుహర భాస్వదరీయ దరీదరీ హరీ!" అను సుదీర్ఘ మకుటముతో నొక శతకమునున్ను రచించెనని చెప్పెదరు

కందుకూరులోనే మఱియొక పండితుఁడు

2. కవివాదిభేరుండ నృసింహ యజ్వ కుమారుఁడు ఈశ్వర భట్టు.

స్మృతి సూక్తమాల అను గ్రంథమునకు "తత్త్వ ప్రకాశిక" అను వ్యాఖ్యానమును రచించెనని ఒక చరిత్రలో కానవచ్చుచున్నది.

## 5. పైడిపాడు గ్రామములో

1. పైడిపాటి నృసింహకవి.

ఈయన వెంచులక్ష్మి కథతో లక్ష్మీనృసింహ విలాసమనెడు మూడు ఆశ్వాసములుగల శృంగార కావ్యమును, రామచంద్రశతకము, మన్నారు కృష్ణశతకము అను గ్రంథములను రచించెను.

ఈ నృసింహకవి భద్రాచల రామాలయమును రామదాసుగా రుద్ధరించినట్లు పోలూరు గ్రామములోని మన్నారు కృష్ణాలయము నుద్ధరించిన భక్తవర్యుఁడు. మన్నారు కృష్ణశతకమును ఈ స్వామికే యంకిత మొనర్చెను,

2. ఆంధ్రనామ సంగ్రహమనెడు పద్యరూప నిఘంటువు రచించిన మఱియొక నృసింహకవియు నీతని వంశస్థుఁడే.

## 6. చిత్రకవారి పాలెములో

1. చిత్రకవి సింగరాచార్యుడు:-

19వ శతాబ్ది ప్రథమ పాదమునకుఁ జెందిన యీయనయే బిల్హణీయ రచయితలలో నగ్రేసరుఁడు. సంస్కృత భాషలో ౧౫౦ శ్లోకములుగల బిల్హణీయమును ఈయన మనోహరముగ వర్ణనములు సంభాషణలు పెంచి ఆంధ్రములో సుమారు ౪౦౦ (నాలుగు వందల) పద్యములతో నీ కథను నిర్మించినాఁడు. రెండవది చిత్రరత్నాకరము. ఈ రెండు గ్రంథములు ముద్రితములు. మూడవది రాఘవ వాసుదేవీయము అను ద్వ్యర్థిశ్లేష ప్రబంధము. పింగళ సూరనార్యుని రాఘవ పాండవీయమునకు దీటైన ఈ ద్వ్యర్థికావ్య వతంసము ముద్రితమై ప్రాచ్యలిఖిత గ్రంథాలయములో రాణివాసము నుండి వెలికివచ్చి ఎప్పుడు సూర్యాలోకభాగ్యము నొందఁగలదో?

వీటిలో బిల్హణీయము పండిపెద్ది కృష్ణస్వామి రచితముగా ముద్రితమైనది. అది విమర్శకుల విమర్శఫలముగా చిత్రకవి సింగరాచార్య విరచితము అని సత్య విషయము బయలుపడినది. ఆశ్వాసాది యందలి పీఠికా పద్యములలో పండిపెద్ది కృష్ణస్వామి- సింగరాచార్యుని పుత్రుఁడు నరసింహాచార్యుని సహాయముపొంది అది తాను రచించినట్లు చెప్పియున్నను ప్రథమాశ్వాసాంతమునందలి చక్రబంధము విష్ణుచక్రము మాదిరి అన్యాయమును ఖండించి సత్యమును నిలిపినది. కాగా పండిపెద్ది కృష్ణస్వామి నరసింహాచార్యుల సాహాయ్యముతో బిల్హణీయమునందు తాను రచించినది సింగరాచార్యుని పీఠికాపద్యము లను తొలిగించి వాటిచోట పదిపద్యములు మాత్రమే.

³ చిత్రరత్నాకరము చాలా కాలమునాడు ముద్రితమైనను ఇప్పుడది యెచ్చటను కానవచ్చుటలేదు.

చిత్రకవివారి పాలెము గ్రామమునందే మఱియొక కవి.

2. చిత్రకవి నరసింహాచార్యులు-

ఈతఁడు పై సింగరాచార్యుల కుమారుఁడు. బిల్హణీయము నందలి పీఠికా పద్యములలో-

చిత్రకవి వంశదుగ్ధాబ్ధి శీతభాను
డనుపమానోక్తి శ్రీ సింగరార్య సూను
డమిత కవితా విశేషజ్ఞుఁ డనగ వెలయు
నారసింహార్యకవి వచ్చి నన్ను మెచ్చి.

అను పద్యమువలన నీయనయు కవియని తెలియుచున్నది. బిల్హణీయము మొదటనుండు తండ్రిపద్యములఁ దొలగించి ఈయన వ్రాసిన పద్యముల సరళినిఁబట్టి ఈ నరసింహాచార్యుఁడు చక్కని కవిగా నున్నాఁడు. నరసింహాచార్యుఁడు అమిత కవితా విశేషజ్ఞుఁడు.కను కనే కొంతకాలమునకైనను సత్యము బయలువడవలెనను సదుద్దేశముతోఁ గావలయును? చక్రబంధ పద్యమును తీసివేయకనే గ్రంథమును పండిపెద్ది కృష్ణస్వామికి ఇచ్చివేసినాఁడు. చక్రబంధ రహస్యము తెలిసినంతటఁ కవిగాని పండిపెద్ది కృష్ణస్వామి కీర్తిప్రతిష్ఠల నాశించి శాశ్వతమైన అపకీర్తికిఁ బాత్రుమైపోయినాడు.

## 7. కలికివాయి గ్రామములో

1. కళత్తూరు వికాల రాఘవాచార్యులవారు-

జన్మస్థలమునుఁబట్టి వీరిని కళత్తూరు రాఘవాచార్యులవా రనెదరు. వీరి జననము 1844. పరమ పదము 1893 సం॥రము. వీరు చతుర్వేద షడంగవేత్తలు, కనుక షడంగ వేదవిదః అని కాశీ పండితులనుండి బిరుదమును పొందినారు. కాళహస్తి సంస్థాన పండితులు. పంచాంగ రచనకు పూర్వగణితములకంటెను సులభమైన గణితమును కనిపెట్టిన ప్రతిభాశాలులు వీరు. రైళ్లు రోడ్లు రూపాయలు మున్నగు నవీన యంత్రవస్తువుల వర్ణనలకు వీరే ఆదికవులు. వివిధ శాస్త్రములయందు 49 గ్రంథముల రచించినవారు వీరు. అవి- వేదప్రామాణ్యం, శిక్షాభాష్యం, గ్రహాదర్శః, ధర్మనిర్ణయః, ఆంధ్రదేశ భాషామహిమానువర్ణనం మొదలైనవి సంస్కృత రచనలు. కళావతీపుర శతకము. ప్రసన్న వేంకటేశ్వరశతకము, వేమాలమ్మ శత

కము, కృష్ణలీలా తరంగాం(ధటీక. లీలావత్యాం(ధటీక మొదలైనవి ఆం(ధ(గంథములు. శ్రీ వేంకటగిరి రాజాస్థానమునందు వేద(ప్రామాణ్యమును నిలబెట్టిన మహావిద్వాంసులు వీరు. పలు యజ్ఞములలో పండిన్యులై య(గపూజల నొందిన ఆచార్యులు వీరు.

వీరు వి(కాల వంశములోఁ బుట్టిన పండిత పరంపరలో ౧౧వ వారు.

2. వి(కాల రామచం(దాచార్యులవారు[1] –

వీరు పై రాఘవాచార్యులవారి కుమారులు. వీరి జననము 1909. పరమపదము 1932 సం॥రము. వీరు అష్టాదశ విద్యల లోను అపారమైన పాండిత్య (పతిభలు గలవారు. విద్యారణ్య పంచానన విద్యావాచస్పతి కళానిధి బిరుదాంచితులు. కావలి తాలూకాలోని ముత్యాలపాటి సంస్థానమువందు ఆస్థాన పండితులు. పలు రాజసంస్థానములలో పూర్ణసంభావనలతో సమ్మానితులైనవారు. యాగశాలల యందు, న్యాయస్థానములయందును వైదికులలోను, లౌకికులలోను గొప్ప పేరుపొందిన సర్వతోముఖ (పతిభావంతులు. సమస్త భారత దేశమును పలుమరు పర్యటించి పండితులలోను, అధికారులలోను, దేశోద్ధారకులలోను గొప్ప కీర్తి గౌరవముల నార్జించినవారు. అప్పటి (బిటిష్ (పభుత్వమువందు అనేకములైన గౌరవ పదవుల నిర్వహించిన వారు. అనేక శా(స్త్రములలో విద్వాంసులకు సైతముకలిగియుండు (భమలను తొలగించి స(పమాణముగ సిద్ధాంతముల నుపన్యసించి (గంథముల రచించినవారు. శా(సమును బోధించుటలోను, రచించుట లోను (కొత్త పద్ధతిని కనుగొని నూతన విధమయినరచన (పారంభించినవారు. 1300 (పదమూడు) వందల యేండ్లకు నింగ్లీషులో పంచాంగములను (ఇండియన్ ఎఫిమెరిస్‌ను) విరచించినవారు. వైదికము, జ్యోతిషము, గణితము, వేదాంతము, ధర్మశా(సము మున్నగుశా(స్త్రములలో 89 (గంథములను విరచించి సంస్కృతాం(ధ భాషా భారతికి అపార సేవఁ గావించినవారు. అవి–వేదాధ్యయన సం(పదాయః, మానాంతర బోధః, సంఖ్యాను శాసనం, జ్యోతిర్వశా నిర్ణయః, ధర్మనిర్ణయ టిప్పణీ మొదలైనవి సంస్కృత రచనలు.[4] భీష్మవివాహ నిరూపణము, మానవిర్ణయము, వేదాంతము జడ్జిమెంట్, వాలివధ విచారము, నావరజాతి నిరూపణము, మాహాత్మ్య సం(గహము, వివాహ విధి, స్నానవిధి మున్నగునవి ఆం(ధ(గంథములు.

వీరు వి(కాల వంశములోఁ బుట్టిన పండిత పరంపరలో ౧౨వ వారు.

3. వి(కాల రాఘవాచార్యులవారు.

వీరి జననము 1909 సం॥రము. పరమ పదము 1969 సం॥. వీరు పై రామచం(దాచార్యులవారి సీమంత (పథమ) పు(తులు. వేదము వ్యాకరణము గణితము, జ్యోతిషము, సాహిత్యముల యందు తం(డిగారికి దీటైన పండితులు[5] బొంబాయి రాష్ట్రములో ధార్వాడా మున్నగు పట్టణములలో జరుగుచుండిన గొప్ప జ్యోతిశ్శా(స్త్ర పరిషత్తులలో భూ(భమణవాదము, భూ-గోళత్వము మున్నగునవి (ప్రాచీనార్యులే బోధించినవి అని అ(పతిహతముగ రుజువు జేసి (పశంసలనొందిన మహోపన్యాసకులు వీరు. మఱియు వృక్షసంయోగాదులయందు నవీనులదుర్బోధలను ఖండించి వాటియాథాత్మ్యమును నిరూపించినవారు. వీరి రచనలు–సృష్టితత్త్వ(పకాశికా. (ఇదిసంస్కృతము). ఆం(ధ (గంథములు – సృష్టితత్త్వ (పకాశికా వివరణము, సిద్ధాంతభాస్కరము, శ్రీపతి జాతకాలంకార వ్యాఖ్యానోదాహరణము, సిద్ధాంత సందేహ సందోహ పరిహారము.

వీరు వి(కాల వంశములోఁ బుట్టిన పండిత పరంపరలో ౧౩వ వారు.

4. పర్ణశాల వేంకటనరసింహాచార్యుల వారు –

వీరు సంస్కృత సాహిత్య – గణితశా(స్త్రములలో నుద్దండ పండితులు. అప్పటి (పభుత్వోద్యోగులయందు చాల మన్ననల పొందిన వారు. సంస్కృతములో శ్రీధరాచార్య విరచిత బీజగణితమును విస్తృతముగ సోదాహరణముగ వ్యాఖ్యానించిన ధీమంతులు.

5. పర్ణశాల రాఘవాచార్యులవారు –

వీరు పైవారి కుమారులు. వీరి జననము 1866 పరమ పదము సం॥రము. వేదము, వ్యాకరణము, సాహిత్యము, జ్యోతిషము, ధర్మశా(స్త్రముయందు గొప్ప విద్వాంసులు. శతాధిక విద్యార్థి జన విద్యాప్రదాతలయిన ఆచార్యులు. వ్యాకరణ పరిభాషా

పదములలో విద్వన్మనోరంజకములైన అనేక చాటు శ్లోకములను, భగవత్ స్తోత్రములను చెప్పిన రచయితలు వీరు.

(కలికివాయలో 1-2-3 అంకెలుగలవారు ఈ వ్యాసకర్త్తకు వరుసగా తాతగారు, తండ్రిగారు, అన్నగారు. 4-5 అంకెలుగలవారు వరుసగ తండ్రిగారియొక్క మాతామహులు, వ్యాసకర్తయొక్క మాతామహులు.)

ఈ వ్యాస రచయితయైన మహాకవి కవితాచతురానన విక్రాల శేషాచార్యులు రచించిన కలికివాయ వర్ణనము. స్వీయ కావ్యకలాపము నందు -

లక్ష్మీధరాంగనారత్న భూషిత పార్శ్వ
 కేశవస్వామి ప్రకాశ చణము.
భ్రమరాంబికాయోగభాసి మల్లేశ్వరా
 హ్వాయ మహేశ నివేశ భాసురంబు,
విద్యాగురు ఖ్యాత విక్రాల రామచం
 ద్రాచార్య ముఖ విద్వదాశ్రయంబు,
ప్రథిత పూర్వానేక పండిత కవిరాజ
 విద్యా ప్రదాచార్య విలసితంబు,

 నైక కవిరత్న సంజననాకరంబు,
 జ్ఞాన లిప్సాన్నతోద్యోగి జనగతంబు,
 ప్రాప్త "కవిపండితారామ" రమ్యయశము
 ప్రాలు ధర విద్వదనపాయ కలికివాయ॥

# 8. సోమరాజుపల్లి గ్రామములో

1. పర్ణశాల నరసింహాచార్యులుగారు—వీరు వ్యాకరణ సాహిత్య సంప్రదాయములందు గొప్ప విద్వాంసులు. చెన్నపట్టణము (మద్రాస్)లో పచ్చయప్ప కళాశాలలో నుపాధ్యాయులు. వీరి రచనలు—ఆంధ్రదేశ భాషా మహిమానువర్ణన వ్యాఖ్యానం, కమలేక్షణాష్టకం (ఇవి సంస్కృతము) ఆంధ్రగ్రంథములు – బాలరామాయణము, శ్రీ వేంకటేశ చతుర్దశ మంజరికా స్తోత్రము, శ్రీ వేంకటేశ్వర శరణాగతి, శ్రీ వేంకటేశ్వర వజ్రకవచము, శ్రీ వేంకటేశ్వర ధ్యానము, నారాయణ ధ్యానము, శ్రీ గుణరత్నకోశమునకు ప్రతిపదటీకా తాత్పర్య విశేషార్థరూప వ్యాఖ్యానములు. రఘువంశకథ, పర్ణశాల అనుపేరుగల సింగరాయకొండ క్షేత్ర మాహాత్మ్యము అను ఈ రెండు వచన కావ్యములు.

# 9. సింగరాయకొండ గ్రామములో

1. శేషభట్టరు వీరరాఘవాచార్యులుగారు – వీరు సాహిత్య సంప్రదాయములలో మంచి విద్వాంసులు. సింగరాయకొండలో శ్రీ నృసింహస్వామివారికి సువర్ణ కవచము రథమువంటి గొప్ప ఆర్థిక కైంకర్యముల నొనర్చి ఆ స్వామిమీద అపూర్వమైన వాచిక కైంకర్య మున్ను సలిపిన భక్తులు. వాచిక కైంకర్యమనఁగా స్తోత్రరచన. వీరు రచించిన అవి— లక్ష్మీమాహాత్మ్య శతకం. నృసింహమాహాత్మ్య శతకం, నృసింహ పాదుకాశతకం, నృసింహపాదారవింద శతకం, భగవద్గుణ భవః. (౫౦౦ స్రగ్ధరావృత్తాని). కళత్తూరు రాఘవాచార్యావతారస్తవః. ఇవి యన్నియు సంస్కృత గ్రంథములు. వీటికి తెలుగు తాత్పర్యములు (తెలుగు గ్రంథములు).

# 10. కరేడు గ్రామములో

1. ఇంగువ వీరరాఘవ యజ్వగారు — వీరు సంస్కృతములో "తత్త్వ ప్రకాశికా" అను పేర బ్రహ్మసూత్రములకు సంగ్రహముగ వ్యాఖ్యాన గ్రంథము రచించినవారు.

2. విరగుడిపాటి వేంకటాచలం పంతులుగారు. వీరు సంస్కృతములో సీతారామచంద్రధ్యాన పూజావిధానము, ఆంధ్రములో "రాసతల" అను యక్షగానము, కంధపద్యములతో "ముకుంద శతకము" అను గ్రంథముల రచించినవారు.[1]

# 11. ఊలవపాడు గ్రామములో

1. దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు— వీరు అయూరిలోని శ్రీ వేణుగోపాలస్వామి దేవాలయము శివాలయములయొక్క ధర్మకర్తలు. ఆంధ్రవాఙ్మయ ప్రపంచములో అపూర్వముగ ప్రశంసనీయములయిన విమర్శలఁ గావించినవారు, నన్నెచోడుని కుమార సంభవము మీఁద చాల విమర్శఁజేసి గ్రంథము రచియించినవారు. వీరి రచనలు— నన్నెచోడకవి చరిత్ర, టెంకణాదిత్యకవి, ఆంధ్ర సాహితీ సార్వభౌముఁడు.

# 12. పెదపవని గ్రామములో

1. పెదపవని దొరవారు—శ్రీ రాజా శ్రీరంగభూపాల భాలేరావుగారు —

వీరు రాజ్యపాలనములోఁగూడా భాషాపోషణమున్ను గావించిన ఉదారులు. ఈ వ్యాస రచయితయొక్క తండ్రిగారు పూర్వోక్తులైన విద్యారణ్య పంచానన విద్యావాచస్పతి శ్రీమాన్ విక్రాల రామచంద్రాచార్యులవారు వీరి యాస్థాన పండితులే. ఈ దొరవారి రచనలు. కుసుమ కోమలీ పరిణయాదులు.

ఇప్పుట నొకరిద్దరి కవుల నివాస నిర్ణయములో కొలది అభిప్రాయభేదములున్నను ఆ నివాసస్థలములు కందుకూరు తాలూకాలో నని అందఱి యభిప్రాయము లొక్కటిగనేయున్నవి. ఉదాహరణము— విష్ణుపురాణము నాంధ్రీకరించిన వెన్నెలకంటి సూర్యనార్యుని నివాసము గుడ్లూరని యొకరు, చెరుకూరని మఱియొకరు. ఈ రెండును కందుకూరు తాలూకాలోనివే – యని యొక పక్షము నాశ్రయించి

గుడ్డూరని నిర్ణయించి వ్రాసితిని.

వ్యాసకర్త వి. శే.

## అనుబంధము

వ్యాసములో వదలిన ముఖ్యులను ఈ యనుబంధములోఁ దెలిపెదను.

కలికివాయ గ్రామములో –

## 6. విక్రాల శేషాచార్యులవారు

వీరు పూర్వోక్తులైన షడంగవేదజ్ఞ శ్రీమాన్ కళత్తూరు విక్రాల రాఘవాచార్యులవారి యనుజులు. సాహిత్య – సంప్రదాయము లెఱిఁగిన మహా విద్వాంసులు. తమ అన్నగారైన శ్రీ రాఘవాచార్యుల వారు సంస్థాన పండితులై కాళహస్తి వాస్తవ్యులుకాఁగా ఈ శేషాచార్యులవారు, అన్నగారికి ప్రతినిధిగ కలికివాయలోనుండి – ఆ చుట్టు ప్రక్కలనుండు పాకల, కందు, ఒంగోలు తాలూకాలో కొత్తపట్టణము, బ్రాహ్మణ నిడమానూరు మున్నగు గ్రామములనుండి వచ్చిన విద్యార్థులకు అన్నదానముతోటి విద్యాదానము చేసి యభివృద్ధికిఁ దెచ్చిన యాచార్యులు వీరు. ఇట్లు వీరివద్ద విద్యనభ్యసించి విద్వచ్ఛిఖరులయి వెలసినవారు. బ్రాహ్మణ నిడమానూరు వాస్తవ్యులు రంగనాయక శతక ఆంధ్రజితంతెస్తోత్రాది గ్రంథరచయితలునైన శ్రీ బొమ్మరాజు నరసింహదాసుగారు మున్నగువారు ముఖ్యులు. ఇట్లు అనేక విద్యార్థులను సుప్రసిద్ధ పండితులఁ గానించిన ఈ శేషాచార్యుల వారు ముందు వ్యాఖ్యానములులేని రాఘవ యాదవపాండవీయమువంటి త్ర్యర్థి కావ్యములకును అలవోకగ నర్థము చెప్పఁగల సాహితీపాటవముతో నొప్పినవారు. వీరు చెప్పచుండఁగా వీరి శిష్యులు వ్రాసికొని యుంచుకొనిన రాఘవ యాదవ పాండవీయముయొక్క ప్రతిపదటీకా తాత్పర్యరూప వ్యాఖ్యానము (అవసరమయిన తావుల నిఘంటు – వ్యాకరణ సూత్ర – అలంకార లక్షణ – స్మృతి-జ్యోతిషాది శాస్త్రములనుండి ప్రమాణ శ్లోకముల నుట్టంకించుచు వ్రాసినవి), సంస్కృతములో శ్రీ భాష్యోక్త విషయ సంక్షేపరూపమైన వేదాంత సద్గ్రహ గ్రంథము మున్నగునవి వీరి వైదుషీ సామ్రాజ్యమునకు వైజయంతులని వీరి శిష్యులు ప్రసంగము వచ్చినప్పుడు ఆ గ్రంథములనుఁ జూపి చెప్పచుందురు.

(కలికివాయ అగ్రహారము నడివీధిలోని బావి వీరు త్రవ్వించినదే. దీనినే వీధి బావి యనెదరు. ఇది వీరి యన్నగారి కుమారులైన విద్యారణ్య పంచాననేత్యాది శ్రీమాన్ విక్రాల రామచంద్రాచార్యులవారి తరములో ప్రభుత్వమువారి పరముచేయఁబడి మరమ్మత్తు చేయఁబడి వేసవికాలములో అగ్రహారస్థులతోఁబాటు ఇతరులకును జలమునిచ్చుచుండును.)

వీరు విక్రాల వంశములో నుదయించిన పండితవంశ్యులో పదిరెండవ వారు. ఈవ్యాసకర్త మహాకవి కవితాచతురానన విక్రాల శేషాచార్యులు స్వీయ "కావ్యకలాపము"లో రచించిన కలికివాయ వర్ణన పద్యముయొక్క పాఠాంతరము –

సీ॥ మున్నేరు పాలేరు మధ్యభూతలి భూప, కేశవస్వామి మత్స్యేశ శాలి;
ఘన [1] సింగరయకొండ కనుమళ్ల నందనవన బిట్రగుంటల స్వారిధినాభి,
మధురోద కూపసంపన్న భూసుర రెడ్డి కిణ్వాయకాది కులాల యాయుతంబు,
శాలి ముద్గాదిక సస్య భూల్లసితంబు, బహుతటాకస్ఫుటా పరివృతంబు,

గీ॥ నైక కవిరత్న సంజననాకరంబు జ్ఞాన లిప్సాన్వితోద్యోగి జనగతంబు
ప్రాప్త కవి పండితారామ రమ్యయశము గ్రాలు ధరపద్య దన పాయు కలికివాయు॥

### అధోజ్ఞాపికలు

2. దీనిని గురించిన నా వ్యాసము భారతి 1976 ఫిబ్రవరి సంచికలో కలగూరగంపలో "పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని మనువంశ పురాణము"లో దెలిపియున్నాను.
3. ఇచ్చట "ద్వయ" శబ్దము ఆలోచనీయము.
1. ఈ యొక్కపద్యపు అనువాదమైనను సంస్కృత మూలములోని అన్ని విషయములను తెలుపునదికాదు. సం॥ మూలములోని కాలనేమ్యుపాఖ్యానము మున్నగు కొన్ని కథలు నీతులు ధర్మములు ఈ యనువాదమందులేవు. వ్యాసకర్త వి. శే.
3. ఈ గ్రంథమును గురించిన నా వ్యాసము 1964 ఏప్రిల్ భారతిలో తేనెలసోనలు శీర్షికయందు "చిత్రకవి సింగరాచార్యుఁడు"లోఁ దెలిపియున్నాను.
1. వీరి చరిత్రము నా రచించినది 1961 మే నెల భారతిలో "శ్రీ విక్రాల రామచంద్రాచార్యుల వారి ప్రతిభ"లో దెలిపియున్నాను.
4. దీనిని గురించిన నా వ్యాసము 1974 ఏప్రిల్ నెల భారతిలో కలగూరగంపలో "కి. శే. శ్రీమాన్ రామచంద్రాచార్య రామదాసయ్యంగార్ల ప్రసంగ స్వరూపము" చూడఁదగును.
5. ఈ సభా విషయములు 7–2-1971 దిగల ఆంధ్రప్రభ (దినపత్రిక)లో "విద్వద్వర్యులు శ్రీ విక్రాల రాఘవాచార్యులు" అను వ్యాసమునందుఁ దెలిపియున్నాను.
1. ముద్రణమునకు నోచుకొనక లిఖిత గ్రంథశాలలలో రాణివాసము చేయుచున్న "విష్ణుమాయావిలాస" పద్యకావ్యముయొక్క ప్రణేత ఎఱుగుదిపాటి వేంకటకవి ఈ యూరివాఁడేమో యోచింపఁదగును.
1. సింగరాయకొండ, 3. నాయక-నాయుడులు.

# రుద్రమదేవి విస్నూరి శాసనము

శ్రీ ఎమ్. కొమరయ్య

వరంగల్లు జిల్లాలోని జనగాము తాలూకా దేవరుప్పుల గ్రామమునకు 16 కిలోమీటర్ల దూరములో విస్నూరి గ్రామము కలదు. గ్రామమునకు వెలపల నిటీవల సత్యనారాయణస్వామి ఆలయమొకటి నిర్మింపబడినది. ఇంతకు పూర్వమిచ్చట ఒక ప్రాచీన శివాలయ ముండెడిదనియు తదుపరి కొందరు విష్ణుభక్తులు దీని నిటీవలనే సత్యనారాయణస్వామి ఆలయముగా మార్చిరనియూ గ్రామస్థులు చెప్పుకొందురు. ఈ ఆలయమువద్ద శివాలయమునకు సంబంధించిన చిహ్నము లేవియు లేకుండెను. ఈ శాసనము మటుకు వెనుకటి శివాలయమునకు చేయబడిన దానములను తెలుపు అవశేషము. ఈ శాసనము డా॥ వేలటూరి వేంకట రమణయ్యగారు వరంగల్లుజిల్లా శాసన సంపుటి ప్రకటించునాటికి లభ్యము కానందున దీనిని క్రొత్త శాసనము అనవలసియున్నది. ఈ శాసనము సుమారు 5 అడుగుల నిత్తు, 1½ అడుగుల వెడల్పుగల శిలాస్తంభముపై నలువైపుల తొలచబడి యున్నది. ఈ శాసనము మొత్తము 78 పంక్తులలో కలదు. మొదటి "అవిఘ్నమస్తు స్వస్తి శ్రీ జయాభ్యుదయశ్చ" అను మంగళ వాక్యము చివరి భాగమునందుండు వ్యాస గీత శ్లోకమొకటి తక్క మిగిలిన దంతయు తెలుగు వచనములో రచింపబడెను. అక్షరములు 13వ శతాబ్దమునాటి తెలుగు అక్షరములను అన్నివిధముల పోలియుండును.

## అక్షర విశేషములు :

రేఫమునకు పరమందుండు హల్లులకు తరచు ద్విత్వము కానబడును. 'శ్రీజ్జయాభ్యుదయశ్చ' [2వపంక్తి]; 'ధర్మ్మేశ్వరదేవరకు' [పం.19]; 'ఆచంద్రార్క్క' [పం.23]; 'పూర్వ్వక' [పం. 24) 'షష్ఠ్యర్వ్షా' [పం. 66]. 'వ' వర్ణమునకు కొమ్ము కొన్నిచోట్ల వెనుకటివిధముగా 'ృ' [పం.52]గాను మరోచోట అదేమాటలో 'కొమ్ము' ఇప్పటివలె నున్న ప్రక్కనుండి యివ్వబడుట కాననగును. "పు" [పం. 17]. 'భ' అను వర్ణము రెండు భాగములుగా మధ్య కలియకుండా యిప్పటి ఒత్తు లేకుండగా వ్రాయబడుచుండెను. శకట రేఫము ఇప్పటి మామూలు ఱకారములోనూ, పది, పదకొండుశతాబ్దము లందున్న 'ది' ఆకారములోనూ వ్రాయబడెను. 'ధ్ని' [పం.22] 'చత్త్రాతిపేను' అను మాటలో దీర్ఘటకారము క్రింద శకటరేఫము ఒత్తుగా వేయబడెను. 'శిలయను అర్థమునిచ్చు పదము 'ఱా'తో కూడినదని తెలుపబడెను.

## శాసనములోని తేది :

శక వర్షము 1202కు సరియగు విక్రమ వర్షము ఆశ్వయుజ బహుళ 2 గురువారమునాడు ఈ శాసనము వేయబడెను. ఈ తేది సరిగా క్రీ॥ శ॥ 1280 అక్టోబరు 11వ తేదీతో సరియగుచున్నది. కాని వారము శాసనమందు చెప్పబడినట్లు గురువారముకాక శుక్రవారముగా "స్వామి కన్నుపిళ్ళె"గారి 'ఎఫిమెరిస్'లో తెలుపబడెను. గురువారమునాడు పాడ్యమి వెళ్ళగా విదియగూడా వచ్చినది.

## శాసన విషయము :

శ్రీమన్ మహా మండలేశ్వర కాకతియ్య రుద్రదేవ మహారాజులు రాజ్యము చేయుచుండగా రాయల అంగరక్ష పాలకుడైన రుద్రినాయని కుమారుడైన బిచినాయంకపు వారు వినుకూరి విశ్వనాథ ధర్మేశ్వర దేవరకు కొన్ని వృత్తులు ఇచ్చినట్లు చెప్పబడెను. ఆ వృత్తులు చెరువుల క్రింద నీరు నేలరూపమునను, కొంత వెలిపొలముగను, కొంత ద్రవ్యరూపమునను చెప్పబడెను. వ్యాసగీత శ్లోకము తరువాత కూడా మరికొన్ని వృత్తులు పేర్కొనబడి యున్నవి. అందు 'రవుతులు' [మనిషికి] 'చిన్నము' వంతున, 'బంటులు' [మనిషికి] 'అడ్డుగు' వంతున ఇచ్చిరి. కాంపులు వలు పంద్రూను [వారుచేయు] భూమిలో మరత్తురు 1కి 'అడ్డుగు' వంతునను ఇచ్చిరి. తుదియందు మొగమారేశ్వర దేవరకు, కప్పేశ్వర దేవరకు, మలినాథ దేవరకు కూడ భూమివృత్తు లొసగబడెను.

## విశేషాంశములు :

ఇందు చరిత్రాంశము విశేషించి చెప్పబడలేదు. కాని అప్పటి రాజకీయ వ్యవస్థలో వెలమ నాయకులు ప్రముఖపాత్ర వహించినట్లు దీనివలన తెలియుచున్నది. ఇందు పేర్కొనబడిన "కాకతీయ రుద్రదేవ మహారాజులు" మహారాణి రుద్రమదేవియని విశేషించి చెప్పనక్కరలేదు. గణపతిదేవుడు తనకు పురుష సంతానము లేనికారణమున తన కూతురైన రుద్రమదేవిని పుత్రునిగా భావించి ఆమెకే రాజ విద్యలు నేర్పించి పట్టముకట్టెను. ఆమె 'రుద్రమదేవ మహారాజు' అని పురుషనామము స్వీకరించి పురుషవేషముతో కొలువుమ తీర్చుతూ రాచకార్యములను నిర్వహించుచుండెనని ప్రతాపరుద్రీయము మొదలగు గ్రంథములనుండి తెలియవచ్చుచున్నది. ఈమె తండ్రియగు గణపతి దేవుడు జీవించి యుండగనే క్రీ॥ శ॥ 1261 నుండి రాచకార్యములు నిర్వర్తించుచుండెను. ఆమె 1289 నవంబరులో చనిపోయినట్లు

చందుపట్ల శాసనమును బట్టి తెలియుచున్నది.[1] కనుక 1280 నాటి శాసనము ఆమె కాలమునకు చెందినదని చెప్పుటలో ఆక్షేపము లేదు. ఆమెకు అంగరక్ష పాలకుడగు బిచి నాయంకపువారు ఈ శాసనమందు దాతలుగా పేర్కొనబడిరి. ఈయన రుద్రినాయుని పుత్రుడని కూడ ఈ శాసనమును బట్టి తెలియుచున్నది. వీరు రెడ్లుగాక వెలమ నాయకులని తోచును. రుద్రమదేవి రాజ్యాభిషేకమును కొంతమంది దాయాదులు, ఇతర సామంతులు కొందరు అంగీకరించక ఆమె అధికారము నెదిరించిరని చరిత్రవలన తెలియవచ్చుచున్నది. రేచర్ల వెలమ నాయకులు దామానాయకుడు ప్రసాదిత్యనాయకుడు, రుద్రి నాయకుడు, అను ముగ్గురు సోదరులు [వీరు చెవ్విరెడ్డి లేక బేతిరెడ్డికి పుత్రులు], రుద్రమదేవి పక్షమున పోరాడి తిరుగుబాట్లను అణచి ఆమె అధికారమును వీరు సుస్థిరము చేసినట్లు 'వెలుగోటివారి వంశావళి' యను పుస్తకములో చెప్పబడెను. వారిలో మూడవ వాడగు రుద్రినాయకుడే ఈ శాసనమందలి రుద్రినాయకుడు కావచ్చును. అతని కొడుకు బిచినాయకుడు ఈశాసనదాత. ఇతని పేరు 'వెలుగోటివారి వంశావళి'లో కానరాదు. ఇతర శాసనములందుకూడా ఇతనిపేరు కానరాదు. ఈ రుద్రి నాయకుని గూర్చిన ప్రశంస 'వెలుగోటివారి వంశావళి'లో ఈ విధముగా కలదు:[2]

క. వాలవిఁ బెటికినఁ బరభూ
పాలస్త్రీ భూషణములు పాసి పడును నీ
వా లావనితల తొడవుల
కిలా? రేచర్ల రుద్ర కీర్తి సముద్రా.

మ. ఒగి నక్కుంబొడిరాల రాయుదురు మున్ను
ద్దీపులై యిప్పుడున్
దగ నీ యందియ యందునుండి తల్క్రిం ద్వై
వైరి భూపాలకుల్
జగతీ భాగమువం బసిండి పాడిరాల్ రాయు
చున్నారటే
తగదే రాయ పితామహాంక జగభ్ద్రారుద్ర
విం జెందినన్.

కనుక రుద్రనాయకుడు రుద్రమదేవికి సహాయ మొనర్చిన వెలమ నాయకుడేయని చెప్పబడినచో అతని కొడుకుగా ఈ బిచి నాయంకపువారు ఈ శాసనమువలన తెలియవచ్చుచున్నాడు. అప్పటి 77గురు నాయకులలో అతడొకడని తెలియవచ్చుచున్నది. ఇతడు రాయ అంగరక్షపాలకుడని చెప్పబడెను. అనగా రుద్రమదేవికి ఏట్టి ఆపద జరుగకుండ ఎల్లప్పుడు రక్షించెడి వాడని అర్థము. అట్టివారిక కూడా ఆ రోజులలో నాయక పదవిని ఇచ్చి కొంత సైన్యమునకు అధికారిగా చేయుచుండెడివారు. ఈ బిచి నాయకుడు అట్టి నాయంకపు అధికారియని శాసనమందు చెప్పబడెను. నేటివరకు విసునూరి గ్రామములో వెలమల సంఖ్యయే యితరుల సంఖ్యకంటె అధికముగా నున్నది. దీనినిబట్టికూడా ఇది వెలమ నాయకులకు రుద్రదేవి యొసగిననాయంకరమని నిశ్చయముగా చెప్పవచ్చును. వెలమ నాయకుల మొట్టమొదటి



మొదటి వైపు　　　రెండవ వైపు

శాసనమిది కాదగును. కాకతీయ రాజ్యములో రుద్రమదేవి కాలము నుండి నాయంకర విధానము అను సైనిక వ్యవస్థ యుండెడిది. ఈ వ్యవస్థ ననుసరించి రాజ్యమందు అచ్చటచ్చట సైనిక స్థావరములు నెలకొల్పబడెను. ఒక్కొక్క స్థావరము ఒక నాయంకునకు లేక నాయకునకు ఒప్పచెప్పబడెడిది. అతనికి కొంత రాజ్యము నాయంకవృత్తిగా ఇవ్వబడెడిది. దాని పాలన చేయుచూ కొంత సైన్యము నతడు పోషించి రాజు కొలకు సిద్ధముగా నుంచవలయును. యుద్ధ సమయములో కొంత రౌతు బలమును, కొంత కాల్బలమును తీసుకొని రాజునకు సహాయ పడవలయును. ఇట్టి సైనిక విధానము మొదటి సారిగా రుద్రమదేవి కాలముననే ప్రారంభమైనట్లు శాసనములను బట్టి తెలియుచున్నది. ఇట్టి శాసన మొకటి గుంటూరు తాలూకా 'కాజ' గ్రామములో గలదు. శకము 1191 (క్రీ॥ శ॥ 1269) సం॥ మున 'బుల్లినాయకుడు' తన నాయంకరములోని 'కాజ' కళ్యాణ కేశవదేవరకు కొంత భూమిని దానము చేసినట్లు చెప్పబడెను. మః

ప్రస్తుత విసునూరి శాసనము కూడ అట్టిదే. అనగా ఇచ్చట ఒక నాయంకర ముండెడిదని తెలియుచున్నది. ప్రతాపరుద్రుని కాలములో ఈ నాయంకరములు అనేకము లున్నట్లు శాసనముల ద్వారా తెలియు చున్నది. 'మక్తలలో' [మహబూబ్‌నగర్ జిల్లా] ఒక గంగసాహిణి గుండయ్య నాయకుడు పాలించుచుండెను. అతని ఆధీనములో కూడ కొందఱు రౌతులు, ఒంటి బంట్లు, కాల్బంట్లు యుండెడివారని అచటి శాసనములో గలదు.[4] ఇట్టి నాయంకరము మరియొకటి తెనాలి తాలూకా 'పెదకొండూరు'లో ఉన్నట్లు అచటి శాసనము తెలుపుచున్నది.[5] ఇందు 'మాయి దేవలెంక'గారి కొడుకు 'రుద్రదేవసింగారు' తన నాయంకరమునందు జేసిన దానము చెప్పబడినది. ఇట్టి నాయంకర విధానము రుద్రమదేవి కాలమునందు ఏర్పాటు చేయబడి యున్నట్లు ఈ విసునూరి శాసనము మరియు పైన చెప్పిన కాపె శాసనములబట్టి తెలియుచున్నది.

ఇందు దానము చేసినవారిలో బంటులు, రౌతులు కూడా పేర్కొనబడిరి. 'రౌతు' ఒకటికి 'చిన్నము' వంతున, బంటు అడ్డుగు వంతున ఇచ్చిరి. మిగిలిన దానములు చెరువుల క్రింది భూములు. అవి 'మరతుల లెక్క'లో వ్రాయబడెను. మరతు అనుటకు 'మ్' అను అక్షరము మాత్రమే చెప్పబడెను. ఈ పద్ధతి మరికొన్ని ఇతర శాసనములలో కూడ కానవచ్చును. వీటి వివరములన్నియు శాసన మూలములో సులభముగా తెలియుగలవు.

ఈ శాసనము చదువుటలో నాకు తోడ్పడిన గా॥ శ్రీ పి. వి. పి. శాస్త్రి, [డిప్యూటి డైరెక్టరు పురావస్తుశాఖ] గారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

ఈ శాసనము ప్రకటించుటకు అనుమతి నొసగిన పురావస్తుశాఖ అధికారులకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు. ఈ శాసన స్థలమును తెలిపిన యమ్. గోపాలరెడ్డిగారికి (దేవర ఉప్పల) నా కృతజ్ఞతలు.



మూడవ వైపు నాలుగవ వైపు

## శాసన మూలము

### మొదటి వైపు

1 అవిఘ్నమస్తు ॥ స్వస్తి శ్రీ
2 జ్జయాభ్యుదయశ్చ [॥] *
3 శక వర్షంబులు
4 ౧౨౧౭ యగు విక్రమ
5 సంవత్సర ఆశ్వయు
6 జ బ ౨ గు॥ స్వస్తి సమ-
7 స్త ప్రశస్తి సహితం శ్రీ
8 మన్మహామండలేశ్వర
9 కాకితియ్య రుద్రదేవ
10 మహారాజులు ప్రిథ్వి (థ్వీ)
11 రాజ్యము సేయుచూ
12 ఉండంగాను । స్వస్తి
13 శ్రీమతురాయ అ-
14 ంగ రక్షపాలకు
15 లైన రుద్రి నాయ్ని
16 బిచి నాయంక-
17 పు వారు విసు-
18 నూరి విశ్వనాథ
19 [-] ధర్మేశ్వర దేవర
20 వృత్తి వెలి పొలముప్
21 ౧౦ నీరు నేల భండి చ·
22 ఋ తిప్ప కొమ్మనప్ ౮

## రెండవ వైపు

23 దేవరకు ఆ నం ్రాక్ర
24 స్థాయిగాను పూర్వ్ర—
25 ము వెలి వోలము కొ—
26 త్త చెఱ్వులోనువ్ ప్రపి—
27 ల్లి గుండ్ల కడనువ్ ౫
28 భండి చెఱ్వుది బనువ్
29 ౼ ఒడిసెలకుంట వాంగు—
30 నవ్ 3x వలి వింఢి చెఱ్వులో
31 వ్ ౨ బచ్చిడ కుంట ద—
32 క్షిణపుంగొమ్మునవ్
33 ౧ నీరు నేల చింత చె—
34 ఱ్వున దుడ్డె పాయనువ్
35 ॥ అంద చట్టాతి చేను
36 వ్ । అంద తూము చేను
37 వ్ । = అంద పొగనూరివ—

## మూడవ వైపు

38 ందు ఱువ్ । = అంద
39 బూతు కుంట కడవ్
40 ॥ భండి చెఱ్వున
41 వ్ ॥ కొత్త చెఱ్వున
42 వ్ । బచ్చిడ్ల కుంటను
43 వ్ ॥ వనధి కొండూ
44 రను కాల్వనువ్ ॥చె
45 ఱునూరవ్ । భోగం
46 ్రవిత్తి వెలుమల చెఱ్వు—
47 నవ్ ౨ । = ్రకొత్త చె.
48 ఱ్వునవ్॥। = చింతల
49 చెఱ్వునవ్ = భం—
50 డి చెఱ్వు నదీ పా —
51 ల వందుఱువ్॥।
52 బిచి నాయంకపు
33 వారు చింతల చెఱ్వు
54 వెనక మొగవాలకు
55 భోగానకుం బెట్టిన—
56 దివ్ ౧రవుతులూ

## నాల్గవ వైపు

57 ను బంటున్ను విడ్చిన ప—
58 న్ను రవుతున చిన్నను
59 బంటు నను అడ్డుగు
60 విసునూరి కాంపుల న—
61 లు పంౕడూను చతుసి
62 మనూను దీపాలకు
63 మఱుతురున అడ్డు —
64 గుసేసి॥ స్వదత్తాం పరద—
65 త్తాం వాయోహ ేతి వను—
66 ంధర షష్టి వ్వర్ష సహ—
67 —ణి విష్ఠా యాంజే......
68 ......తేః (తే) కిమిః
69 ......స్నానం మల్లినా—
70 థ దేవరకు చింతల
71 చెఱ్వువెనక మొగమూరే
72 శ్వర దేవరకు......భ—
73 ండి చెఱ్వు......వార
74 నువ్॥ కుప్పేశ్వరదేవ—
75 రకు ్రకొత్త చెఱ్వునవ్
76 1=దుడ్డె మల్లినాథదేవ—
77 రకు చింతల చెఱ్వోడ్డండి
78 గట్టునవ్ 1=

---

## అథోజ్ఞాపికలు

1. భారతి 1974, మే (పుట 4)
2. వెలుగోటివారి వంశావళి, పుటలు 9, 10
3. SII IV, 705, 707
4. COR US III P. No 52, 54
5. SII X P. No 499, 521

# "కథకుని అంతరంగ తరంగాలు!"

## (చైతన్య స్రవంతిలో రచన)

శ్రీ పి. యస్. శాస్త్రి

...రాయాలి...రాయాలి. మళ్ళీ వో మంచికథ రాయాలి!... పోతున్నాయి. పోతున్నాయి...చేజారిపోతున్నాయి, వేల వేల రూపాయల బహుమతులు!...వెయ్యి. వెయ్యి, మళ్ళీ లాటరీ వెయ్యి! వెయ్యి రూపాయల బహుమానం లభించొచ్చు!... అవునవును!...అవునవు నవును... "నౌన్"! "నౌన్ లేదు వెర్బ్ లేదు!..." అవునవును ఛాన్స్! తగిలితే వెయ్యిరూపాయలు పోతే రూపాయి...భలే భలే భలే! యమకం చమక్కు!...'పోతే రూపా'...'పా...పా...'లు...'పాపాలు'... ఛ! పాపాలుకాదు!... "గుమ్మెట లెందరు వాయించలేదు?"... "నువ్వు కొట్టిన బాణం దెబ్బకు గాయపడి చీకటి ఎరుపెక్కింది!"... ఏందుకు...ఎందుకు...ఎందుకు?... ఏమిటి, ఏమిటీ జ్ఞాపకాలు ?... కిలగా పులగంగా...పులగం బెల్లం కలిపితింటే...భలే మజాగా..." "చెలరేగిన కలగా పులగపు, పిలయావర్తపు, బలవత్ ఝరవత్ పరివర్తనలో..." లో లో! లో...

"హలో హలో! మీరా! ఎవరో అనుకున్నా...అబ్బే ఏం లేదు ఏవిటి కథల పోటీకా?...ఏం ఏలేదండి! అబ్బే!...మీకు తెలీదూ ?... ఈ కథల పోటీలు ఎమెచూర్ టాలెంట్‌ని లొకేట్ చేయటానికి .. మాలాంటి చెయ్యితిరిగిన వాళ్ళకు కాదు! వెళ్ళొస్తారా? మంచిది!"

..."ఓరీ రామారావూ! ఎంత అబద్ధాలకోరువైనావురా! నువ్వూ పోటీకి కథ పంపించావుగా!" ..."ష్! మెల్లిగా మాట్లాడు మై డియర్ ఆత్మా! అవతలాయనకి తెలిస్తే బాగోదు! మనం పోటీకి పంపించామని, ప్రైజు రాలేదని తెలిస్తే ఎంత పరువునష్టం"...

"నీకసలు పరువుండి ఏడిస్తేగా?" "ఏడిశావ్‌లే బోడి పాత జోకూ మవ్వూ! కాసేపు నోరు మూసుకో!"...నిజం నిజం...మన పరువు నడివీధికెక్కి...నడివీధి...అంటే వీధి నడుమకనా, వీధి నడ్డి మీదనా?...ఏదో వొకటి పోనిద్దూ!...సద్దు చెయ్యద్దు.

..."హరికథల్లోలా, ప్రాసకోసం. యమకంకోసం పడి చావడమేనా, మంచిభావంతో కథరాసేదుందా?"..."ఆగాగు మై డియర్ అంతరాత్మా! అంత కోపంకూడదు. 'శైలి కుదిరితే భావం యెలావున్నా ఫరవాలేదని గొప్ప గొప్ప వాళ్ళంతా ఘోషిస్తున్నారు! శైలి కోసం కృషి చేస్తున్నా!" నిజమే ? నిజమేనా ? శైలి బాగుంటే భావం ఎలావున్నా ఫరవా...'బే ఫరవా?..."ఫికర్ మత్ మేరే ఆత్మా!"..., నిజంగా భావం బాగాలేకుండా మంచి శైలిలో రాస్తే చెత్తనేనా చదువుతారా?...'తారా'... రా!...

"ఈ మధ్యనేం రాయటం లేదండి! మంచి పాటుకోసం ఆలోచిస్తున్నా!... థాంక్యూ థాంక్యూ.. మీలాంటివాళ్ళ ప్రోత్సాహం వుంటే తప్పకుండా అమూల్య సాహితీ కళాఖండాల్ని వెలువరిస్తా! థాంక్స్ వన్సెగైన్!"

...ప్లాట్లకోసం మనం, పాట్లుపడి పడీ, వూరుకొన్న సంగతి ఆయనకి...అమ్మో!...ఆయనకితెలిస్తే మనపరువు గంగలో...లోతుగా కలుస్తుంది! "పరువుకోసమే డ్రైద వేలే కూసుమనసా?"...సా... మన.. నమసా...మానన..నన...నస... "ఛప్! నీ వెర్రి కర్తం లేదా?" "షటప్! మై డియర్ ఆత్మా!"...

...ఔనౌను! రాస్తాను రాస్తాను! అద్భుత సాహితీ కళాఖండాలను...ఔనూ కళని ఖండిస్తేకాని కళాఖండం రాదా? పైగా అది అమూల్యం. అంటే వెలలేనిది. మూల్యం... అంటే "వేల్యూ" "విలువ" లేనిది అంతేనా?...అంటే చెత్త!...భలే భలే!...సెర్చి... సెర్చి...రీసెర్చి...జాగ్రత్త జాగ్రత్త...! ఇటువంటివి వింటే మన కళాపోషకులూ, కళాస్రష్టలూ, 'స్రష్ట'అంటే...సృష్టించేవాడు... ఆఁ ఆఁ..! అలాంటి వాళ్ళందరూ మన్ని చితక్కొట్టేస్తారు... 'చెత్త' గురించి రాసి నీవు చితక్కొట్టించుకోకే మనసా!"...

"ఓయీ రామారావూ! నువ్వూ అమూల్య సాహితీ కళాఖండాల్ని సృష్టిస్తానన్నావు! నీదీ అటువంటి చెత్తేనా..." "కాదు కాదు! నాది అటువంటిది కాదు...నాది అసలు సిసలు కళాఖండం! మరోడు సృష్టించేది చెత్త కళాఖండం! ఈ రహస్యం నీకు మాత్రమే చెప్పాను! ఇంకెవరికీ తెలీనివ్వకు!" "హిపోక్రసీ! ఆత్మవంచన!"... "కాదు మై డియర్ ఆత్మా! "ఆత్మవిశ్వాసం" హిపోక్రసీకి, ఆత్మవిశ్వాసానికి నీకు అర్థాలు సరిగ్గా తెలుసో, తెలేదో, 'బ్రౌణ్యం'లోనూ, 'శబ్దరత్నాకరం'లోనూ చూడు! పో!ఫోయి చూసుకో!"...కో...కోకో! "యేస్కో కోకాకోలా!"..."ఆకేస్కో,వొక్కేస్కో, ఆపైన మూస్కో" ..."కోనకిస్కో"అవునూ...ఆత్మవిశ్వాసానికీఅహంభావానికి మధ్యవుండే సన్నని పొర, పొరపాటున తెగితే...ఏమవుతుంది?...అహంభావం మిగులుతుంది!..."అంటే ఆత్మ విశ్వాసం ముదిరి, బరువైతే, అహంభావంలోకి దిగుతుందన్నమాట! అంతేనా?"..."అంతే అంతే! అంతే! అన్నమాటేమిటి ఉన్నమాటే అది!" శభాష్!...తెలుగు సినీ, నాటక, నడికట్టు డైలాగులు, మనకీ వస్తున్నాయి... "సినీ 'నాటకాలు' యివేవిటోయ్! మై డియర్ రామారావ్!" ... "అబ్బా! నాలోనివాడా! నా ప్రాణం తింటావేల? సినిమాలు, నాటకాలు అని! అంతేకాని 'టీ. వీ. సినిమాల్లా' 'సినీనాటకాలు' కావు!..."

''నమస్కారం సార్ ! మీ మిత్రులెవరో సినిమాతీస్తున్నట్టు తెలిసింది ! కథ తయారుగావుందా ? లేక ఇంకా తయా... ... ఇహిహి !''

..."నీకెందుకా వెధవసవ్వ ? వినయంగా, మాటిగా, ''మీ కృథ దొరక్కపోతే నాదగ్గర బండెడు కథలున్నాయి కావలిస్తే తీసుకోండి'' అని తిన్నగా యాడవలేవూ ? ......'' ''ఏడిశినట్టుంది నీ సలహా! అంత డైరెక్ట్గా అడిగేస్తే మనని చవగ్గా కొంటాడాయన! ఆత్మ ఇది 'స్ట్రాటజీ' ! నీకు తెలీదు ! నోరు మూసుకుని లోపల పడుకుని పరమాత్మని తలుచుకో !''... ...

...''...అహ ! అలాగాసార్ ! ఆవిడ మాంఛి రైటర్లెండి! వనగ్ఫుల్ నేరేషన్ ! బ్యూటిఫుల్ సీన్స్ !... ఈసారెదేనా క్రొత్త కథ కావలిసొస్తే, కాస్త నాకు కబురెట్టండి !''

...వెధవ ! వెధవన్నర వెధవ ! ఆ ప్రఖ్యాత రచయిత్రి పాత కథని కొత్తగా రంగుల్లో తీస్తాడట ! ఏడవలేకపోయాడు !...అయినా ఆవిడ ''క్రొత్త క్రొత్త యింగ్లీషు పుస్తకాలు చదివి కాపీకథలు రాస్తుంది మెుర్రో'' అని జనం గోలం పెట్టినా వీళ్ళకాకథలే కావాలి! ''... కాక మీదున్నావ్ రామారావ్ ! నువ్వూ ఆవిడ కథల్ని మెచ్చుకోలేదూ ?'' ''మెచ్చుకుంటే ? ... అప్పటికీ నాకింకా మెచ్యూరిటీ రాలేదు ! నేనింకా రాయటం మొదలెట్టనూలేదు !'' ''అదీ! అదీ! ఆ సంగతి ఏడు ! నువ్వు రాయడం మొదలెట్టాక మిగిలిన వాళ్ళని నచ్చటం మానేశాయి !''... ''అవునయ్యా ! అంతే ! అయితే ఏం చేస్తావ్ మిష్టర్ ఆత్మా ?''... ''ఇప్పటికీ పేరు పొందిన ఆ పాత రచయిత్రి రచయితల కథలే తీస్తే, నాలాంటి వర్తమాన రచయితల పనేంకావాలి ? ఐ హేట్ దిస్ యిన్ జస్టిస్ ! ముసలివాళ్లై పోయాక, గ్లామరు, గ్లోరీ వస్తే లాభమేమిటి ? ఏమిటీ అంట'' ''శభాష్ భలే అన్నావ్ ! అపెరైటు !'' ''మీరెవరు ? నేను నీ అహాన్ని! ఆ ఆత్మగాడికంటే దగ్గరవాడిని!'' ''సరే! సరే! సరే!''... అవునూ... మనం తొందరగా పేరు పొందటం ఎలా ? ఎలా ఎలా? లా? లాలా! ''లాలీ పోసీ నిన్నూ...'' లా ?... ''లాపొక్కింతయు లేదు !'' ''లా'' అంటే న్యాయం లేదు !'' ఏడిశావ్ లే ! ఇదీ పాత జోకే! అప్పయిన పాతకథనే మళ్ళీ కొత్తగా సృతిక్కి పంపినట్టు ఇలాంటి పాతజోకు లెయ్యకు ఆత్మా ! అసలె చిరాగ్గావుంది ! ''చిరాగ్ కహాఁ ? రోష్నీ కహా ?''... బావుంది బావుంది !... భలే వుంది!

...''అట్టు, అట్టు, పెసరట్టు ! ఉప్మాతో కలిపి పట్టు, ఓ పట్టు !'' ఓహో ఏం బాగా నడుస్తోంది వాక్యం !... వాక్యం నడవటమేమిటె నా మొహం ?... నడిచెడువాడు... 'నడిచెడు'వాడా? నడి, 'చెడు' వాడా ?... ఇప్పటి జోకు ? ... ఏమో ! ... పట్టు పట్టు మరోపట్టు !...అన్నట్టు పెట్టుబడివుంటే మన్ని పట్టుకునే వాడుండడు ! అప్పుడు మనం ప్రొడ్యూసర్, డైరెక్టర్, కథకుడు, స్క్రీన్ప్లే, పాటల మాటల రైటర్... అన్నీ అంతా మనమే ! అప్పుడు మనపని ''మోత మోత !''... ...''పర్శ్లో ముందుమేత ఆ తరువాత మోత!...'మోత'... మోతుబరిరైతు నీవడేనా తగిలితే బాగుండును ! తగిలిందన్నమాటే ఛాన్సు !...

...ఎలా ఎలా ? వో ప్రొడ్యూసర్ని పట్టాలి !... లేకపోతే కారణజన్ముడైన వో యాక్టర్నైనా పట్టాలి, 'కాకా' ! తప్పదు ! ''ఫూకం కే కా...భేకం బాకా !...'' ...''ఓ యీ రామారావూ ! అఖరికిలా దిగజారి పోయావా ?'' బాల రసాల సాల నవపల్లవ కోమల కావ్య కన్యకన్ కూళల ''...కివ్వనన్న, పోతన్న పుట్టిన తెలుగు గడ్డలో పుట్టి, నీ కిదేంబుద్ధి ?'' ...''ష్టాప్ ! ష్టాప్ ! భోగాలకోసం కాదు మన సినిమాకి రాయడం ! కళాపోషణకి !'' ''ఔనౌను ! కలా పోసన !'' ''చాల్లే నీ వ్యంగ్యం ! నీకేం తెలుసు ? ఎక్కువమంది ప్రజలు మెచ్చిందే కళ! సినిమావాలామంది 'మామూలు మానిసిలు', ఆదరిస్తున్నారు కనుక అదే సిసలైనకళ !'' ...'సిసలైనకళ ''సీసాల కళ !'' అక్కడ సీసాలు భలే పగుల్తాయట!... పగుల్తాయా ప్రేల్తాయా ? ఏదో వొకటి పోనిద్దూ !'' ...కనక నేను సినిమాలకు రాయడం కళాపోషణకి !... కాదు ! కాదు ! ఉదరపోషణక్కాదు ! అప్పుడు మనపేరు 'కళాకాశం'లో...ఛప్ 'కళంకం' కాదు ! తిన్నగా విను ! ...అక్కడ మనపేరు ఉజ్జ్వల తారలా ప్రకాశిస్తుంది !... 'తారైతే రాలిపోవచ్చుకదా' అనా నీ అనుమానం ! హహహ ! ''నక్షత్రం వెలిగినా రాలినా నక్షత్రమే !'' ... భలే ! గొప్ప డైలాగు లాగాను ! దెబ్బకి నోరు మూసాడు ఆత్మగాడు !...

...అసలు యీ సినిమావాళ్ళకి మాసిపోయి, మాసికలేసిన పాత వస్త్రాల్లాంటి పాతకథలేకావాలి కాని మన కొత్త కథలక్కర్లేదు! ...పోనీ పోనీ ! వాళ్ళు తీసుకోకపోతే పోనీ ! ... మనకేంలోటా ?... ఉత్తమ సాహిత్య సృష్టి చేద్దాం !... ఆంధ్ర సాహిత్య చరిత్రలో మన పేరు చిరస్థాయిగా నిలబడుతుంది !... ''హిపోక్రిట్ ! అందని ద్రాక్షపళ్ళు పులుపుట !''... ఎవరు ఎవరు ఎవరు ?...ఎవరీ మాటన్నది ?... ''ఓరీ ఆత్మా ! మళ్ళీ వచ్చావూ ? నావుప్పుతింటూ నాకే ముప్పుతెస్తావేం ? నేనేం సినిమా ఛాన్సులు రాక సాహిత్య సేవ చేస్తాననటంలేదు !... చూస్కో ఎలా రాస్తానో ! విశ్వనాథ సత్యనారాయణ గారికంటే ఎక్కువగా తెలుగు భాష పేరు ప్రఖ్యాతులు నిలబెడతా ! ''పద్మ విభూషణ్'' ''మహా మహోపాధ్యాయ'' గౌరవ డాక్టరేటూ, 'రామన్ మెగసేసే అవార్డూ'... అవును ! ఆంధ్రభాషా సాహిత్యాలకి చేసిన సేవకు !... ఆఖరికి నోబెల్ బహుమానంకూడా సాధించి తెలుగు భాషా పతాక యునైటెడ్ నేషన్స్ బిల్డింగ్మీద ఎగరేస్తా ! ఏమనుకుంటున్నావో !... ''ఊరుకుంటూనా నేను, కసిగా, కసాయిగా ఉపద్రవంలాగా, ఉవ్వెత్తుగా లేచి...'' ... లేచి లేచి ? ''ఒక లక్ష నక్షత్రాలమాటలు, ఒక కోటి జలపాతాల పాటలు'' రాస్తాను! రాస్తాను... ఏమనుకుంటున్నావో ! కష్టపడి ఘర్మధారల కురిపించి కురిపించి రాస్తా ! ఘర్మజలానికి ధర్మజలానికి, ఘర్మజలానికి ఖరీదు లేదోయ్ !'' ... తెలుసా... ''హింస నచణ, ధ్వంస రచన, ధ్వంస వచణ, హింసరచన ! చేస్తా !... ''నా ఆదర్శాల రవ్వల జడిగా కురి

( మిగతా 70 వ పేజీలో )

# కలగూరగంప

## గమనిక

"తేవారం త్రయం", రచన శ్రీ. బి. జి. ఎల్. స్వామి, వ్యాసంలో ఉదహరించబడిన గ్రంథాల పట్టీ ఈ సంచికలో వెయ్యటానికి వీలయింది.


1. బాలసుబ్రహ్మణ్యం ఎస్; ఆర్. 1966, ఎర్లీ చోళా ఆర్ట్స్, ఏషియా పబ్ హౌస్, బొంబాయి. 2. –డిటో–, ఎర్లీ చోళా టెంపుల్స్, ఓరియంట్ లాంగ్ మాన్స్, బొంబాయి, 3. కాల్డ్‌వెల్ ఆర్. 1875 ఎ కంపారిటివ్ గ్రామర్ ఆఫ్ ది ద్రవిడియన్ అన్ సౌత్ ఇండియన్ ఫామిలీ ఆఫ్ లాంగ్వేజెస్. ట్రుబ్నర్ ఎండ్ కో. లండన్. 4. చక్రవర్తి హెచ్. 1970 పాశుపత వ్రాతన్ అకాడమిక్ పబ్, కలకత్తా 5. దొరైరంగస్వామి ఎమ్.ఎ. 1958. ది రిలిజన్ ఎండ్ ఫిలాసఫీ ఆఫ్ తేవారం, యూనివ. ఆఫ్ మద్రాస్, మదరాసు. 6. దొరైస్వామి పిళ్లైయ్ ఎస్. అవయ్ 1958 తమిళ సాహిత్య చరిత్ర (తమిళంలో) అన్నామలయ యూనివర్సిటీ, అన్నామలయనగర్. 7. గణేశన్ సా 1971 ఫ్రెష్ లయిట్ ఆన్ పల్లవా హిస్టరీ, కె. ఎ. నీలకంఠశాస్త్రి ఫెలిసిటేషన్ వాల్యూమ్, పు. 474–78. 8. కృష్ణారావు కె. 1970 కర్నాటక సాంస్కృత్య సంశోధనె (కన్నడంలో) ఉషాసాహిత్య మాలె, మైసూరు 9 లక్ష్మీనారాయణరావు ఎన్-పంచముఖి ఆర్. ఎస్. 1946 కర్నాటక అరసు మనె తనగళు (కన్నడంలో) కన్నడ రిసెర్చి ఇన్‌స్టిట్ ధార్వార్, 10. మహాలింగం టి. వి. 1968, కాంచీపురం ఇన్ ఎర్లీ సౌత్ ఇండియన్ హిస్టరీ. ఏషియా ప. హౌ, బొంబాయి. 11. మీనాక్షి సి. 1938, ఎడ్మినిస్ట్రేషన్ ఎండ్ సోషల్ లైఫ్ అండర్ ది పల్లవాస్. యూని. అఫ్ మద్రాస్, మదరాసు. 12. నాగస్వామి ఆర్. 1971, డా. వి. రాఘవన్ ఫెలిసిటేషన్ వాల్యూమ్. 13. నంజుండన్ కె. ఆర్. 1972, తిరుమూలర్ ఔర్ గోరఖ్‌నాథ్ (హిందీలో) పి. హెచ్. డి. థీసిస్. మీరట్ యూనివర్సిటీ, మీరట్. 14. నారాయణ అయ్యర్ సి. వి. 1936 ఆరిజిన్ ఎండ్ ఎర్లీ హిస్టరీ ఆఫ్ శైవిసమ్ ఇన్ సౌత్ ఇండియా యూని. అఫ్ మద్రాస్, మదరాసు. 15. నెల్సన్ జె. హెచ్. 1808, ది మదురా కంట్రీ, మదరాసు 16. నీలకంఠశాస్త్రి కె. ఎ. 1941, హిస్టారికల్ మెథడ్ ఇన్ రిలేషన్ టు ప్రాబ్లెమ్స్ ఆఫ్ సౌత్ ఇండియన్ హిస్టరీ, యూని. అఫ్ మద్. మదరాసు 17. –డిటో– 1955 ఏ హిస్టరీ ఆఫ్ సౌత్ ఇండియా, ఆక్స్‌ఫర్డ్ యూని. ప్రెస్, మదరాసు. 18. పిళ్ళైయ్ కె కె 1969, ఎ సోషల్ హిస్టరి అఫ్ ది టామికల్, యూని. అఫ్ మద్ మదరాసు: 19 రాజమాణిక్కమ్ ఎమ్. 1960. పెరియ పురాణ అరె చ్చి (తమిళంలో) 20 – డిటో – శైవ సమయ వళర్చి (తమిళంలో) అవ్వయి మాలక్కమ్, మదరాసు 21. రాఘవ అయ్యంగార్ ఎమ్. 1928, ఆళ్వార్‌గళ్ కలనిలయ్, మదరాసు. 22. రమేష్ కె. వి. 1970, ఎ హిస్టరీ అఫ్ సౌత్ కెనరా, కర్నాటక యూని; ధార్వార్. 23. సచ్చిదానందేంద్ర సరస్వతి 1963, శ్రీ శంకర భగవత్పాద వృత్తాంత పారవర్యస్య (కన్నడంలో) ఆధ్యాత్మ ప్రకాశ కార్యాలయ. హొళె నర్సిపూర్ (మైసూర్) 24. సదాశివ పండరత్తార్ టి. వి. 1937 తమిళ్ పొలిటి3. 25. –డిటో–1957 తమిళ సాహిత్య చరిత్ర క్రీ. శ. 250-600, (తమిళంలో) అన్నామలయ్ యూని. అన్నామలయినగర్ 26. –డిటో– 1967, తమిళ సాహిత్య చరిత్ర 13, 14, 15 శతాబ్దాలు, (తమిళంలో), అన్నా యూని. అన్నామలయినగర్. 27, – డిటో– 1967, తరువాతి చోళుల చరిత్ర (తమిళంలో), అన్నా. యూని. అన్నామలయినగర్ 28. సుందర్‌రాజన్ కె వి. 1969, కల్ట్ ఇన్ పల్లవా టెంపుల్స్, ట్రాన్. ఆర్కి. సొస. సౌ. ఇండి, 1962-5, పు. 143–162. 29. సుబ్రహ్మణ్యం టి. ఎన్. 1955 సౌత్ ఇండియన్ టెంపుల్ ఇన్‌స్క్రిప్షన్స్ III(1) ప్ర.ప్రా. వి.గ్రం. మదరాసు– 30-డిటో 1966 ఎర్లీ పల్లవా కాపర్ ప్లేట్స్, తమిళ వరలాట్టు కళగమ్, మదరాసు 31. శ్రీనివాసన్ కె. ఆర్. 1960 సమ్ ఆస్పెక్ట్స్ ఆఫ్ రిలిజన్ యాస్ రివీల్డ్ బై ఎర్లీ మాన్యుమెంట్స్ ఎండ్ లిటరేచర్ ఆఫ్ ది సౌత్, యూని. అఫ్ మద్; మదరాసు 32. –డిటో – 1964, కేవ్ టెంపుల్స్ అఫ్ ది పల్లవాస్. భారత్ ప్రభుత్వం, న్యూఢిల్లీ 33 శ్రీనివాసపిళ్లైయ్ కె. 1949, తమిళ్ వరలారు తంజావూరు. 34. సుబ్రహ్మణ్యమ్ టి. ఎన్. పల్లవన్ కోయిల్ జైన కాపర్ ప్లేట్స్ ఆఫ్ ఎర్లీ పల్లవా పిరియడ్, ట్రాన్. ఆర్కి. సొస. సౌ. ఇండ్. 1958-9, పు. 41–83. 35. సుందరం పిళ్లైయ్ పి. 1898 సమ్ మైల్‌స్టోన్స్ ఇన్ ది హిస్టరీ ఆఫ్ తమిళ్ లిటరేచర్ ఆన్ ది ఏజ్ ఆఫ్ తిరుజ్ఞాన సంబంద టి. ఎ. సొసయిటీ, మదరాసు. 36 స్వామి బి. జి. ఎల్. 1972 ఎ. ది ఫోర్ శైవయిట్ సమయాచార్యాస్ అఫ్ ది తమిళ్ కంట్రీ ఇన్ ఎపిగ్రాఫీ జర్. అఫ్. ఇం. హి; 49. 37–డిటో 1972బి ది గోలకీ స్కూల్ అఫ్ శైవిసమ్ ఇన్ ది తమిళ్ కంట్రీ (అచ్చులో) 38. –డిటో– 1974సి. ఎ నోట్ ఆన్ ది గోలకీ ఎండ్ కోగళి బ్రాంచెస్ అఫ్ శైవిసమ్ అరయుచ్చి (అచ్చులో)39–డిటో–1972 డి. చిదంబరం ఎండ్ నటరాజా ప్రాబ్లెమ్ ఎండ్ రేషనలయిజేషన్ (అచ్చులో) 40 స్వామి బి. జి. ఎల్. –నంజుండన్ కె. ఆర్. 1972 ది కాలాముఖా సెక్ట్ ఇన్ ది తమిళ్ కంట్రీ జర్న్. ఇన్ మెడి.కల్ (మదరాసు) 101–113. 41. వైద్యనాథన్ కె ఎస్. 1953, ముత్తరయర్ నాడు జల్. అఫ్ మిత్ సొస XLIV 39 53. 42. వెళ్ళయ వర్ణన్ కె. 1962, పన్నిరు తిరుమురై వరలారు (తమిళంలో అన్నా యూ. అన్నామలయి నగర్. 43. వెంకటసామిశివి, మయిలై

1950. మహేం దవర్మన్ (తమిళంలో) పి. ఇం. శై. సిద్ధాంత వర్క్స్ ఎబ్ పాస తిరునెల్వేలి, మదరాసు.

## "సర్వంకష - 2"

ఫిబ్రవరి 1977 భారతిలో 'శృంగారనైషధ పర్యంకష వ్యాఖ్య - 2' లో (4) లో శ్రీ కళాప్రపూర్ణ నిడుదవోలు వెంకటరావు గారు "సఖులుదాంబుష్పాస్త్రు జతపెట్టు పదమున నభిషేక మొన రించుచవని నాథు" అన్న పాదానికి అర్థం చెప్పలేదు.

"మన్మథుని స్థానమున నలుని నిలుపుటకు – చెలికత్తెలు పర్వము సిద్ధము చేయగా దమయంతి నలుని మన్మథ స్థానమున నాతని నభిషేకించిన" దని అర్థము కాదు.

ఆ పద్యపాదానికి స్పష్టంగా అర్థం చెప్పాల్సివుంది. "సామ్రాజ్య పదవికి" అనివున్నా "జతపెట్టు పదమున" అనివున్నా, అన్వయంలో తేడా యేమీవుండదు. పద్యం చివరవున్న "నీరజాక్షి", పద్యంలోవున్న అన్ని వాక్యాలకీ కర్త. అది యేకవచనం గనక "అభిషేక మొనరించున్" అని యేకవచన క్రియ వచ్చింది. "సఖులు" కూడా వున్నా, "తాం" మా తనే కర్తగా నిలుస్తుందని నన్నయ ప్రయోగాలు చూస్తే తెలుస్తుంది.

1) "తామును దౌహిత్రులు నూర్ధ్వ లోకంబునకుం జనియెనని"
ఆది. 3-225

2) "కౌరవులేమని తలంచువాకా బుద్ధి నిష్పులందానున్"
ఆర. 1 238

3) "ఉదితతేజుండు గ్రీడలాడుచునుండు నింతులుందాను"
ఆర. 3-360

నన్నయ పయోగాలు యిటువంటివి కోకొల్లలు. నన్నయ పద ప్రయోగకోశంలో వెదుకులాడుకోకుండానే దొరుకుతాయి.

— శ్రీ న. చ. రామానుజాచార్యులు

## 'సాహిత్యంలో సృజన' - ఒక పరిశీలన

'సాహిత్యంలో సృజన' అన్న సుదర్శనంగారి రచన – దానిపై తిరుమలరావుగారి చర్చ అటుపిమ్మట. ఫిబ్రవరి "భారతి"లో వచ్చిన విమర్శలు చూసిన పిమ్మట నాకు స్ఫురించిన అభిప్రాయాలు ప్రతికా ముఖంగా నివేదించుకుంటున్నాను.

1) కథలు – నాటకాలు – నవలలు కవిత్వంనుంచి వేరుచేసి చూపిన ఆర్. యస్‌గారి పరిగణనను, అన్నీ కవిత్వమే అంటూ ఖండిస్తున్న తిరుమలరావుగారి మాటల వెనుకనున్న ఆంతర్యాన్నీ, ఆవేదనను నేనిలా అర్థం చేసుకొని, విపులీకరిస్తున్నాను.

తిక్కన నాటకీయ శిల్పాన్ని విమర్శించమంటే ఆయన కవిత్వాన్ని, నాటక లక్షణాలలో చెప్పే పంచ సంధులు అవస్థలు అనే ప్రేమ్‌లో బిగించజూసే విమర్శకులు, సాహిత్యవిద్యార్థులు ఇంకా ఇందాకా వరకూ ఉన్నారు – అది ప్రాచీన సాహిత్యంమీద తెలుగు విమర్శ సాధించిన 'అభ్యుదయం' కాగా – ఆధునిక విమర్శకులలో స్వతం ఆదే ధోరణి కనిపించటంతో – తెలుగు విమర్శ ఇంతో పెరగాలని అనిపిస్తుంది. కవిత బాహ్యాకృతి పరిశీలనకు ఎక్కువ విలువ ఇవ్వడం – అంతరిక తత్వానికి తగినంత ప్రకాశం ఇవ్వక పోవడం – నేనాటి విమర్శ స్థితి.

ఉదాహరణకు 'వచన కవితా' ప్రక్రియనుంచి – అభ్యుదయ మీ అని ముద్ర పడాలంటే వాడు తప్పని సరిగా మార్క్సిజం ధారాల – అందులోనూ వచన కవితలో వ్రాసితీరాలి... ఈ 'ప్కేలు' ఏమాత్రం సడలితే వాడు ఆధునికుడు కాదు – దీన్ని శ్రీశ్రీ యే స్పష్టంగా వెలిబుచ్చాడు ఒకచోట.

పాతదాన్ని (అది ఎంత మంచిదైనా) నిరాకరించండి. కొత్తదాన్ని (అది ఎంత అనుమానాస్పదంగా కనపడ్డా) ఆదరించండి.
(వ్యాస క్రీడలు. పేజీ 140)

పాత సంకెళ్ళను కాదని ఇవతలకు వచ్చిన ఆధునికుల కవిత్వంలో ఏర్పరచిన క్రొత్త సంకెళ్ళు ఇవి.

కవిత్వానికి 'అర్థం' ఆత్మ అయితే (ఆలంకారికుల దృష్టితో అనడంలేదు) శబ్దార్థాలు దేహం. కాగా దాని ఆకార కల్పన కవితలో ప్రక్రియ. దేహం నశ్వరం...ఆత్మ నిత్యం...అనే ఉత్కృష్టమైన తాత్త్విక జ్ఞానాన్ని అనాదిగా రక్తగతం చేసుకున్న మనం...ఈ కావ్య దేహంమీద ఎందుకింత మోహపడుతున్నాం ? ఇది పురోగతా ? తిరోగతా ? శ్రీశ్రీ భావాలు ఛందస్సులో చెప్పతగదా ? ఉత్పల సత్యనారాయణాచార్యగారి 'జంట నగరాలు...' ఖండ కృతిలో, చెప్పలి తాత అమనయం చదివి సానుభూతితో కళ్ళు చెమర్చినవే 'భిక్షువర్షీయసి'లో లేని ప్రసన్నత అందుకు కారణమే... మరి వ్యావహారిక భాషా వాదులు ఎంతమంది చిన్నయసూరి రచనలో వినిపించే సంగీతం కాదనగలరు ? కనుక, కవినిబట్టి ప్రక్రియ రాణిస్తుంది... ప్రక్రియనుబట్టి కవిస్థానం నిర్ణీతం కారాదు. నిన్నలేనిదీ...నేడు ఉన్నదీ... ముందుండనిదీ అయిన ఈ ప్రక్రియాదేహాన్ని తడమకండి ... కవిత్వంలో ఆత్మను వెదకండి... తెలుగు విమర్శ ప్రమాణాలు పెరగాలంటే విమర్శకులు గుర్తించ వలసినది ఇది.

కథలు... నాటకాలు... కవిత్వం కావనే వారు ముందుగా కవిత్వం అంటే ఏమిటో తెలుసుకోవాలి. బుచ్చిబాబు కథల్లో కవిత్వం లేదా ? నాటకాలలో కవిత్వం లేదా ? రాచకొండ నవలల్లో కవిత్వం లేదా ?... పోనీ వీటికి 'కథా కవిత... నాటక కవిత... నవలా కవిత' అని పేరు పెడదామంటే మళ్ళీ ప్రక్రియలు మీద ప్రక్రియలు పుట్టుకొస్తాయే - అంతెక్కడ ?

కవిత్వానికి అర్థం సంకుచిత పరచడంవల్ల ఇనన్నిగకరకాల ప్రక్రియలుగా విభజించబడ్డాయి. అర్థం విశాలం చేసుకున్నప్పుడు అన్నీ ఒక్కటే... అదే కవిత్వం శ్రీశ్రీ 'కదిలేదీ ..కదిలిం

చేదీగా! 'కుక్కపిల్లా... అగ్గిపుల్లా...' ఇత్యాది దీన్ని మనకు గుర్తు చేయడంలేదా? — సామాన్యుల విషయం అటుంచి తత్వాన్వేషణ చేయబూనిన విమర్శకుడు సైతం ఇట్టి పరిగణనకు సిద్ధపడడం క్షమార్హం కాని నేరం.

పాఠకుడి భావనాశక్తి ననుసరించి — అతిపేలవంగా తోచే మాటల్లో మహోన్నతమైన కవితాస్ఫూర్తి తోస్తుంది-ఉదాహరణకు గురజాడ దేశభక్తిగేయం... 'అందులో కవితా లక్షణాల్లేవు... అసలు గురజాడ కవే కాదు పొమ్మన్నారు, కవిత్వానికి గిరిగీసుకొని కూర్చున్న వాళ్ళు. ఆ ఒక్క గేయాన్నిబట్టి, అందులోనూ మొదటి నాలుగు పాదాలతోనే—గురజాడను మహాకవిగా ఆరాధించేవాళ్ళున్నారు—

2) ప్రాచీన ఆలంకారికులది సాహిత్యంలో కూలంకషమైన పరిశోధన — వారు స్పృశించని సారస్వత లక్షణమే లేదనిపిస్తుంది. వారి సిద్ధాంతాల పరిధి అతి విశాలం—అలాంటిది వారి నధిగమించి మనం చెప్పేదేముంటుంది అనిపిస్తుంది? అలాగని పరిశీలన జరుగ రాదనికాదు. అది సరియైనది కావాలి. ఆ పరిశీలన వెనుక ఒక ప్రమాణం ఉందని మరువరాదు—'తెలగాణ...కోటి రత్నాలవీణ' అన్న చోట ప్రాచీనులు చెప్పిన లక్షణా వృత్తిని వర్తింపజేసి అర్థాన్ని చెప్పుకోవాలి —

3) సుదర్శనంగారు రసమనీ, ధ్వని యని ప్రాచీనులు యేదైతే భావించారో అదే 'సృజన' అన్నారు — కానీ 'రచయిత దృక్పథంనుంచి ఉద్భూతమైన సృజనశక్తి ఎలా అభివ్యక్తమవు తున్నదో విచారించే ప్రయత్నం వారు చేయలేదు'అంటూ ప్రాచీనులతో విభేదించారు. నిజమే! తెలుసు. విమర్శ ఇప్పుడిప్పుడే అడుగు పెడు తున్న నూత్నమార్గం అది. సందేహం లేదు — రచయితయొక్క మనో విశ్లేషణద్వారా రచనను విమర్శించడం అది —

కానీ వారి వివరణలో 'సామాజిక చైతన్యం...వ్యక్తి చైతన్యం ... సాహిత్యోద్యమ రథ సారథ్యం...' అంటూ ఏవేవో ముడి పెట్టి సృజనాత్మక శక్తిని కొందరికే పరిమితం చేయబోగా, ఆమాటకు అర్థం సంకుచితమై వివాదాస్పదమయింది. సృజనాత్మక శక్తికి నిరూ పణలుగా వారు పేర్కొన్న లక్షణాలు లేని శ్రీనాథుడు, తిరుపతి కవులు ఆయా కాలాలలో సాహిత్యోద్యమ కర్తలుగానే భావింప బడ్డారు. పైగా కవికి ఉద్యమ సారథ్యం సమాజం ఇవ్వదు - సామాజిక చైతన్యం ప్రతిబింబించడం సృజనయొక్క అనేక లక్షణాల్లో ఒకటి-సమస్తమూ అదే కాదు—

4) వీరి సిద్ధాంతానికీ - నిరూపణకూ పొత్తు కుదరలేదు - వీరి దృష్టిలో శ్రీశ్రీ, కృష్ణశాస్త్రి సృజనాత్మక శక్తిగల రచయితలు.

'ఒక రచయితగానీ — కవిగానీ — పూర్వరచయితల ప్రభావం నుంచి, ప్రతిభావంతులైన సమకాలికుల ఛాయలనుండి తనను తాను రక్షించుకొని తనదైన వ్యక్తిత్వపు ముద్రను, భాషమీద, ప్రక్రియ మీద, శిల్పంమీదా చూప గలిగితే తప్ప అతని రచనలోని సృజనాత్మక శక్తి నిరూపణ కాదు, అని వీరి వివరణ —

గురజాడ అనే మహాకవివల్ల అప్పటికే వ్యావహారిక భాష — ఛందోస్వేచ్ఛ — వస్తు నూతనత్వం, తెలుగు కవిత్వానికి సంక్రమిం చాయి—పైగా, అతని వెనుక సమాజస్థితి తప్ప మరే పూర్వ కవుల ప్రేరణా లేదు. గురజాడ కవితలో అక్కడక్కడ కనిపించే భావ కవితను, ఆత్మాశ్రయ రీతిని కృష్ణశాస్త్రి విపులీకరించాడు. ఆయన లక్ష్యాన్ని, భాషనూ, అడుగుజాడగా చేసుకొని ఛందస్సును పెంచు కుని ముందడుగు వేసాడు శ్రీశ్రీ — కనుక సృజనాత్మక రచయిత ఎవరు కావాలి?

ప్రధానంగా సృజనాత్మక కవికి ఉండవలసినదిగా 'భావనా తీవ్రత' అనీ, ఇతర కవులనుండి అతనిని వేరుచేసేది అదేనని వీరి అభిప్రాయంగా గోచరిస్తున్నది. శ్రీ శ్రీ, కృష్ణశాస్త్రి, కవితలలో భావనా తీవ్రత మాత్రమే కనిపించగా, గురజాడలో భావనా తీవ్ర తను సంయమనం చేసుకొనే తత్వదృష్టి, ఋషిత్వమూ కనిపి స్తాయి-ఆయన ఉద్యమ కవులను మాత్రమే ఉత్తేజపరచే ప్రథమ శ్రేణి ఉద్యమకవి—శ్రీశ్రీ, కృష్ణశాస్త్రి వంటివారు ద్వితీయశ్రేణి ఉద్యమ కవులు—అని నా తీర్మానం—

4) ఇక కవిత్వం ప్రయత్న సాధ్యమా? అప్రయత్న జన్యమా? సుదర్శనంగారి ఆంతర్యం బోధపడడంలేదు—సృజనాత్మక రచయిత కాదలచినవాడు - తనదైన వ్యక్తిత్వపు ముద్రను భాషమీద.. ప్రక్రియ మీద... అంటూ కొన్ని మాటలు వ్రాసారు—అనగా అంతవరకు వస్తున్న తెలుగు, సంస్కృతం వదలి తెలుగు... ఇంగ్లీషో ... లేదా తెలుగు...హిందీయో ... లేదా మరో భాషో కలిపి క్రొత్త భాషను సృష్టించుకోవాలి. ఎవ్వరూ స్పృశించని ప్రక్రియను వెదికో... లేదా తయారు చేసుకొనో—అప్పుడు కవితా రచన మొదలుపెట్టాలి— ప్రక్రియను, భాషను కవిత్వం అనుసరించాలా? లేదా కవిత్వాన్ని అవి అనుసరించాలా? ప్రయత్న సాధ్యమయిన కవిత సృజనాత్మక కవిత అనిపించుకోదు—

5) 'కళ అంతా అనుకరణే — మౌలికతకు వల్లమాలిన ప్రాముఖ్యం ఇయ్యరాదు' అన్న తిరుమలరావుగారి మాటల్లో ఎంతో వాస్తవం ఉంది. సుదర్శనంగారు 'ఇతర కవుల ప్రభావంనుంచి బైట పడి కవిగా తనదైన రీతి సాధించుకోడానికి... అంటూ కవినుంచి సమకాలిక, పూర్వకాలిక ప్రభావాలు వేరుచేయడం శస్త్రచికిత్స చేసి తొలగించినంత తేలిగ్గా భావించారు. ఏ వ్యక్తి కవితాస్రష్ట (వీరన్న సృజనాత్మక రచయిత) పూర్వకవుల ప్రభావంనుంచి అత్యంతమూ వేరు కాలేడు— అవే మౌలిక లక్షణాల పునాదిపై, అదే పరిధిలో సుదూరం పయనించగలడు—ఎలాగంటే దారపుకొస మన చేతిలోనే ఉంటుంది—గాలిపటం మేఘాలు తాకుతూ ఎగురుతుంది.గాలిపటానికీ, దారానికీ సంబంధంవలె, పూర్వ, సమకాలిక కవుల ప్రభావం ఏ వ్యక్తి కవిమీదనైనా అస్పష్టంగా భాసించినా—అవాస్తవంకాదు—

సుదర్శనంగారి 'సృజన' సాహిత్య విమర్శలో ఆవిష్కరింపదగ్గ నూత్న మార్గాన్ని సూచిస్తున్నంతవరకు ప్రయోజనకారేగానీ—అర్థం

సంకుచితమై అనుచితమైన ప్రతిపాదనలకు దారితీసిందని నా అభిప్రాయం.

— శ్రీ కల్లూరి భాస్కర్

# "సాహిత్యంలో సృజన - సాహిత్య విమర్శలో నిహిలిజం"

*(చర్చా వేదిక)*

ఆగస్టు 1976 "భారతి"లో ఆర్. ఎస్ సుదర్శనంగారు (ఆర్. ఎస్.) "సాహిత్యంలో సృజన" అనే వ్యాసంలో ఒక ఆలంకారిక సిద్ధాంతం పతిపాదించారు. దానిలోని అలాక్షణికతను చూపిస్తూ నవంబరు 1976 'భారతి'లోనే నొక వ్యాసం వ్రాసితిని. ఫిబ్రవరి 1977 'భారతి'లో శ్రీ జి. సత్యనారాయణమూర్తి గారూ, 'సాహిత్య విద్యార్థి' గారూ నా వ్యాసంపై ఖండనలు వెలువరించిరి. జి. స. నా. గారు నాకు వైదుష్యం లేదన్నారు. నాది సాహిత్య విమర్శలో 'నిహిలిజం' అనవచ్చునన్నారు. మొదటివానికి కభివందనములు రెండవదానికి అభినందనములు తెల్పుకొనుచున్నాను. దాశరథిగారి "నా తెలంగాణ కోటి రత్నాలవీణ"లో "సృజన" ఉంది అన్న ఆర్. ఎస్ గారి నిగమనాన్ని వీరు బలపరుస్తున్నారు. ఇందులో ఉపమ, అతిశయోక్తి అనే అలంకారాలు తప్ప వేరేగుణం లేదని నా వాదం. పై కవితను మరీ పరిశీలించితిని. ఇప్పుడు దీనిలో కొన్ని లోపాలూ, అసమంజసాలు కూడా కన్పడ్డాయి. "గాణ......వీణ" అను ప్రాసలు. అను ప్రాసలంకల కవిత్వం, ఏ కొలబద్దతో కొల్చినా, తగ్గు రకపుదే. ఇంకొక లోపమేమంటే, అన్ప్రాసలో "ఆణ . ఈణ" అనే స్వరాలున్నవి అచ్చులు మారినవి. "నా తెలంగాణ కోటిరత్నాల వాణ" అని యుండి ఉంటే బాగు. వీణకు వేదంలో వాణ అని ఉంది. ఇంకొక అసమంజసం ఏమీ అంటే, వీణ గొప్పతనం దాని తంత్రుల సంఖ్యబట్టీ, మెట్ల నిర్మాణంబట్టీ ఉంటుందికాని, దానికి పొదుగబడిన రత్నాలబట్టి ఉండదు. బృహతీవీణ, మహతీవీణ, కచ్ఛపవీణ, గజవీణ, రుద్రవీణ, విచిత్రవీణ, రావణవీణ, సరస్వతీవీణల వైశిష్ట్యం వానితంతులు, మెట్లబట్టీ ఉంది. రత్నాలు పొదుగబడిన వీణ. స్మగ్లరులకూ, రత్నాల వర్తకులకూ అమ్మెడు సరుకగునేమో కాని, సంగీతజ్ఞులకు ఆరాధ్యవస్తువు కాజాలదు. ఇదీ "నా తెలంగాణ.. వీణ"లోని సృజనా విలసనం!

ఇంక, "సాహిత్య విద్యార్థి"గారు నా చర్చ కొండవీటి చేంతాడు అన్నారు. ఇప్పటి విద్యార్థులందరికివలెనే వీరికీ ఆలంకార చర్చన్నా, సాహిత్య శాస్త్ర చర్చన్నా "బోరు"కొడుతుంది. దర్శన సూత్రచర్చ అంటే ఏమనుకొన్నారో వీరు. న్యాయదర్శనంలోని సూత్రములలోని అక్షరాల సంఖ్యమీద కూడ సుదీర్ఘ చర్చలున్నాయి!

నేను "సృజన" అంటే ఎలా వుంటుందో తెలియక తికమక పడుచున్నానన్నారు వీరు. ఇదినిజమే. సాహిత్య పరసిద్ధాంతాలు "లేబిల్"లు వేసికొని శుభ్రంగా, ఫార్మలిను ద్రవంలో నిల్వఉన్న జంతువుల నమూనాలవలె, గడ్డితో నింపబడి గోడకు వ్రేలాడే జంతువుల దేహముల వలె, వీరి సాహిత్యపు మ్యూజియంలో ఉంటాయి. నాదా, నజీవమైన, యథార్థమైన, చైతన్యవంతమైన డిబ్బీలాండు. ఇందు అంతా అద్భుతాలూ, తికమకలే. దీనికి నిదర్శనం ఆర్. ఎస్. సుదర్శనంగారి "సృజన" పై ఈ పునఃపరిశీలన.

నిర్వచనం ఇది :

"మాటలకందని సంశ్లిష్టమైన అనుభూతిని మాటలద్వారా అందజేసే ప్రయత్నమే సాహిత్యంలో సృజన".

దీనిని ప్రక్రియా విశ్లేషణం (Functional analysis) చేస్తాము.

1. సాహిత్యమంతా సృజనే కాబట్టి సాహిత్యంలో సృజనచర్విత చర్వణమేఅవుతుంది. పుట్టిన పిల్లలంతాసృజనలే. అందులోకురూపులూ, సురూపులు, తెలివిగలవారు, అది లేనివారూ ఉండవచ్చు. సాహిత్యం మంచిది కావచ్చు, చెడ్డదికావచ్చు. అయినా ప్రతి కవిత ఒక సృజనయే. అన్ని కుండలూ ఒకేరకంగాఉన్నా అన్నీ సృజనలే. ఏవంచ, ఒకటి సాధారణముంం కల్పనదికాగా, ఇంకొకటి సందిమూలికలదిగ ఉండవచ్చు. ఈ గుణానినే "మౌలికత" (Originality) అంటారు. ప్రతీ కవిత సృజన అవుతుందికాని ప్రతి సృజనలో మౌలికత ఉండక పోవచ్చును.

2. పై నిర్వచనంబట్టి సాహిత్యం (కవిత్వం) అనేది నిదానముగ, ప్రయత్న పూర్వకంగా, "నేను అందజేయవలెను" అనే self.consciousnessతో చేసే పనివలె కన్పడుతూంది. కాని కవిత్వపు ఊట (Springs of Poetry)కు మూలం ఇదికాదు. కవిత్వం భావావేశం (Inspiration)వలన అప్రయత్నకంగా (Spontaneeus) వచ్చే భావపరంపర. కవులకు తాము చెబుతుండేదీ తెలియదు, తామేమి చెబుతూండేదీ తెలియకపోవచ్చును.

వాల్మీకి "మానిషాద..." చెప్పిన తర్వాత ఆశ్చర్యపోతాడు. ఇదేమి నేను శోకిస్తూఉంటే, శ్లోకం వచ్చింది! అరే! శ్లోకం పాద బద్ధంగా, అక్షరసమంగా, తంత్రీలయ సమన్వితంగాఉందే అంటాడు. వాల్మీకి యే "అందజేసే ప్రయత్నమూ" చేయలేదు. అది అప్రయత్న మూలకం. అతని శ్లోకం ముందున్న నిషాదునికిగాని, వెనుకున్న శిష్యునికి గాని "అందలేదు". కవిత్వం భావావేశఫలితం కాబట్టి, అందు "నేను అందజేస్తున్నా"ననే సంబుద్ధి వుండదు. పోతన "పలికించెడు వాడు రామభద్రుండట" అంటాడు. మిల్టను Paradise Lost రచనారంభంలో "What in me is dark, Illumine" అని భగవంతుని ప్రార్థిస్తాడు. మనపోతనవలెనే Sing, Heavenly Muse అంటాడు. "రామాయణ కల్పవృక్షము" ఆరంభంలో విశ్వనాథ, "నన్నయ్యయు, తిక్కన్నయు నన్నావేశించిరి" అన్నాడు. A. E. Housman తన Name and Nature of Poetry (1932) అనే కవిత్వ తత్త్వాన్ని చెప్పే వ్యాసంలో, కవితాపిర్భావాన్ని, ఎచ్చరిక

లేనప్పటి జ్వరబాధతో పోలుస్తాడు అందుకే నేనంటాను, కవిత్వం అనర్గళంగా, అప్రయత్నంగా, అనహంకారంగా వచ్చే Inspired flow of noble ideas యే కాని అందరాని అనుభూతిని ఒక్కొక్క మాటలోనే పట్టిచేసిన వేట వంటిదికాదు అని. అలాకాకుంటే "అగ్ని మీళే పురోహితం," "మానిషాద","పూతమెఱుంగులున్", "గుత్తింబుతెలుగుట్కి," "ఖిడాదారంగదభంగ సంగర...", Iliad, Divine Comedy, బ్లేకు కవిత్వమంతా Piers Plowman, Pilgrim's Progress, వేమన సర్వజ్ఞ వళ్లువారుల కవిత్వం మున్నగువాటి ఆవిర్భావాన్నెట్లా explain చేయగలం? Religious poetry యే కాదు, సెక్యులర్ సాహిత్యాలు కూడా ఇదే ఉత్పత్తి క్రమంకల్గి ఉంటాయి. శాఫో (గ్రీకు కవయిత్రి) గీతాలు, జేమ్సుజాయిస్ Ulysses, లూయీకరోల్ Alice in the Wonder land, శ్రీశ్రీ "ఓ కవితా...", మొక్కపాటి "బారిస్టరు పార్వతీశం" మొదటిభాగం, దిగంబరకవుల ప్రారంభంనాటి కవిత ఉదాహరణాలు.

3. "... సంశ్లిష్టమైన అనుభూతిని..." అనడంలో, "చెప్పే కవికి సంశ్లిష్టమై అనుభూతిని" అనే అర్థంఉంది. మన కవికి అనుభూతి రావలెను, దానిని మాటలద్వారా అందజేయడానికతడు సరఫరాదారు కావలెను, కవికి అనుభూతి సంశ్లిష్టంకాలేదు కవిత్వం లేదుపో. మహాకవుల రచనలు పరిశీలిస్తే కవికి అనుభూతి కలుగకున్నా, మహారచనలు వచ్చినట్లు సువిదితం కాగలదు. అనుభూతి (అంటే Experience) సర్వంత్యజించి, జితేంద్రియులై, బుషులైన మన కవులు (పురాణేతిహాసాలు వ్రాసిన ప్రాచీనులు). కామక్రోధాది అనుభూతులను సంశ్లిష్టం చేసుకొని కవిత్వం వ్రాసిరా ? తనకేమి అనుభూతి లేకున్నా, తానుచెప్పే కవిత్వంలో ఇమిడియున్న అనుభూతిని పాఠకునికి లేదా శ్రోతకు కలుగునట్లు చేయుటే కదా కవిత్వమహత్త్వం? అరిస్టాటిలు 'పొయెటిక్స్' తర్వాత అంతటి గొప్ప 'వాట్ ఈజ్ ఆర్ట్' వ్రాసిన టాల్‌స్టాయి ఒక ఉదాహరణ ఇస్తాడు. ఒకడు నీ కాళ్ళమునివ్రేళ్ళు త్రొక్కినాడు. నీకు కొంచెం నొప్పి అయినది. దానిని తెల్పేందుకు "అయ్యో" అని అఱచి అందఱి సానుభూతిని పొందడం కళ. నీ కాళ్ల మునివ్రేళ్లు త్రొక్కబడకున్ననూ, "అయ్యో" అని అఱచి అందఱి సానుభూతిని పొందడం ఇంకా గొప్పకళ" అని కవిలో అనుభూతి సంశ్లిష్టం కానక్కరలేకుండానే సాహిత్యాన్ని సృష్టించవచ్చును, కనుక ఆర్. ఎస్. గారి నిర్వచనం కవితోత్పత్తి రహస్యాన్ని సూచించదు.

4. సాహిత్య సాఫల్యానికి రెండు దశలున్నాయి.

(i) ప్రకటన (Expression) (ii) పాఠకుని లేదా శ్రోత అనుభవంలోకి తెచ్చుట (Communication).

వీటి స్వభావం తెల్పుతాను.

కీట్సుకవి ఒకానొక కావ్యం పరిశీలిస్తాము.

Eve of Saint Agnes అను కావ్యారంభం

"St. Agnes' Eve - Ah, bitter chill it was!" అని ఉంది.

మొదటిభాగం expression, రెండవది Communication.

ఇంకొక మచ్చు :

కోతి తెచ్చి పట్టె కొత్త పుట్టము గట్టి
కొండ్రముచ్చులెల్ల కొలిచినట్లు

ఇది expression భాగం. కవి ఇదంతా ఎందుకు చెబుతున్నాడో మనకు తెలియదు. ఇప్పుడు వస్తుంది. Communication అనే కవి ఆంతర్యం "నీతిహీనునొద్ద నిర్భాగ్యులుందురు." Poetic expression is now communicated, ఇవి ఈ క్రమంలోనే ఉండనక్కరలేదు. "వచ్చెడువాడు ఫల్గుణుడు అవశ్యము గెల్తు మసంగరాదు"లో మొదటనే poetic communication ఉండుట గమనింపదగినది. ఒక కవితలోని Communicative failure వలననే ఆ కవిత ఆవిర్భవించేనాడు ఉపేక్షింపబడి తర్వాత మరునాడో, లేక కొన్నిశతాబ్దాలతర్వాతో కాల దేశ పాత్రలు మారినప్పుడు మహారచనగా గుర్తింపబడుట, పింగళి సూరన, వేమన కవిత లిట్టివి. కవిత్వంలో Communication వైఫల్యం చెందకుండా ఉండేందుకే రసం, ధ్వని, అలంకారం ఇత్యాది శేషజాలు, వ్యంజనములు ఉపయోగిస్తాడు కవి. రాగి సంకటిలోనికి దిగుటకు చింతతొక్కు. కొరివికారం ఉపయోగించినా, తలిమ్మా రెండూ సాధకాలే. ముఖ్యాహారం రాగి సంకటే రసాదులున్నందున సృజన అనే గుణం ఉందని అనుకోవడం పొరపాటు. ఈ అర్థంతోనే నేను రసం, ధ్వని వక్రోక్తులప్తై చెణుకు విసిరినాను. ఇవి కవిత్వంలో ఉండాలట. ఆలంకారిక చర్చలో మాత్రం ఉండరాదన్నట్లు కన్నె రజేసే పూర్వపక్షీయుల మనస్తత్వం విశ్లేషణార్హం. నే వనేదల్లా ఒక్కటే. కవిత్వమునకు రసాదులు గౌణములే కాని ప్రధానంకాదూ అనీ, సాహిత్యం (కవిత్వం) అంతా సృజనే అనీ, Creativity అనేది లేదనీ, ఉండేది, Creation యే అనీస్నీ దేన్ని Creativity (సృజన) అని అంటున్నారో ఏజాని కది Originality (మౌలికత) అనిస్నీ.

5. ఆర్. ఎస్. గారి. నిర్వచనంలో, ఒక సాహిత్య ఖండికలో మాటలద్వారా అందజేసే ప్రయత్నం ఎంతవరకు సఫలమైందని కొల్చుటకు కొలమానంగాని. అందులో సృజన ఉందో లేదో తేల్చేందుకు తేజాపు కానీ లేదు. ఆర్. ఎస్. గారికి నచ్చితే సృజన ఉంది వారికి నచ్చకపోతే కవితలో సృజన ఉండదు అని అనుకోనవలసి వస్తుంది. ఆర్. ఎస్. సిద్ధాంతానుయాయులు సాహిత్యంలో ఈ విధంగా "ఇంపీరియలిజం"ను తెస్తున్నారు. వారిది సాహిత్యంలో "ఇంపీరియలిజం" అయితే నాది సాహిత్యంలో "నిహిలిజం" అవుతుంది. ఇది చరిత్రగతి తార్కికం. (Dialectics of History)

ఇంతవరకు నిర్వచనాన్ని ఔపయోగిక దృక్పథంనుండి చూచినాము. ఇప్పుడు నిర్మాణ అకృతి విశ్లేషణ (Structural and formalistic analysis) చేస్తాము.

6. "సంశ్లిష్టమైన" అంటే ఏమి? "అనుభూతి" దేంతో సంశ్లిష్టమైంది? "సంశ్లిష్టమైన" తీసివేసి నిర్వచనాన్ని ఇట్లా వ్రాస్తాము:

"మాటల క దని అనుభూతిని మాటలద్వారా ... సృజన."

"అనుభూతి" అనే గావుమాటను తీసివేసి, దాని స్థానంలో సర్వనామం వేసి ఇట్లా వ్రాస్తాను: "మాటలకందని దానిని మాటల ద్వారా... సృజన."

దీన్నిబట్టి సాహిత్యంయొక్కగాని అందులోఉన్నదనే సృజన యొక్కగాని స్వరూపస్వభావాలు స్పష్టమైనాయా? పైగా స్వవచో విఘాతంకూడానూ. మాటలకందనిది అనుభూతి. మాటలతో చెప్పబడేది సృజన. మాటలకందకుంటే అనుభూతి. మాటలకందితే సృజన. ప్రశ్నకు ఉత్తరమీయకుండా ప్రశ్నే ఉత్తరం అడగడం ఇది. Begging the question. నిర్వచనాన్ని రెండుభాగాలుగా విభజింప వచ్చును.

"మాటలకందని సంశ్లిష్టమైన అనుభూతిని మాటలద్వారా" ఇది మొదటి భాగం.

ఇక రెండవ భాగం.

"అందజేయడానికి చేసే ప్రయత్నమే సాహిత్యంలో సృజన."

మొదటిభాగంలో ఒకే టరం ("మాట") రెండు ప్రయోజనాలకుపయోగింపబడ్డది.

రెండవభాగంలో రెండు టరంలు ("ప్రయత్నం", "సృజన") ఒకే పయోజనానికుపయోగింపబడ్డాయి. "సృజన" అంటే ఏమిటి? అదే. "ప్రయత్నం" అని ఉత్తరం. ఇవటు "ప్రయత్నం" అంటే ఏమిటి? Force is nothing but energy అంటే ఎంత అర్థవంతంగా ఉంటుందో "... ... ప్రయత్నం (సాహిత్యంలో) సృజన" అంటే అంతే తెలివిడి కలుగుతుంది.

ఈవిధంగా సూత్ర నిర్మాణం ఆకృతులు అశాస్త్రీయంగా అయోమయంగా ఉన్నాయి. నిర్వచనానికి తర్వాతి వాక్యంలో తగిలించబడే "నిత్యనూతనత్వం", "నవ నవోన్మేషిత్వం" అనేపదాలు అమాయకులను భ్రమగొల్పేవేకాని సాహిత్య మర్మమును తెలిపేవికావు.

7. ఆర్. ఎస్. గారి నిర్వచనంలోని "మాటలకందని అనుభూతి" తత్వం ఆలోచిస్తే, ఇది, రొమాంటిసిస్టుల Unrestricted flight of imagination వలె కన్పిస్తున్నది. అంటే వీరి నిర్వచనం రొమాంటిసిస్టు కవిత్వాని కన్వయించేందుకేర్పడినట్లు భావించవచ్చును. అభిజాత్య (Classical) యథార్థ (Realistic) కవిత్వాలకీ నిర్వచనం పొందదు. బ్రహ్మ పదార్థం తప్ప తక్కినన్నీ మాటల కందేవే. ఈ బ్రహ్మ పదార్థాన్ని మాత్రం వదిలారా మన వేదాంతులు?

"క్రతోస్మరకృతం స్మర" అంటాడు వేదాంతి. నన్ను మరచి పోవద్దు సుమా అని పరమాత్మున్ని హెచ్చరిస్తాడు. "వేదాహమేతం పురుషం మహాంతం" అని ఇంకొక ఋషి అంటాడు. దేవుణ్ణి చూచితిని అని గంతులు వేస్తాడు. ఆ దేవుడు సూర్యునివలె ఉంటాడంటాడు. మరొక వేదాంతి దేవుణ్ణి రుచి చూచాను అంటాడు. "నేతి నేతి" (అదికాదు ఇది కాదు) అంటూనే దేవుణ్ణి పట్టుకుంటాడు ఒక ఋషి.

8. ఆర్. ఎస్. గారి నిర్వచనం మాటలకందని అనుభూతి కన్వయిస్తుందని మాటవరుస కొప్పుకుందాం. మాటలకందే అనుభూతి సంగతేమిటి? మాటలకందే అనుభూతిని సృజనాత్మక సాహిత్యంలో అందజేయలేరా? అందజేయరాదా?

కొడుకు దుర్మరణం చెందాడు. తల్లి ఏడుస్తూంది. అప్పుడు తిక్కన "హాయను, ధర్మరాజ తనయాయను" అనే సుభద్రావిలాపం వ్రాసినాడు. వాడిన మాటలూ, అనుభూతీ అందేవే. అయినా ఇది మహా కవిత్వముగా భాసిస్తూ ఉందే! పాత సావాసగాళ్ళు ఒకచోట ఉండడంచూచి మణికంధరుడు "ఓహోహో మా బంధువ్యూహం బంతయును వచ్చినట్లయ్యె" (కళాపూర్ణోదయం) అంటాడు. ఇందలి అనుభూతి అందరికీ అందేదే ఐనా వించక్కగాఉందీ సాహిత్యం! పతనం జెంది కబోదియైన ఇడీపసరాజు నాటకాంతంలో తనకూతుండ్లను అక్కునచేర్చుకొంటూ, "నావంటి పాపం చేసేవాని కూతుండ్లని తెలిస్తే మిమ్మల్ని ఎవరు పెండ్లిచేసుకొంటారమ్మా" అని గోడాడినపుడు అతను అందరి తండ్రుల అనుభూతినే చెప్పుతున్నాడు. సాఫోక్లిసు అందరి కందే మాటల్లోనే చెప్పుతున్నాడు. "నీకూ నీవారు లేరు, నాకూ నావారులేరు, తెప్పమీద తేలిపోదాం పదర, చల్ మోహనరంగా" అనే గ్రామీణ నాయిక పలుకుల్లో మాటలకందని అనుభూతిలేదు అయినా ఇంతకంటె బాగా చెప్పిన విధమూలేదు. తనకు భిక్షం పెట్టేందుకు ఆలస్యంచేసిన గృహిణిపై కన్నెర్రజేస్తూ ఒక ముని "నీ మగడంత ఎక్కువె, మనిషులు బ్రాహ్మణులింత తక్కువె" (అరణ్యపర్వం-ఎఱ్ఱాప్రెగడ కవిత్వం) అంటాడు. ఇందను భూతి సామాన్యమే అయినా కవిత్వం అసామాన్యంగాఉంది. "భారతి" వారు స్థలమిస్తే కొన్ని పుటల ఉదాహరణా లివ్వగలను. "మాటల కందని" అనే షరతు అనవసరం. అప్పుడు ఆర్. ఎస్ గారి నిర్వచనం ఇట్లా తయారవుతుంది:

"అనుభూతిని మాటలద్వారా అందజేయడమే సాహిత్యంలో సృజన."

ఇది ఆలంకారిక సిద్ధాంతమేకాదు. ఎందుకంటే దీనిప్రకారం "నాకు తేలుకుట్టినట్లైంది" అనేది సాహిత్యమేకాక సృజనకూడ కల్గినదై ఉండవలసివచ్చును. సాహిత్యంలో ప్రత్యేకంగా కన్పించేది మాటలతీరు, పొందికలు. అనుభూతి సామాన్యమానవునికీ, కవికీ ఒకటే. ఇందుభేదంలేదు. ఇద్దరికీ భేదమెక్కడుందీ అంటే అందిన అనుభూతిని సామాన్యు డొకవిధంగానూ, కవి వేరొక విధంగానూ చెప్పుతారు.

9. ఇప్పుడు ఆర్. ఎస్. గారి నిర్వచనాన్ని ఇట్లా వ్రాయవలసి వస్తుంది:

"సంశ్లిష్టమైన అనుభూతిని నేనే మాటల కందని విధంగా అందజేసే ప్రయత్నమే సాహిత్యంలో సృజన" అంటే, అనుభూతి అందినా, దానిని ఫలానా మాటలోనేకాక వేరే మాటల్లో అంద

వీళ్లేని విధంగా చెప్పడమే సాహిత్యంలో సృజన – సృజనను నేనొప్పుకోను కాన – సాహిత్యం అవుతుంది. సామెతలు, దేశీయాలు, మహాకవుల పలుకులు, ఆ స్వరూపంలో ఉంటే తప్ప సార్వజనీన, సార్వకాలిక సాహిత్యాలనిపించుకోలేవు. అందుకే టాగూరు "గీతాంజలి", ఫ్రెంచికవి బొడ్లేరు కవిత్వం (Fleurs du Mal) అనువాదం చేయడానికికూడా సాధ్యంకాదు * వీట్లల్లో. ఆమాటకు వస్తే, ఏ ఉత్తమ సాహిత్యంలోనైనా, మాటలకందని అనుభూతి కాక, అనుభూతికందని మాటలుంటాయి. ఒక ప్రాచీన శ్లోకార్థం ఇట్లుంటుంది: సామాన్యులమాటలు అర్థాన్ని అనుసరిస్తే, మహాకవుల మాటలనే అర్థం అనుసరిస్తుంది.

10. రసాదులుంటే సృజన అదేఉంటుంది అంటారా? రసం, ధ్వని, అలంకారం, గుణం, రీతి, ఔచిత్యం ఏవీ లేకుండానే కవిత్వం ఉండగలదు అనే నా వాదం. కవిత్వం ముందువచ్చిన చెవులు కాగా, సిద్ధాంతాలు తర్వాత వచ్చిన కొమ్ములు. ఈ ఆరు ఆలంకారిక వాదాలతో కవిత్వ తత్త్వం తెలిసికొనేందుకు ప్రయత్నించడం, ఆరుగురు గుడ్డివారు ఏనుగు అంటే ఏమో తెలిసికోవడం, మన అవగాహనార్థం, ప్రకటించడం వంటిది. ఇవేవీలేని మహా కవిత్వాలను దిక్సూచిగా ఇస్తాను.

"శ్రేణులై గట్టి నభోంతరాళమున పాఱెన్ బక్షులు"
ఇది స్వభావోక్త్యలంకారమని తప్పించుకొంటారా?

ఊరిబయట కాచుకుకూర్చున్న నలుని స్థితి వర్ణన:

"పురము వెలి మూడహోరాత్రములు వసించి
యున్న నలుపాలి కెవ్వరు నోడిరరుగ
జన విభుండైన పుష్కరు శాసనమున
కలికృత ద్యూత విద్వేష కారణమున"

(అరణ్య పర్వం)

తనను అడవిలో విడిచి, రథంలో పోతున్న లక్ష్మణునివైపు చూస్తూన్న సీత వర్ణన:

"రమణి మఱి కొంతవడి దాఁక రథముఁ జూచుఁ
దరుణి మఱికొంత సేపు కేతనముఁ జూచుఁ
గొంత మఱి మీద రథపరాగంబు సూచుఁ
బడఁతి మఱి యంతటను వట్టి బయలుసూచు."

(ఉత్తర రామాయణం)

మాటలకందే అనుభూతినే అందే మాటల్లోనే ఇంత గొప్ప కవిత్వాలు చెప్పినారే నన్నయ కంకంటులు! పైగా ఫోర్తుఫారం (ఇప్పటి 8వ క్లాసు) పిల్లకాయలు ఛందస్సును అయ్యవారు నేర్పుతూనే వ్రాసే తేట గీతలోనే వ్రాసినారే. "కరిటము" అనే ఛందస్సులో వ్రాయలేదే! ఈ కవితలు కవితా జైత్రయాత్రలు (Triumphs of poetic achievement) గ భాసిస్తున్నాయి. కంకంటి పద్యం ఒక ముఖ్య కవితాతత్త్వస్పర్శం చేసుకొనేందుకు ఉపకరిస్తుంది. అదేమిటంటే, నేను ఇంతకుముందునుంచీ చెప్తూవస్తున్న మౌలికత కంకంటి పద్యంలో మౌలికత లేదు! ఇది "రంగనాథ రామాయణం"లో రథంమీద రాము డడవికిపోయే దృశ్యాన్ని దశరథుడు తిలకించే వర్ణన అగు–

"తనసూను రథమటు తప్పక చూచి
యదియుఁ గానక ధూళి నటు చూచి చూచి
యదియు గానక బయలటు చూచి చూచి"

అనే కవిత్వానికి "ఇంప్రూవుమెంటు" మాత్రమే. దీని పర్యవసానమేమి? "మౌలికత" లేకుంటే కూడ మహాకవిత కావచ్చునవే! ఉండవచ్చునవే!

11. రసము, ధ్వని ఇత్యాదులు విశ్లేషణా సాధనాలే (Analytical tools) కాని, సాహిత్య సృష్టికేర్పడ్డ geneలు (జీవకణాలు) కాదు. దేహాన్ని రక్తం, మాంసం ఎముకలు అని విభజించి గుర్తించినంతమాత్రాన రక్తం, మాంసం, ఎముకలు తెచ్చి ఒక మూస (Mould)లో పోసిన, జీవద్దేహంఅవుతుందా? దేహమంటే ఏమి? దేహాన్ని చైతన్యవంతంచేసే అదృశ్య, అవ్యక్త, అకాల అనిర్వచనీయ శక్తి ఏది? ఇట్టిదానే నేను "కవిత్వంలోని కిటుకు" అన్నాను. నేనే కాదు "ధ్వని"కారు డానందవర్ధనుడూ ఇట్టే అన్నాడు. అంతా తెలిసింది అనుకొన్న తర్వాత మళ్ళీ మహాకవుల వాణిలో మనకందకుండా పోతూవుండే వస్తువేదో ఉంటుంది అంటాడు.

ప్రతీయమానం పునరన్య దేవ
వస్త్వస్తి వాణీషు మహాకవీనాం
యత్ తత్ ప్రసిద్ధావయవాతిరిక్తం
విభాతి లావణ్య మివాంగనాసు

(ధ్వన్యాలోకం)

ఇట్లన్నందుకు ఆనంద వర్ధనునిపై చూపే గౌరవభావం, అదే అన్నా పై ఓర్మిభావాన్నైనా చూపగూడదా మన సాహితీ సహృదయులు? వ్యాస వాల్మీకాదులను చెడామడా తిట్టితే "కిమక్కు" మనకుండా ఉండే మన సాహితీ విద్యార్థులు ఆలంకారిక సిద్ధాంతాలను విమర్శిస్తే చాలు ఏరుచుక పడుతారు. ఈ ఆలంకారికులేమి మహర్షులా? వారి సిద్ధాంతాలేమి ఉపనిషత్తులా? ఒక ఆలంకారికునిపై ఇంకొకడు ఖండనలు వ్రాయలేదా? "ధ్వని" సిద్ధాంతపు బండవాళ్ళాన్ని "వ్యక్తి వివేక"కారుడు బయటపెట్టలేదా?

12. మనమెన్ని సిద్ధాంతపు సాలెగూళ్ళనైనా నిర్మించినా, కవిత్వపు కిటుకును పట్టలేం. ఇది సాహిత్యవిమర్శలో "నిహిలిజం" అంటారా? నాకేమీ అభ్యంతరంలేదు. నా విమర్శ, "నిహిలిజం" కావడానికి గర్వపడుతూన్నాను. ప్రపంచ విశ్వవిద్యాలయాలలో ప్రొఫె,

* వీని కనువాదాలు లేవనికాదు, చాలానేఉన్నాయి. దేన్లోనూ మూలంలోఉండే సౌందర్యం రాలేదు. ఎందువేత? అనుభూతి మాటలకందకపోవుటవల్లకాదు మూలాలలోని మాటలకంటే వేరే మాటలు సరిపోవుటలేదు కావున.

టర్గెనెవ్, బకునిన్, కోపాట్కిన్, టాల్‌స్టాయి మున్నగువారి "నిహిలిజం" ప్రముఖపాత్ర వహించింది వారి ప్రకారం, చట్టాలు, రూల్సు మానవుని సహజ హక్కైన స్వాతంత్ర్యాన్ని అవరోధింప లేవు. అటులనే వారి ప్రకారం కవిత్వానికి నియమాలు, రూల్సు, అలంకారిక సిద్ధాంతాలు చెల్లవు. కవిత్వం స్వతంత్రం (independent) సంపూర్ణం, (Complete) మరియూ స్వీయం నిర్ణయాధికారం (autonomous) యుక్తం.

— శ్రీ సర్దేశాయి తిరుమలరావు

## ప్రాచీన అద్దంకి: ఈనాటి పరిశీలన:

'అద్దడు - అంకి' అనే దంపతులు ప్రాచీన అద్దంకి పురాన్ని నిర్మించిన ఆది దంపతులుగా ఇక్కడి ప్రజలు భావిస్తారు. 'దర్శిణపురి' అనే వేరే నామాంతరం అద్దంకికి ఉన్నట్లు తెలుస్తున్నది. వీటి కన్నిటికీ చారిత్రక ఆధారాలు లేకపోయినా ప్రజల నానుడిని, అనాదిగా అనుకుంటున్న సంగతులను అంత తేలికగా త్రోసివేయ లేముకదా !

ఈ పట్టణ పరిసర వాతావరణం దివ్యంగాఉండి స్వేచ్ఛగా పరవళ్ళు త్రొక్కుతూ, సుళ్ళు తిరుగుతూ ప్రవహించే బ్రహ్మకుండి[1] నదీతీరంలో చల్లని పిల్లవాయువులను ఆస్వాదిస్తూ ప్రకృతి ప్రసాదించిన 'శాంతినికేతనం'గా భావించి కవులు అనేక కావ్యాలను వెలువరించి ధన్యులైనారు.

ఆంధ్రవాఙ్మయ చరిత్రలో అద్దంకికి చాల ప్రాముఖ్యంవుంది. నన్నయగారికి పూర్వం తెలుగులో మొట్టమొదటి పద్యశాసనం యీ అద్దంకి శిలాశాసనంగా పరిశోధకులు గుర్తించారు. గుణగ విజయాదిత్యుడి సేనాని పాండురంగడు ఆంధ్రభాషా పోషకుల్లో ప్రథముడని[2] ఈ అద్దంకి శాసనాన్ని రచించిన అజ్ఞాతనామధేయుడే ప్రథమాంధ్ర కవి అని అంటే అతిశయోక్తి కాదు.

"కవిత పుట్టిల్లు వెన్నెలకంటి యిల్లు" అని ప్రసిద్ధిగాంచి రాజులచే సైతం నమస్కరింపబడే వెన్నెలకంటి వారు యీ గ్రామస్థులే !

స్వరాష్ట్రాభిమానం, స్వదేశాభిమానం, స్వభాషాభిమానం గల అనేకమంది రాజులచే పరిపాలించబడిన సీమ అద్దంకి సీమ. వీరులు తమ వీరత్వంతో హైందవధర్మం కాపాడిన వీరభూమిగా అద్దంకిసీమ ప్రసిద్ధిగాంచింది. ప్రోలయ వేమారెడ్డి తమ్ముడు మల్లారెడ్డి మహా బలవంతుడు. నిరంతరం ఆంధ్ర ప్రాంత సముద్రతీరంలో 'పహరా' కాస్తూ సముద్రపుదొంగల్ని తరుముతూ ఉండేవాడని తెలుస్తున్నది. ఇతడు రాముడివెంట లక్ష్మణుని మాదిరి అన్నగార్ని వెన్నంటి తిరిగేవాడు. ఎర్రాప్రెగడను అన్నగారికి పరిచయంచేసి ఆంధ్రదేశానికి మేలుచేసిన సౌజన్యమూర్తి మల్లారెడ్డి. అందుకు తమ్ముడికి కృతజ్ఞత తెలియజేస్తూ — [3] "నాతమ్ముండు ఘనుండు మల్లరథీనాథుండు, నిన్నాతత ప్రీతోడన్ సముపేతుజేసి యెలమిం చేపట్టి మాకిచ్చుటన్" అని ప్రోలయ వేమారెడ్డి అంటాడు.

ఆనాటి అద్దంకికి ఈనాటి అద్దంకికీ పోలికేలేదు. ప్రస్తుతం అద్దంకికి మైలు దూరంలోవున్న 'బోడిగుడి' ఆనాటి అద్దంకి నగరానికి 'నడిబొడ్డు'గా ఉండేటంత పెద్దదిగా నగరం విస్తరించి ఉండేది. అది రాజవీధులు వేశ్యావాటికల గుడుల, గోపురాలతో [4] నిత్యకళ్యాణం పచ్చతోరణంగా విలసిల్లేదని అనవేమారెడ్డి మద్రాసు మ్యూజియం శాసనంవల్ల తెలుస్తున్నది.

రాజవీధులలో "ఎధూదిరేఖల విపోతములు" "గాజుల ముద్దుగుమ్మలు" ఆకుల నాసాని కొటికలపూడి గొల్ల పల్లలు" తటస్థ పడతారు. ఇక్కడ ముత్యాల వీధుల కూడా వున్నవి.

'ఆలి లేనివాడికి అద్దంకి' సామెత ఏనాటిదోగాని శ్రీనాథుడు అప్పటి సాంఘిక పరిస్థితులను తెలియజేస్తూ వ్రాసిన చాటుధారలు ఆనాటి ప్రభువుల రసికతకు మచ్చుతునకలు.

ఇక్కడ 80 ఎకరాల వైశాల్యంగల కోట[5] ఒకటి వుంది. దీన్ని హరిపాలుడు కట్టించాడని చెబుతారు. ఈ కోటలోనే వేరే ఒక చిన్న కోట వుంది దీనిని "చక్రప్ప పిల్లకోట" అంటారు. నేడు "పోతురాజు గండి" అని పిలువబడేది ఒకానొకప్పుడు కోట 'అగడ్త'గా ఉండేది. శత్రురాజులు వస్తున్నారని తెలిసినప్పుడు ఈ గండినిండా నీరు నింపి కోటను రక్షించుకొనేవారు. కోటను ఇప్పుడు స్పష్టంగా గుర్తించ వీలులేకున్నా బురుజులు, అగడ్తలు, నగర పాలికలు, సింహద్వారాలు మున్నగువాటిని నామమాత్రంగా గుర్తించడానికి వీలుంది. రెడ్డిరాజులు పుట్టమట్టితో నిర్మించిన గట్టి కోటలలో యిది మొట్టమొదటిది. కోట వాస్తుశాస్త్ర పద్ధతి ప్రకారం నిర్మించబడింది కోటకు ఒకవైపు నది తాకుతూ వెళ్ళడం, రాతి గొట్టాలద్వారా కోటలోపలి జంతువులకు నీటివసతులు చూస్తుంటే మనవారు 'ఇంజనీరింగు'లో ఏనాడో అభివృద్ధి సాధించి ఉన్నట్లు తోస్తుంది.

ఈ కోటను శ్రీకృష్ణదేవరాయలు శాలివాహనశకం 1437 (క్రీ. శ. 1515)లో వశపరచుకొన్నాడు. ఈ విషయాన్ని తెలిపే కథ ఒకటి యీ ప్రాంతంలో బహుళంగా వ్యాప్తిలో వుంది.

ఆనాటి అద్దంకి ప్రభువు అనపోతారెడ్డి విజయనగర రాజుల వల్ల తనకు ముప్పుతప్పదని గ్రహించాడు. తన తండ్రికాలంలోనే 'కొండవీడు' ఉపరాజధానిగా వుండేది. ఇక అద్దంకి చిన్నపట్టణము. అది బలిష్ఠమైన దుర్గంకాదని భావించి అన్నివిధాలా అనుకూలమైన కొండవీటి గిరిదుర్గమునకు చల్లగా మకాం మార్చివేశాడు దరిమిలా రాయలవారి సేన తిమ్మరుసుమంత్రి ఆధ్వర్యంక్రింద అద్దంకి కోటను ముట్టడించింది. కోట చిన్నదైనా అనుకున్నంత సులభంగా వశం కాలేదు. కోటలో నీటి ఎద్దడి, తినుబండారముల కొఱత లేకుండా యథావిధిగా పనులు సాగిపోవటం మంత్రిగార్ని ఆశ్చర్యపోయేటట్లు చేసింది. కారణం తెలిసికొని రండని వేగులను కోట వలువైపులా పంపడం జరిగింది మూడురోజులదాకా ముట్టడి సాగుతూనే వుంది. అంతలో ఆశ్చర్యకరమైన విషయం వేగులద్వారా అందింది. మామూలుగా ప్రతిరోజూ కోటలోనికి ఆవలివొడ్డునవున్న 'కొటికలపూడి' అనే గ్రామంనుండి గొల్లవారు పాలు, పెరుగు తెస్తూ ఉండేవారు ఒకరోజు పెరుగు తెస్తున్న గొల్లపిల్ల ముంతలోనుండి వెన్నముద్ద నదిలో జారిపోవడం జరిగింది. ఆమె యథా ప్రకారం కోటలో పాలు, పెరుగు యిచ్చి అక్కడేవున్న 'ఏనుగులబావి'వద్ద

ముంత కడుక్కుంటూ పుష్పపుడు అక్కడ వెన్నముద్ద తేలటం గమనించింది. ఈ రహస్యం అందరికీ చెప్పింది. విషయాన్ని తా చారులద్వారా సేకరించిన మంత్రి వెంటనే నదిలోనుండి కోటలోనికి వచ్చే 'గవాక్షం' మూసివేయించాడు. కోటలోని సేన నీటి ఎద్దడివల్ల కోటద్వారాలు తెరచి లొంగిపోవాల్సి వచ్చింది. ఆనాటినుండే "అవ పూవువంటి అద్దంకికోట అతివ చేతిలోన అది కోలుపోయె" అనేది ప్రజల నానుడిగా నిలిచిపోయింది.

ఈ ప్రాంతంలో జైనమతాన్ని అణగద్రొక్కి శైవమతం ప్రాబల్యంలోనికి వచ్చినట్లు కొన్ని దృష్టాంతాలు కన్పిస్తాయి. పూర్వం జైనారామాలుగా ఉండేవి శైవాలయాలుగా మారాయి. అద్దంకికి కొద్ది దూరంలోవున్న ధర్మవరం 6 జైన కేంద్రంగా వుండేది. అక్కడ అనేక శాసనాలు లభించాయి. 9వ శతాబ్దంలో యీ ప్రాంతాన్ని వేంగీచాళుక్యులు పాలించారు. వారిలో గుణగ విజయాదిత్యుడు, చాళుక్య భీముడు ముఖ్యమైనవారు. రాజవంశాలను బట్టి రాజ్యంలో మతప్రాబల్యం మారుతూ వుంటుందనటానికి యీ అద్దంకిని మంచి ఉదాహరణగా తీసుకోవచ్చు. ప్రస్తుతం యిప్పటి శిధిలావస్థలోవున్న వినాయకుడి గుడి ప్రాచీన జైనారామమును పోలి వుంది. అంతేకాకుండా యీ ఆలయం మిగతా అన్ని దేవాలయాలవలె కాక, కొన్ని కిటికీలను కలిగివుంది. ఎదురుగా రాతిపై అశ్వమేధ లాంఛన గుర్తునుకూడ చూడవచ్చును. అప్పటి రాజులు యజ్ఞయాగాలు చేసిన చిహ్నలు, వీరలాంఛనాలు, వరాహ లాంఛనాలు కూడా యీ దేవాలయ ఆవరణలో చూడవచ్చును. దీనివలన జైనులను పారద్రోలి శైవులు వినాయకుని విగ్రహం అందు ప్రతిష్ఠించి ఉంచవచ్చునని మనకు సులభంగా తెలుస్తుంది.

అనపోతారెడ్డి తన రాజధాని అద్దంకినుండి కొండవీటికి మార్చినదృష్ట్యా యిక్కడ పురావస్తు పరిశోధనలు అనవసరమని కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'అద్దంకి శిలాశాసనం' పరిశోధించటానికి వచ్చినపుడు అభిప్రాయపడ్డారు. కాని యీనాడు బయల్పడుతున్న ఆనాటి నాణాలు, ఆరామాలు, శాసనాలు మొదలైన వాటి దృష్ట్యా యీ ప్రాంతాన్ని పురావస్తు పరిశోధకులు పునః పరిశీలన చేయాల్సిన అవసరం ఎంతైనా వుంది.

## అధోజ్ఞాపికలు

1. గుండ్లకమ్మ.
2. నెల్లూరు మండల శాసనములు.
3. హరివంశము పీఠిక పేజీ III.
4. అనవేమారెడ్డి మద్రాసు మ్యూజియం శాసనం.
5. ఇవి 2 ఫ. పొడవు. 2 ఫ. చుట్టు 20 గజముల వెడల్పు 10. గ. ఎత్తు గలిగిన గోడలు గలిగివుంది. భారతీయ సంస్కృతి కోడాలి లక్ష్మీనారాయణ పేజి.52.
6. "ఆంధ్రుల చరిత్ర" కాశీనాధుని నాగేశ్వరరావు.

—శ్రీ ముప్పాళ్ల మధుసూధనరావు

# కథకుని అంతరంగ తరంగాలు

(61 వ పేజీ తరువాయి)

పిస్తా"... అమ్మా సరస్వతీ మాతా! 'లలిత లలిత కవితామహితా, అనుపమితా, అపరిమితా, కవితా ఓ కవితా!" వన్ను కరుణించు! మహాకవి శ్రీశ్రీ చెప్పినట్లుగానే "అందీ అందక పోయే నీ చేలాంచలముల విసరే కొనగాలులలో' సాహిత్య సృష్టి చేస్తా. ఈ నా ఆత్మగాడి పొగరణుస్తా... "హా! ఎవరని యెంచెదరో నన్ను! లోకభీకర పతిని" ... హబ్బ! ఈ దెబ్బతో ఆత్మగాడి పొగరణిచా! దెబ్బకి పారిపోయాడు. విజయం మనదే! విజయ్ నెగ్గారి విజయ్... విజయ్!

ఈమధ్య గౌరవ డాక్టరేట్లు చాలా ప్రదానం చేస్తున్నారు. మనమూ వొక పాత విషయంమీద క్రొత్త థీసిస్‌రాస్తే బాధ వదులుతుంది! అదృష్టం బాగుంటే ఏనాడో వోనాడూ మనకి గౌ. డా. లభించొచ్చు! బాధ...బాధ...గౌరవం దక్కలేదని యేడుపు!...బాధ బాధ...అంటే 'ఫ్దాదస్'...చిత్రం బాధ 'ప్దాదస్' కలిశాయే" "పాదాలా కభేదము...భేదం...పదం...పథం ... పధం..."పాత్"! అరె ఇదీ కలుస్తోంది! చూడు చూడు ఇంకా చూడు...క్విక్ క్విక్! ఎక్కళ్ళు...హెక్కప్.. భలే... హెక్కాగ్ర సంస్కృతం!... "త్రి..." మూడు...'త్రి' మూడే! అరె! నెలలన్నీ యింగ్లీషు సంస్కృతం... కప్ తెలుగు కలుస్తున్నాయే...సెప్టెంబరు...సప్త... అక్టోబర్... అష్ట...నవంబరు... నవ...డిసెంబరు... దశ...భలే భలే! డెసిమల్ దశాంశ... సెంచరీ...శత... 'నేవీ' ...నావికా... అబ్బ! చాలా పదాలు కనుక్కున్నాం. ఇవన్నీ చూస్తే గ్రీకుమూలాలున్నయింగ్లీషు పదాలన్నీ తెలుగు సంస్కృతాలనుండి వచ్చినట్టే తెలుతోంది. కనక ఆంగ్ల సాహిత్యంపై తెలుగు సంస్కృతాల ప్రభావం అని వో థీసిస్ రాసి పారేద్దాం! కొంపదీసి యీవిషయం యిదివరకే ఎవరోహ రాశారేమో!... అయినా ఫరవాలేదు! మన సొంత మసాలా కాస్త జోడించి యీ పరిశోధనకోసం తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీని, మద్రాసు సెంట్రల్ లైబ్రరీని, ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సును అమితంగా గాలించాంఅని రాద్దాం! రైట్ అంతే!

..."ఛ...హాయిగా ఇలా సాహిత్యసేవ చేసుకోక యిప్పాళ్ళూ వాళ్ళ కాళ్ళూ వీళ్ళ కాళ్ళూ పట్టుకున్నాను సినిమాకోసం...దెబ్బతో సాహిత్యాకాశంలో ఉన్నతస్థానం లభిస్తుంది అదృష్టం బాగుంటే కల్చరల్ ఎక్ఛేంజి కార్యక్రమంలో యే రష్యాకో, ఫిలిప్పైన్స్‌కో డెలిగేట్‌గా వెళ్ళచ్చు...అరే అరే ... హరి అప్ ... మనపేరు చిరస్థాయిగా...

"సార్! ఏవిటన్నారు! మీ కొత్త సినిమాకి కథ కావాలనా నాది వో మంచి కథ వుంది! వినిపించమంటారా? ఎక్కడ టైము పట్టదు...జస్ట్ హాఫెనవర్!..."

## స్వాతంత్ర్య సమరంలో కేంద్ర శాసనసభ పాత్ర

[(మనోరంజన్ ఝా రచనకు ఆంధ్రానువాదము) రచయిత కుమారి మా. రాజ్యలక్ష్మి. నేషనల్ బుక్ ట్రస్టు ఆఫ్ ఇండియా ప్రచురణము (1976), 280 పుటలు, వెల 6-75, డిస్ట్రిబ్యూటర్సు: ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, రాష్ట్రపతి రోడ్డు, సికింద్రాబాదు.]

భారత స్వాతంత్ర్య సమరం సైనిక పరంగా రాజకీయ పరంగా జరిగింది. బ్రిటిషు అధికారంనుండి స్వాతంత్ర్యం సంపాదించడానికి సైనికపరంగా 1857లో దేశవ్యాప్తంగా మొదట పెద్దయెత్తున జరిగిన సమరం ప్రధానమైనది. దీని తర్వాత భారత స్వాతంత్ర్యోద్యమం రాజకీయోద్యమంగా సాగింది. కొంతవరకూ బ్రిటిషు విద్యా విధానం ఫలితంగా జాతీయ స్వాతంత్ర్య సంపాదన దీక్ష విద్యాధిక వర్గాలలో ప్రబలమైంది. బ్రిటిషుపాలకులుకూడ భారతదేశ పరిపాలన వ్యవస్థలో భారతీయులకు కొంత జోక్యం కలిగించవలసిన అవసరాన్ని గుర్తించక తప్పలేదు. 1861వ సంవత్సరపు భారతీయుల సమితుల చట్టం "శాసనాలను రూపొందించే పనితో కొంత మంది భారతీయులకు సంబంధం" కల్పించింది. అప్పటినుండి 1919 భారత ప్రభుత్వ శాసనం వచ్చేవరకు ఈవిధానం కొనసాగుతూ వచ్చింది. తరువాత భారత ప్రభుత్వ సంస్కరణలు క్రమక్రమంగా భారతదేశంలో పార్లమెంటరీ ప్రభుత్వ విధానము పెంపొందిస్తూ వచ్చాయి. భారత శాసన సభలో దేశభక్తి పూరితులైన సభ్యులు భారత స్వాతంత్ర్య సంపాదనకు తోడ్పడే కార్యక్రమాన్ని సాగిస్తూ వచ్చారు. ఒకవైపు జాతీయ మహాసభ, (ఇండియన్ నేషనల్ కాంగ్రెసు) జాతీయవాదులైన ప్రజానాయకులు భారత స్వాతంత్ర్య పోరాటంకోసం మహోద్యమాలు నడిపిస్తూవస్తే, ఇంకొకవైపు తమ పరిధిలో వీలైనంతవరకు భారత శాసన సభలలో సభ్యులైన దేశనాయకులు భారతీయుల హక్కులను నిలబెట్టడానికి, ప్రజాక్షేమాన్ని కాపాడడానికి వాదోపవాదములద్వారా, తీర్మానములద్వారా కృషిచేసారు. "స్వాతంత్ర్యం కొరకు కొందరు కత్తులు దూసి వీరోచితంగా పోరాడి అసువులర్పిస్తే, శాసనసభలో ప్రజాక్షేమం కొరకు కొందరు వాదోపవాదాలు జరిపి ఉద్యమాన్ని బలపరచారు. ఈ రెండవ పోరాటాన్ని గురించి అధికారయుతంగా చెబుతుంది ఈ పుస్తకం" అని గ్రంథ ప్రకాశకులు వివరించారు.

"స్వాతంత్ర్య సమరంలో కేంద్ర శాసనసభ పాత్రను" ఈ గ్రంథం వివరిస్తున్నది. భారతదేశంలో బ్రిటిషు పరిపాలనలో శాసన సభల చరిత్రలో అయిదు ప్రధాన ఘట్టాలున్నాయి. అవి 1861 భారత సమితుల చట్టం, 1892 భారత సమితులచట్టం, 1909 భారత సమితుల చట్టం, 1919, 1935 భారత ప్రభుత్వ చట్టాలు. వీనిలో 1858 1919 మధ్య అవతరించిన సమితులకు సంబంధించిన చట్టాల గురించి మొదటి ఒకే ఒక అధ్యాయంలో ముచ్చటించబడింది. ఈకాలంలో ఏర్పడిన సమితులు బ్రిటిషు పార్లమెంటును పోలియుండలేదు. అయినను ఇవి చర్చావేదికలుగాను, చిన్న పార్లమెంటులుగాను తయారైనవి. 1861, 1892 సమితులలో ఎన్నికలపద్ధతి లేకపోయినా మింటోమార్లే సంస్కరణలు-1909 సమితులలో ఒకవిధమైన ఎన్నిక పద్ధతి కొంతవరకు శాసన సభారూపముండేవి. ఈకాలంలో ఫిరోజ్‌షా మెహతా, జి. కె. గోఖలే, రాష్ బిహారీ ఘోష్ మొదలైనవారు రాజకీయ, ఆర్థిక, సాంఘిక, రంగాల్లో భారతీయుల ఇబ్బందులను వెల్లడి చేసేవారు. తీవ్రమైన విమర్శనతో కూడిన ఈకొత్త ధోరణికి ఒరవడి పెట్టినవాడు ఫిరోజ్‌షా మెహతా. వీరు అందరూ భారతదేశంమీద ఆర్థికంగా దెబ్బతీసే పన్నులను విమర్శించడం, భారతీయుల ఆత్మగౌరవానికి, స్వాతంత్ర్యానికి హానికరమైన బిల్లులను ఖండించడం, సైన్యంలోను, పరిపాలనలోను భారతీయులను నియమించాలని కోరడం వంటి చర్యలద్వారా, ముఖ్యంగా బడ్జెటు సమయంలో తీర్మానాలను ప్రతిపాదించే హక్కును బాగుగా ఉపయోగించుకొని శాసన సమితులను స్వాతంత్ర్య సమరాన్ని బలపరచడానికి ఉపయోగించారు.

రెండవ అధ్యాయం మొదలు ముగింపు వరకు 1919 నుండి 1947 వరకు కేంద్ర శాసనసభలు స్వాతంత్ర్య సమరంలో నిర్వహించిన పాత్ర విపులంగా వివరించబడింది. రెండవ అధ్యాయంలో 1919 సంవత్సరపు సంస్కరణల చట్టము – ఉదారవాదులు అనే విషయం ముచ్చటించబడింది. 1919 సంవత్సరపు సంస్కరణల చట్టమునకు ముందు దేశంలోఉన్న రాజకీయ పరిస్థితులు, నిరాశ, అసంతృప్తి ఆ చట్టమును అమలుపరచే సందర్భములో ఇంకా ఎక్కువైనాయి. అందువలన ఈ చట్టం కింద 1920లో మొట్టమొదటి సారి ఎన్నికలు జరిగినపుడు కాంగ్రెసు ఎన్నికలను బహిష్కరించింది. మితవాదులు మాత్రమే రంగంలో అభ్యర్థులుగా మిగిలారు. సమితులలో సభ్యులైనారు. "సమితుల వెలుపల దేశవ్యాప్తంగా ఉద్యమం జరుగుతూ వుందనీ బ్రిటిష్ పాలన చేస్తున్న అకృత్యాలకు ప్రజలు ఉడికిపోతున్నారనీ మితవాదులకు తెలుసు". అందువలన ప్రజలను అణచివేసే చట్టాలనురద్దుచేయడమో లేకతగురీతిని సంస్కరించడమో నివేదించడానికి తీర్మానం మితవాదులకు నాయకత్వం వహించిన శ్రీనివాస శాస్త్రి ప్రవేశపెట్టినారు. సైన్యంమీద సర్వీసుల కింద విశేషంగా ధనం వ్యయంచేయడం ఉప్పుపన్ను హెచ్చించడం మొదలైన చర్యలను ఈ శాసన సమితులలో తీవ్రంగా విమర్శించడం జరిగేది. మూడవ అధ్యాయంలో శాసనసభలో 1924-26 మధ్య స్వరాజ్యవాదుల పాత్ర వర్ణించబడింది. నాల్గవ అధ్యాయంలో 1927-29 మధ్య దేశంలో ఏవిధంగా ప్రతిఘటన జ్యోతి ప్రకాశిస్తున్నదీ వివరించబడింది.

ఈకాలంలో వాయిదా తీర్మానాలద్వారా శాసనసభలో జాతీయోద్యమాన్ని సమర్థించడానికి, భారతదేశ ఆర్థికాభివృద్ధికి భంగకరమైన బిల్లులను వ్యతిరేకించడానికి నిరంతరం కృషి జరిగింది. 1818 సంవత్సరపు బెంగాల్ రెగ్యులేషన్ III రద్దు చేయడం గురించి, ఉక్కు రక్షణబిల్లు, కరెన్సీబిల్లు (1927) విషయంలో బ్రిటిష్ ప్రభుత్వాన్ని తీవ్రంగా శాసనసభలో విమర్శించడం జరిగింది. అయిదవ అధ్యాయంలో 1930-34 మధ్య స్వరాజ్యవాదులులేని శాసనసభ కార్యక్రమాలు పేర్కొనబడ్డాయి. ఈ సమయంలో భారత స్వాతంత్ర్య సమరంలో చాల ప్రధానమైన సంఘటనలు జరిగినాయి. మహాత్ముని దండియాత్ర, భారత రాజ్యాంగసంస్కరణల సందర్భమున రౌండు టేబిల్ సమావేశాలు, పూనా ఒడంబడిక, హరిజనోద్యమ విజృంభణము మొదలైనవి రాజకీయ రంగంలో జరుగుతూ ఉంటే స్వరాజ్యవాదులు శాసనసభలలో లేకపోయినప్పటికి వారి ప్రభావం శాసన సభల చర్చలలో పూర్తిగా కనపడింది. అయినప్పటికి శాసన సభ బలహీనమైపోయింది. ఆరవ అధ్యాయంలో 1935వ సంవత్సరపు భారత ప్రభుత్వ చట్టం ప్రతిఘటన వివరించబడింది. అయిదవ శాసన సభకు ఎన్నికలు జరిగినవి. వానిలో కాంగ్రెసు పార్టీని అధిక సంఖ్యాకుల పార్టీగా విజయం పొందింది. దానిలో ఉద్దండులైన కాంగ్రెసుపార్టీ నాయకులు భూలాభాయి దేశాయి గోవిందవల్లభపంత్ సత్యమూర్తి వంటి ప్రముఖులు, ఇతర నాయక ప్రముఖులు జిన్నా, మోదీ, కౌవస్జీ జహంగీ మొదలైనవారు ఉన్నారు. 1935 సంవత్సరపు భారత ప్రభుత్వ చట్టానికి తీవ్ర ప్రతిఘటన కలిగింది. కేంద్రంలో ఆ సంస్కరణలోని ఫెడరల్ భాగాన్ని అమలు జరపడానికి వీలుకాలేదు. 1939లో రెండవ ప్రపంచ సంగ్రామం ప్రారంభమైనపుడు కాంగ్రెస్‌పార్టీ సభ్యులు రాజీనామా చేసారు. ఏడవ అధ్యాయంలో 1939-1945 మధ్య అనగా రెండవ ప్రపంచ యుద్ధకాలములో శాసనసభ నిర్వహించిన తీరుతెన్నులు తెలుపబడినవి. ఇదే సమయములో జిన్నా శాసనసభలో కొత్తవైఖరి అవలంబించడం పాకిస్తాన్ వాదం బలపరచడం జరిగింది. అట్లాంటిక్ ప్రణాళిక భారత దేశానికి వర్తించడం విషయంలో వాదోపవాదాలు జరిగినాయి. ఇదే కాలంలో క్రిప్సు రాయబారము విఫలమై క్విట్ ఇండియా ఉద్యమము భారత స్వాతంత్ర్య సమరానికి తుది సంఘటనగా విజృంభించింది. శాసన సభలలో రాజకీయ ఖైదీల విడుదల గూర్చి, రాజకీయ ప్రతిష్టంభన తొలగించేందుకు చర్చలు తీర్మానాలుచేస్తూ వచ్చారు. కాని వాటివలన ఎక్కువ ప్రయోజనం కలుగలేదు. ఎనిమిదవ అధ్యాయంలో 1945-47 ఆఖరి ఘట్టం ముచ్చటించబడింది. 1946 జనవరి ఆరవ శాసనసభ మొదటి సమావేశం జరిగింది. అప్పటికి యూరపులో యుద్ధం ముగిసింది. శాసన సభలో కాంగ్రెస్, ముస్లిం లీగులమధ్య చీలికలు తీవ్రతరంగానే ఉన్నాయి. ఈ శాసన సభలో ఐ. ఎన్. ఏ. అధికారుల విడుదలకోసం చేసిన ప్రస్తావనలు ముఖ్యమైనవి. తరువాత రాయల్ ఇండియన్ నేవీ తిరుగుబాటును గురించిన చర్చ ముఖ్యమైనది. బ్రిటిషు మంత్రి మండలి బృందం పథకాన్ని అనుసరించి రాజ్యాంగ నిర్ణాయ సభకు ఎన్నికలు జరిగినవి. కాంగ్రెస్ ముస్లింలీగు విభేదాలు దేశ విభజనకు దారితీసినవి. తుదకు 1947 ఆగస్టు 15వ తేదీ స్వతంత్ర భారతదేశం ఉద్భవించింది. భారత స్వాతంత్ర్య చట్టము అమలులోనికి రాగానే తొలిటి కేంద్ర శాసన సభలు అంతరించినాయి. రాజ్యాంగ నిర్ణాయక సభయే శాసన సభగా 1947 ఆగస్టు 15నుండి వ్యవహరిస్తూ వచ్చింది.

సుమారు 90 సంవత్సరాలు బ్రిటిషుహయాములో భారతదేశంలో కేంద్రశాసన సమితులు నిర్వహించిన పాత్ర సమగ్రంగా సాధికారంగా ఈ గ్రంథంలో వివరించినారు. శాస్త్రీయ పరిశోధనా పూర్వకంగా సాగిన ఈ రచనలో 1919-1947 మధ్య జరిగిన సంఘటనలకు ఎక్కువ ప్రాధాన్యం ఇయ్యడం జరిగింది. యదార్థానికి ఈ కాలంలోనే, భారతశాసన సమితులకు కొంతవరకైనా పార్లమెంటరీ విధానపు లక్షణాలు సంక్రమించాయి. పరిమితమైన అధికార పరిధిలో దేశనాయకులు భారతీయుల క్షేమంకోసం. హక్కుల కోసం బలమైన పోరాటం సాగించిన తీరు ఈ గ్రంథం చక్కగా వివరించింది. ప్రతి అధ్యాయం చివర ఇచ్చిన రెఫరెన్సులు పరిశోధకులకుకూడా ప్రయోజనకరములుగా ఉన్నవి. కొన్ని అధ్యాయములలో మాత్రము స్వాతంత్ర్య సమరములో కేంద్ర శాసనసభపాత్రకంటె స్వాతంత్ర్య సమర విశేషములు విస్తారముగా ఉన్నవి.

మొత్తముమీద ఆంధ్రానువాదము సరళముగానే యున్నది అయితే కొన్నిచోట్ల అనువాదపదములు మూలమునంత స్పష్టముగా తెలుపుటలేదు (లెజిస్లేటివ్) కౌన్సిల్సు అను పదమునకు సమితులు (పుట 15) పౌర అధికార్లు (సివిల్ సర్వెంట్సు పుట 50) అన్న పదములు స్పష్టార్థము నిచ్చుటలేదు అట్టిచోట్ల బ్రాకెట్లలో ఇంగ్లీషు పదమును తెలుగు అక్షరములలో పేర్కొనినచో బాగుండెడిది. ముద్రణము బాగా ఉన్నప్పటికి అచ్చుతప్పులు కొంచెం ఎక్కువగానే దొర్లినవి. 22వ పుటలో రెండవపేరా మొదటి వాక్యంలో మొదటి ప్రపంచయుద్ధం అనడానికి బదులు రెండవ ప్రపంచయుద్ధం అని పడింది. ఇట్టి స్వల్పమైన పొరపాట్లు ద్వితీయ ముద్రణంలో సవరించవచ్చును. నాయకుల ఫొటోలు గ్రంథానికి అలంకారప్రాయంగా ఉన్నాయి.

మొత్తముమీద ఈ రచన భారత రాజ్యాంగ చరిత్ర చదివే వారికి, దానిలో పరిశోధనచేసేవారికి మిక్కిలి ప్రయోజనకరమైన గ్రంథం అనడానికి సందేహంలేదు. గ్రంథమంతటా మనోరంజన్ ఝా పరిశోధనా పరిశ్రమ ప్రస్ఫుటమౌతున్నది

— శ్రీ వై. వి. రమణ

## త్రిశతి

[రచన: శ్రీ వెలకుపల్లి–జమదగ్నిశర్మ, క్రౌను 8+90 పుటలు, వెల 3 రూ. ప్రాప్తిస్థానం– శ్రీ కాళహస్తి దేవస్థానం, శ్రీకాళహస్తి, చిత్తూరుజిల్లా.]

'త్రిశతి' అంటే మున్నూరే అయినా, ఇందులో మున్నూట ముప్ఫయిమూడు పద్యాలు ఉన్నవి. శతకంలో నూరు పైచిలుకు

పద్యాలుండడం సర్వసాధారణం. ఇందలి పద్యాలన్నీ 'శ్రీకాళహస్తీశ్వరా!' అనే మకుటంతో ఉన్నందున ఇది శతకత్రయ సంపుటమని చెప్పవలసి ఉన్నది.

దీనిని రచించిన చెరకుపల్లి–జమదగ్ని శర్మగారు సంస్కృతాంధ్రాలలో సమర్థులైన పండితులు. సరస కవులు. భగవద్భక్తి పరాయణులు. శ్రీ దేవ్యుపాసకులు. ప్రభుత్వ కళాశాలలలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేసి, ఉద్యోగ విరమణానంతరం శ్రీ కాళహస్తిలోనే స్థిరనివాసం ఏర్పరచుకొని ప్రశాంత జీవనం గడుపుతున్నారు. కాళహస్తిలో ఉద్యోగానికి వచ్చినప్పుడే జమదగ్ని శర్మగారికి భక్తిరస భరితమైన కృతిని రచించాలనే సంకల్పం కలిగింది. అది నెరవేరి యీ 'త్రిశతి'గా తయారయింది.

'శ్రీకాళహస్తీశ్వరా!' అనే మకుటంతో ఇదివరలో ప్రసిద్ధమైన శతకం ఒకటి ఉన్నది. అది రాయలవారి ఆస్థానంలోని అష్టదిగ్గజాలలోను ఒకరైన ధూర్జటి మహాకవి రచించినది. ఆ మకుటంతోనే తిరిగీ శతకం చెప్పడం ఎందుకని ప్రశ్నించనక్కర్లేదు. అలా చెప్పకూడదనే నియమం ఎక్కడా లేదు. శర్మగారు దేవీభక్తులు. అయినా–అనుకోకుండా–అప్రయత్నంగా ఈ మకుటంతో పద్యాలు రాసాగినవి. రచన నిరాఘాటంగా సాగిపోయింది. జగత్పితరులైన పార్వతీపరమేశ్వరులకు తాము అభేదాన్ని పాటించినట్లూ, మహేశ్వర పరంగా పద్యాలు చెప్పినా, అవి దేవికి కూడా అన్వయించగలవన్నట్లూ రచయిత చెప్పున్నారు. అప్పుడప్పుడు తమకు తోచిన భావాలను మేళవించి పద్యాలు అల్లబడినవి. అందువల్ల పద్యాల్లో స్వేచ్ఛ, ప్రసన్నత కానవస్తుంది. యతిప్రాసలకోసం తంటాలుపడి బలవంతంగా చెప్పిన కవిత్వంవలె ఇది తోచదు.

మచ్చునకొక పద్యం—

''గంతల్ కట్టిన గానుగెద్దువలెఁ జ
క్రభ్రాంతియౌ జీవితం
బెంతైనన్ ఫలితమ్ము శూన్యము, జగ
ద్ధ్యేయుండవౌ నిన్ను వి
శ్రాంతిన్ గొల్వకయున్న నీ దయకు పా
త్రంబైనచో నద్దియే
చింతారత్నము కామధేనువు నగున్
శ్రీకాళహస్తీశ్వరా!''

[పుట 46. పద్యం. 115.]

దీనికి అరుణాచల కృష్ణమూర్తి ఘనపాఠిగారు కూర్చిన ''శ్రీ కాళహస్తిక్షేత్ర మహాత్మ్యము'' పీఠికతో మెరుగును కలిగిస్తున్నది. ఘనపాఠిగారు వేదవేదాంగవిదులు. ఆత్మతత్త్వవేత్తలు. మంత్రశాస్త్రంలో అసాధారణప్రజ్ఞ కలవారు. వారు అందులో అందరూ చెప్పుకొనే తిన్నడు మున్నగు భక్తుల చరిత్రలను చెప్పలేదు. తీర్థప్రయోజనం, ఈశ్వరతత్త్వం, దేవీస్వరూపం, మున్నగు పెక్కు విషయాలు ఆర్షప్రమాణపూర్వకంగా తెలుపబడినవి. అందువల్ల దీనిని పఠిస్తే ఎన్నో విషయాలు గ్రహించవచ్చును. ఆస్తిక ప్రపంచంలో దీనికి మంచి ఆదరణ లభించగలదని ఆశించవచ్చును.

భక్తాగ్రణ్యులైన జమదగ్ని శర్మగారు దీని సర్వస్వామ్యాలనూ శ్రీకాళహస్తి దేవస్థానంవారి పరంచెయ్యడం వీరి ఔదార్యానికి తార్కాణం.

— *శ్రీ బులుసు వేంకటరమణయ్య*

# శ్రీనాథ కవితానుశీలన

[ రచన: భాషా ప్రవీణ – పాతకోట రాధాకృష్ణమూర్తి, పి. జి. టి. ఇన్ తెలుగు. ఆంధ్రప్రదేశ్ రెసిడెన్షియల్ స్కూల్, తాడికొండ, గుంటూరు జిల్లా. క్రౌను 66 పుటలు, వెల: రూ. 3-50. ]

వాఙ్మయ పరిశోధనలలో ఈ నడుమ కవిత్రయంవారికీ, శ్రీనాథ కవిసార్వభౌమునికీ ప్రాధాన్యం కానవస్తున్నది. శ్రీనాథుని గురించిన పరిశీలన గ్రంథాలు చిన్నవీ, పెద్దవీ కూడా వెలువడినవి. అట్టి పరిశీలనలలో ఇది ఒకటి. కాశీఖండంలో శ్రీనాథుడు తన్ను గురించి చెప్పుకుంటూ —

'వచియింతు వేములవాడ భీమన భంగి
నుద్దండలీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టు మార్గంబున
నుభయ వాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాక్రుతు తిక్కయజ్వప్రకారము రసా
భ్యుచితబంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని తేవ
సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు'

అని తెలియజేశాడు. వీరిలో భీమకవి గ్రంథాలు ఏవీ లభించనందున కవిత్రయంవారి ఉభయవాక్ప్రౌఢి, రసాభ్యుచితబంధము, సూక్తివైచిత్రి ఇతని కవితలో ఎలా కానవస్తున్నదీ ఆ యా శీర్షికలలో ఇందులో ఉదాహరణలతో కూడా విశదీకరించబడింది. శ్రీనాథుని ఉభయ వాక్ప్రౌఢిమను చూపుటకై సంస్కృతాంధ్రాలమండి నన్నయ శ్రీనాథుల పద్యాలు ప్రౌఢిమా పరిశీలన మూలకంగా చూపబడినవి. 'రసాభ్యుచితబంధ' శీర్షికలో రసస్వరూపం, రసభేదాల్లూ, రసోచిత పదబంధాన్ని గురించిన ఆలంకారికుల అభిప్రాయాలు, ఆ రస నిర్వహణలో తిక్కన నేర్పు, తదనుసారంగా శ్రీనాథుని కూర్పు వివరింపబడినవి. 'సూక్తివైచిత్రి'లో ఉక్తిస్వరూపం, విభిన్నాభిప్రాయాలు, విరనార్యుని ఉక్తివైచిత్రులు శ్రీనాథుడా ఉక్తివైచిత్రిని పోషించిన రీతి చూపబడినవి. ఈ మూడు కవితా వైశిష్ట్యాలను తీసుకుని రాధాకృష్ణమూర్తిగారు వాటిలో శ్రీనాథుని ప్రత్యేకతను వివరించారు.

''ఇది శ్రీనాథకవితా సమీక్షణముతోపాటుగా ఉత్తమ కవిత యెట్టిదో, ఉత్తమకవుల మార్గము లెట్టులుండునో, ఎట్టులుండవలయునో సోపపత్తికముగా నిర్ణీతము చేయుచున్నది'' అని స్ఫూర్తిశ్రీ గారు అంటున్నారు.

"శ్రీనాథుడన్న బాల్యమునుండి మిక్కిలి మక్కువ. అతని కవితా చమత్కారములు - శోభనములు - వాసనములు - మధురిమములు - లోకానికి తెలుపవలెనని నా కామన. అది కొంత నెరవేరినది." అని రచయిత 'నాముడి' లో తెలుపుచున్నారు. నిజమే! ఆత్మవిశ్వాసం లేనిదీ ఏపనీ సార్థకం కాజాలదు. కవిసార్వభౌముని కవితను గురించిన విపుల పరిశీలన గ్రంథాలవల్ల ఎంత విషయం పాఠకులు అవగాహన చేసుకోగలరో, అంత విషయాన్ని యీ చిన్న పుస్తకంనుండి గ్రహించ వచ్చునని చెప్పవచ్చును. ఎక్కువ పరిధులను కల్పించుకొని అసమగ్రంగా చెప్పడంకంటె స్వల్పపరిధిలో విషయ పరిశీలన చెయ్యడం చాలా మేలైనపని. రాధాకృష్ణమూర్తిగారు తమ సంకల్పంలో కృతార్థులైనారని చెప్పవలసిఉన్నది.

— "అంగీరస"

# "ఇది దారికాదు, ఎడారి!"

*["నవకవితా తోరణాలు" సమీక్ష]*

ఇరంమంజిల్ కాలనీలో నెలకొల్పబడిన అరుణోదయ సాహితీ సాంస్కృతిక సంస్థ తలపెట్టిన తొలి ప్రయత్నంలో వెలువడిన కవితా సంకలనం నవకవితా తోరణాలు ( ప్రతులు పై సంస్థపేర హైదరాబాద్ 4కు రాస్తే రెండు రూపాయలకు పొందగలరు) మూడుతరాల కవులకూ, నలభై సంవత్సరాల ఆధునికాంధ్ర కవిత్వానికీ ప్రతినిధిగా వెలువడింది 36 పుటల సంకలనం.

కొండంత స్వరూపాన్ని ప్రతిబింబించడానికి కొండంత అద్దాన్ని ఎవరూ నెలకొల్పలేరు. కనుక యథాశక్తి తుభ్యమహం సంప్రదాతే నమః అని సంకల్పించి తమ కవితా ప్రపత్తి వెల్లడించుకొన్నారు. ఆధునిక కవులలో మొదటి తరానికి చెందిన-శ్రీశ్రీ, ఆరుద్ర, కుందుర్తి, దాశరథి, నారాయణరెడ్డి, బాపురెడ్డిగార్లనూ, రెండో తరానికి చెందిన సర్వశ్రీ గుంటూరు శేషేంద్రశర్మ, మాదిరాజు రంగారావు, అరిపిరాల విశ్వంగార్లనూ, మూడో తరానికి చెందిన సర్వశ్రీ కె. శివారెడ్డి, ఎల్లోరా, సుధామ, దేవరాజ్ మహరాజ్, ఐ. సూర్య ప్రకాశ్, వనమాలి గార్ల కవితలను రిప్రజెంటు చేసిన ఈ సంకలనంలో ఎం. కె. రాము, తాళ్ళపల్లి మురళీధరగౌడ్, వై. శాంతి, పలివెల గార్ల కవితలు కూడా చేర్చబడ్డాయి. బహుశా వీరంతా ఈ అరుణోదయ సంస్థ సభ్యులు కావచ్చు. అస్పందాయకు కొత్తపేర్లు, కాలాన్ని తమ్మకుంటూ ముందుకు పరిగెడుతున్న నవ యువకులు.

తోరణం-అనవరత బహువచనమే కనుక నవకవితా తోరణాలు అననక్కరలేదు. సంకలనకర్తలు పెట్టిన పేరుకు తగినట్లుగా చిత్రకారుడు ముఖచిత్రం అందంగానే రూపొందించారు కాని-డాక్టర్ సి. నా. రె అక్షరాల గవాక్షాల ముఖచిత్రాన్ని జ్ఞాపకం చేస్తోంది.

ఇటీవల పది పదిహేను సంవత్సరాలకాలంలో వందలాది కవితా సంకలనాలు వెలువడ్డాయి. విరివిగా పుట్టి చూస్తే, ఇది కవితా సంకలనాల యుగమనిపిస్తుంది. పఖ్యాతులైన కవుల కవితలను సంకలనం చేయడంద్వారా, ముక్కుపచ్చలారని యువకుల రచనలకు కూడా సహ పంక్తి గౌరవం కల్పించడం ఈ సంకలనాల ధ్యేయంగా కనిపిస్తుంది.

ఈ తోరణాలు సంకలనంలో 19 మంది కవుల 29 కవితలు సేకరింపబడ్డాయి. శ్రీశ్రీ గారి ప్రఖ్యాత కవిత-నవకవిత-తో ఈసంకలనం ప్రారంభమవడం-ఈ సంకలనానికి ఒక నేపథ్యాన్ని సంతరించుకున్న ఓజస్సు సమకూరింది. శ్రీశ్రీగారి అవతారం కూడా ప్రచురితమైంది. కొత్త సృష్టిని సవరించే తీరుతెన్నులు ప్రదర్శితం కావడం సముచితంగా ఉంది.

ఆరుద్రగారి జోలపాట-నడివీధిని పడి బతికే నిర్భాగ్యుల జీవిత చిత్రణలో ఆరుద్ర ముద్ర ప్రత్యక్షరంలోనూ ప్రత్యక్షమవుతుంది. 'నిదరపో చిటిపాప' అంటూ పాడిన జోలపాటలో ధ్వన్యంతరంగా మేలుకొలుపు ద్వితీయస్థాయి కావడం ఈ కవిత విశిష్టత. దానికై ఎన్నో పదచిత్రాలు ఒక ఆవేశపుహోరు కలిగిస్తాయి. కూనలమ్మ పదాలనుంచి ముత్యం మూడే ముక్కలని ఎంపిక చేయబడ్డాయి. డాక్టర్ దాశరథిగారి దుర్గంత సంగామేశ్వరాన్ని చిత్రించే కవిత పాతాళహోమం. 'బీరభం వెదజల్లనలసిన సమత సర్వమ్మై కదుస్తుంది "దారికాదు, ఎడారి" వంటి మనోహర కల్పనల తోరణమైన ఈ కవిత విశ్వహారితంగా మెరుస్తుంది. అనికేతనం అనే మరో కవిత చక్కని గేయరచన. పద్మశ్రీ డా. నారాయణరెడ్డిగారి కవిత ఈ దారి నీకు కొత్త. పువ్వు ముల్లు అనేవి వారి వ్యక్తిత్వాన్నిపట్టి చూపినవే! వారి ఫణితికీ, అభివ్యక్తికీ దీటైనవే!

వివేకాన్ని తిమిరించే విషవాయువుల గురించి హార్దికంగా హెచ్చరించే ఉషోగీతం - శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారి నీలినీ గోడ్ను అనే కవిత. వచ్చేతరాలకోసం, చచ్చే వీరుల కానగా- మోదుగ పూవుల మాలలు-దర్శనమిస్తాయి. వారిదే రెండో రచన 'ఈగలు'; కష్టాల అగ్నుల్లోంచి అద్దాలై పుట్టమని ఆహ్వానించే కవిత. నవ కవితా వాచస్పతి శ్రీ కుందుర్తి 'నాలోని వాదాలు'లోని ఒక ఖండిక- "చరిత్రనే అడుగు, ఎందుకుపోవాలో ముందుకు! నేడు నిప్పుటి వేరాలమీద కాలం చెప్పినతీర్పు! .. ఈ పూటరాసే పాటలో రేపటి బొమ్మ చెక్కుకుంటూ" సాగేకవితా దర్శనం కుందుర్తిది! డాక్టర్ మాదిరాజు రంగారావు 'కాలంగురించి మాట్లాడకు' అంటూ హెచ్చరించారు. ఆధునిక కవితా ధర్మాలలో కాలంగూర్చిన విచికిత్స ఒక ప్రధాన లక్షణం. దీనిపై తమ దర్శనం సారించిన కవులు ఎన్ని పోకడలనైనా పోయారు. తమ భావుక ప్రతిభ వెలార్చారు. అట్టి ప్రతిభాజన్యమైన కవితలో శ్రీ మాదిరాజుగారి దొరువు. నెగటివ్ ఆ పోజ్‌తో పాజిటివ్ సెన్సిబిలిటీని ఆవిష్కరించే ఈ రచనలో-"మాట ఊహకు ప్రతీక! పాట అనుభూతి మరీచిక!" అంటారు. ప్రతీకవాద, పదచిత్రగాఢ కవితా సంవిధానంలో ఎన్ని గడసరి పోకడలనైనా పోగల నేర్పుగల కవి శ్రీ రంగారావు. 'మళ్ళీ తెల్లారుతుంది' అంటున్న డాక్టర్ అరిపిరాల విశ్వంగారి కవితలో ఉదయంలోని ఎరుపు నిజం-రాత్రి దుఃఖంలోని నీలిమ నిజం!' అనే విశ్వసత్యాలు వివరించబడ్డాయి. వారిదే మరో కవిత—ఆనందం వాకిలి పూసున్నప్పుడు-లో "బరువులు కొమ్మలు విరిగి వెల్లుగా ముందు నిల్చున్న" దృశ్యం ఫిర్యాదు భాగాన్ని పసుపు పదచిత్రాలద్వారా ప్రతిష్ఠించే నేర్పును ద్యోతకం చేస్తుంది.

విల్సోరాగారి కవిత నేను దమంత బాధని పిడికిలి అంత గుండెలో యిముడ్చుకోవడం వివరిస్తుంది. శ్రీ బాపురెడ్డిగారి కవిత లేహాలు 'లేస్తున్నవి.' విశ్లేతవత్యంమంచి చైతన్యం ఆవిర్భవించి, ప్రగతిని ప్రతిబింబించడం వర్ణిస్తుంది. వారిదే కాలమనే గీతం సామాన్య ప్రచార స్థాయిలో సాగింది. శ్రీ కె. శివారెడ్డికి భావుకత్వాన్ని పొదివి పట్టుకునే సౌందర్య దృష్టి అలవడితే ఉత్తమ కవితలు అందిస్తారనే ఆశ కలిగిస్తుంది. అతివ్యాప్తి దోషంగాకాక ఈ కవి ఇంప్రెషనిజంగా అపార్థం చేసుకుంటున్నట్లు కనిపిస్తుంది. హృద్యమైన పదచిత్ర ఆవిష్కృతితో భావావతరంగాలను షాక్ చేయకలగడమే గొప్పకవిత లక్షణం. అంతేతప్ప ఒక చిన్నభావాన్ని ఒక లీటరు కవితగా గిలకరించి అందించడం గౌరవ భాజనంకాదు. శ్రీ సుధామ "అంగారవల్లరి" అనే కవితలో "ప్రతినిమటుచుక్కనూ కన్నీటి బిందువుచూ సైవాడి స్నానపానాదుల కందించి తామమాత్రం మురికిలోనే మగ్గిపోయే దుర్భర పేదవాలలోంచి తూర్పుకొండలలోకి రమ్మ"ని శ్రమజీవులను హెచ్చరిస్తారు. అంగారవల్లరి అనే కావ్యనామంతో శ్రీ కె వి. రమణారెడ్డి ప్రచురించిన కవితా సంపుటి వదిహేనేళ్ళ క్రితమే విశేష ప్రాచుర్యం పొందడం బహుశా ఈ చిరంజీవి ఎరుగకపోవచ్చు పదసముచ్చయాలకూ, ప్రతీకలకూ మనభాష గొడ్డుపోలేదు. కవికి భావుకత్వమే కరువు కారాదు కాని! శ్రీ దేవరాజ్ మహరాజ్ తెలంగాణా భాషలో రాసిన కవిత—ఉగాదుర్నొప్పింది. భాషలో వ్యక్తిలో వైచిత్రితప్ప సాధించిన మరేవిజయమూ సాడగట్టడు. 'కళ్ళు తుడుచుకొండి' అనే శ్రీ ఏ సూర్య పకాశ్ కవిత రణభాగాలలో ఒరిగిన వీరునికోసం వగచే అతని మాతృనదువు తల్లీ తమ్ముడూ ఏకాధారగా విలపిస్తూంటే ఓదార్చి పతిత్ప వ్యాపయ్యాన్న కరిశించేది.

శ్రీ ఎం. కె. రాము—అన్నమ సేనమంది ఆకవితో సెవ అనే కవిత శిల్పకద్వారానే అంతరార్థాన్ని అవిష్కరిస్తుంది. వారిదే తెలవారిలీ అనే గీతం కూడా ఉంది. శ్రీ తాళ్ళపల్లి మురళీధరంగౌడుగారి చితి వేపాకి రాసిన లేఖా ప్రక్రియలో సాగిన కవిత. శ్రీ వనమాలి మోసాలు వారుతున్న యువతరంలో మరక్రైన భావాశక్తి కలవాడు. అతని కవితలు రెండూ — కవికి యోగసమాధిలోకి పోవడం ఎంత అవసరమో తెల్పుతున్నాయి. కుమారి వె. శాంతిగారి యువత, బ్రతుకే ఒక భయం అనే కవితలు, పలివెల రామగోపాలరాయలుగారి కవితా పరిపక్వం. కాకుండాకోసి ఊవరగొట్టి బజారున పెట్టిన పిందెలు!

ఇప్పటికే లెక్కకుమించిపోయిన కవితా సంకలనాలద్వారా యువతరం ప్రోది చేస్తున్నవారి—దారికాదు ఎడారి అనిపిస్తుంది! కవితా ప్రియుల అల్మారులను దుర్భరం చేస్తున్న కవితా సంకలనాలలో కొత్తగా వచ్చిన మరో సంకలనమిది అంతకన్నా యిది సాధించే విశేషమేమి లేదు!

—శ్రీ యు భావాన్మణి శ్రీనాథసూరి

# "మమతలు మంచుతెరలు"

[రచయిత : వల్లంపాటి వెంకటసుబ్బయ్య ప్రచురణ : చిత్తూరు జిల్లా రచయితల సహకార ప్రచురణ సంఘం, చిత్తూరు, వెల : రూ 5.00.

* * *

# "అజ్ఞాత బంధం"

[రచయిత : చిట్టూరి ప్రచురణ : నవకళా పిబ్లిష్. అనంట. వెల : రూ. 8.00.]

"మమతలు మంచుతెరలు"లో రంగారెడ్డి పెద్దరైతు తన కెంత ఆస్తిపాస్తులున్నాయో వికరంగా తెలియనంత పెద్దరైతు. ఆయన పేరుచెప్తేనే చుట్టుపక్కల పది వూళ్ళు గడగడలాడ్తాయి. అటువంటి రంగారెడ్డి అతి సామాన్యుడయిన ఎరయ్యకు లోకువ. అతని కూతురు పార్వతిని తన కన్నకూతురులా చూసుకుంటాడు. పెద్ద చదువులూ చదివిసాడు. ఆయన కొడుకు సుధాకర్ పార్వతీ ఒకరి నొకరు ప్రేమించుకుంటారు. ఇంతవరకూ నవల పేరుతో మొదటి భాగానికి చెందినకథ అనవచ్చు.

ఇహ మంచుతెరలు ఆరంభమయ్యే కథ మెలితిరిగి పార్వతీ సుధాకరులు అక్కాతమ్ముళ్ళని చదువరిని దాదాపు నమ్మించేంత పని చేస్తుంది. చివరికి ఆ తెరలు విడి కథను సుఖాంతం చేస్తాయి.

ఈ నవలలో కథ సామాన్యమయినదే అయినా కథ చెప్పినతీరు బాగున్నది. కథను రచయిత తానెన్నుకున్న ప్రాంతీయ వాతావరణానికి చక్కగా అల్లుకున్నారు. పాత్రల మనస్తత్వాలను సహజంగా, చక్కగా పోషించారు. ఇది ఒక చక్కని నవల. రచయితా, ప్రకాశకులు అభివందనీయులు.

రచయితలకు ప్రచురణ సంస్థలు దేవుని వరాలవంటివి ప్రచురణ లేక మరుగునపడిన రచనలు, రచయితలూ ఎందరో వున్నారు. రచయితకు ప్రచురణ ఓ సమస్యయిన యీ రోజుల్లో రచయితల సహకార ప్రచురణ సంఘాలు చేస్తున్న సేవ మిక్కిలి ప్రశంసించదగినది. ఇటువంటి యిట్టి సంఘాలు ఏదోఒక ప్రాంత రచయితల వరకే పరిమితం కాకుండా వుంటే సగటు తెలుగు రచయితకు మరింత మేలుచేసిన వవుతాయి.

* * *

"అజ్ఞాతబంధం" పచ్చిశృంగార, అసభ్యఘట్టాలతో రాయబడిన నో నవల. సెక్సుకు సంబంధించిన ఘట్టాలు రాయడమే యీ నవల ముఖ్యోద్దేశమేమో ననిపిస్తుంది. ఇంతేగాక "సినిమా రంగం తరువాత అవినీతికి, అశ్లీలతకు పట్టుకొమ్మ "వైద్యరంగం" అనేటటువంటి సంకుచిత (యీ పదం వాడొచ్చా) అభిప్రాయాలు కూడా యీ నవలలో వున్నాయి.

"ఆమె జాకట్టును ఫర్ మని చింపేశాడు పరికిణీ నాణీలను

గిరాటువేశాడు. గౌరి గుండ్రని, నిత్యయిన వక్షోజాలు.. మెత్తని, మున్పని ఎత్తుపల్లాలు...అబ్బా...ఆగుభానూ అంటూ బాధతో గౌరి... కార్యసాధనకు పరమ రహస్యమయిన ఆమె పెదవులను, వక్షోజాలను గాఢంగా చుంబించాడు...ఆమెను ఆక్రమించి...నగ్నసౌందర్యపు నడకలలో అదిరిన వక్షోజాలను, కదలిన పిరుదులను... తన్మయుడై ఒక్కొ అంగలో వెళ్ళి''... ... వంటివి నవలలోవున్న సెక్సు ఘట్టాలలో కేవలం కొన్ని మాత్రమె!

భానుమూర్తి పెళ్ళాం మోహిని పెళ్ళికిముందే తనతల్లి ప్రియుల కందరికి తానూ వుంపుడుకత్తెగా వుండడమేగాక, తను కోరినవారితో హాయిగా ప్రతిరాత్రి గడుపుతూంటుంది. పెళ్ళయ్యాక పక్కింటి మహాలక్ష్మితో స్నేహంచేసి ఆమె ప్రియుల నామె యింట్లో కలుసుకుని, చివరికామె భర్తనే తనవైపు తిప్పుకుంటుంది. పెళ్ళికి ముందే గౌరి అనే అమ్మాయి యౌవ్వనాన్ననుభవించి, కొన్ని భగ్న ప్రేమలు రుచిమాసిన భానుమూర్తి చివరికి సన్యాసులలో కలిసిపోతాడు.

ఈ నవలఖరీదు మాత్రమెనిమిదిరూపాయలు.

— పాలాక్షుడు

# రెండు కవితా సంపుటాలు

## 1. ధార :

ఆకొండి వెంకటరత్నం.

మొదటిమాపులో ఇది అసిధార అనుకొన్నా-చదువగా ''జీవన సమీరం''లో ఆనందరసధారఅని తెలింది. అట్టమీదబొమ్మ — ఆశాతోదరి, రెక్కలుగల గాంధర్వియో మిడిగుడ్లగూబో తెలియడంలేదు. ఇద్దరు సహృదయులు — ఒక కవి, ఇంకొక పండితుడు ఈ కవితకు వ్యాఖ్యానాలు చెపుతున్నారు. గుంటూరు శేషేంద్రశర్మ— ''కవిత్వంలో వస్తువు ఒక చారిత్రిక సందర్భశుద్ధి ఉన్నదయితే అది ప్రయోజనాత్మకం అవుతుంది'' అని, ''ప్రజ్ఞ పరిణతమైనప్పుడు బుద్ధి కౌశలం హస్త కౌశలంగా మారుతుంది'' అని నిలబడే నిర్వచనం చేసినారు. అంటే—భావముంటే భాష వెన్నాడి వస్తుందనుట. ఇది తెలిసాటేగదా ఇప్పటి చాలా రచనలోని మర్మము పులుముడు! ఈకవి ఏ జెండాగాని ఎత్తని వాడని అంటాడుగాని శర్మ, మామూలు ఆకలి జెండా ఈయన కవిత్వంలో రెపరెపలాడుతూనేఉన్నది.

శ్రీ అమరేంద్ర — ''నాజూకుగాఉండే తీగలు గలిగిన వీణ గాలి అలలకు కదిలి, తనంతటు తానే రాగాలాపన చేస్తుంది... ఉద్విగ్న చైతన్యంనుంచి ఉబికివచ్చే ఉద్రిక్త భావాలే కవిత్వం'' అని చక్కటి వ్యాఖ్యానం చేసినారు. ఆ అర్థం ఈకవికి సరిపోతుంది. ఇప్పుడు ''కమిటెడ్'' కవులు నిరాశతో అభిశాపాలు కురిపిస్తుండగా, అమరేంద్ర ధైర్యంగా ''శుష్క రాజకీయ నైతిక సిద్ధాంతాల ప్రతిపాదనవల్ల కవికోరుకొన్న ప్రయోజనం నెరవేరదు; రసార్ద్రమైన హృదయాలలో మైత్రీ బీజాలు వెదజల్లి బంగారుకలలు పండించే కర్షకుడు కవి'' అని, ఆరోగ్యకరమైన మానసిక తత్వాన్ని భావిస్తున్నాడు —

ఈ రచయిత మంచి భావాలు ఉత్ప్రేక్షలు గలిగి వాటిని అందమైన నుడికారంతో అలంకరిస్తున్నాడు. మొత్తమ్మీద వృషభరాజు గమన గాంభీర్యమున్నా, కొన్ని శీర్షికలు భావాన్ని అంతు పట్టనీయడంలేదు. చాలా పదబంధాలలో పూపుఉన్నది. కాని, కొన్నిటిలో ఆయన పొందిన రసానుభూతి పాఠకునికి పూర్తిగా దక్కటం లేదు.

గ్రంథకర్త భాషాఖనినుండి త్రవ్వి తీసిన కొన్ని జాతిరత్నాలు:— నిబిడాంధకార మనోమందిరాలు; అమాయకత్వాన్ని వంచించి బంధించే సాశెగూళ్ళు; పూలసౌరభాల ఒడిలో నేలరాలే వెన్నెలల తడిలో; చిల్లులుపడిన కోర్కెలబావి; జలతారు కలలు; ఆకాశపు నల్లచీరలో దూరే రాత్రి రాణులు; తిరిగిన నత్తగుల్లలు గొప్పలు చెప్పుకొంటూ; గురివింద చేతలు; విస్మృతిలోకి వెళ్ళబోతున్నట్లు తెలియని కోడిపుంజు కూస్తూనేఉంది; రాత్రి మబ్బులతో తారలను మూటగట్టి దాచుకుంది; సిగ్గు మరక ఇంద్రధనుస్సు—మొదలైనవి.

రాతి బెడ్డలు? మట్టివిగదా బెడ్డలు; రాతివి పలుకులు. అంకితం ''అమ్మ''కు సరే! ఆమెపేరుకు మరుగేలనయ్యా.

[ సైజు-డెమ్మి; పేరటలు 76; ధర రు. 5/— ప్రతులకు: సామాన్య ప్రచురణలు, పిఠాపురం-533450. న్యూస్టూడెంట్సు బుక్ సెంటర్, ఏలూరురోడ్, విజయవాడ-2. ]

## 2. అక్షర శిల్పాలు :

పైడిరాజు.

ఒక చిత్రకారుని కుంచె కలమై వికసించిన కవనమిది. వివిధ లలిత కళాతపస్వి — సంజీవదేవ్‌గారు ''బొమ్మల కవితలు'' అనిన పరిచయ వాక్యాలలో— ''కళాప్రవృత్తి వివిధాకృతులలో కొందరిలో ఆవిష్కృతి నొందుతుంది'' అంటూ ఒక చక్కటి నిర్వచనం చేస్తున్నారు; చదవండి:— లయస్పందిస్తే మనిషి కళాకారుడౌతాడు. అందరూ ఒకే విధమైన కళాకారులు కారు. ఒకరు కవి, ఇంకొకరు గాయకుడు, మరిఒకడు చిత్రకారుడు, ఇంకొకడు వర్తకుడు. అన్నీ అందరిలో వ్యక్తంగావు. కాని, కొన్ని కొందరిలో ప్రత్యక్షమవుతవి.''

''కవిగాని వాని కవితలుగూడ కవిత లనిపించుకొనే యుగం ఇది'' అని సంజీవదేవుని కొరడాదెబ్బ — అవును! ఇది ''ఖణముల ముతాల'' ఫలితం, ''కవిగానీ వాని వ్రాతయు, నవరసభరితములుగాని వాతుల వలుపుల్'' అన్నాడుగదా సుమతి శతకంలో బద్దెన.

పైడిరాజు ఇంతవరకు చిత్రకారుడు మొదట గ్రామీణ చిత్రాలుగీచి ఇప్పుడు abstract (ప్రకృతికి భిన్నంగా భావకల్పిత దృశ్యాలు) లోకి దిగుతున్న నవీన చిత్రకారుడు. చిత్రకారుడుగా ఇంటా బయటా పేరుపొందినాడు. అన్ని గీచినచేయి ఊరుకుండలేక కవిత్వంలోపడినది. కాబట్టే ''నా శరీరం ఒక కళాకేంద్రం'' అని

చెప్పకోగలిగినాడు అయినా కవితలో మర్మధోరణి అస్పష్టత వదల కుండా అంటుకొని ఉన్నవి. ఈయనకు ఇంగ్లీషు శీర్షికల పిచ్చిగూడా కాస్త ఉన్నది. వీరు ఇంగ్లీషు వాస్తే అందులో తెనుగు దూరుస్తారా? ''ఎంగిలి పాత్తర్లు నా కవిత'' అంటే దొంగకూడు కుడిచిన వరుకు అనేనా? ఇది చెప్పకోదగినంత ఘనతా ఏమిటి? అయినా, పొరట క్రింద క్రింద వేసిన హాస్యరచనలు సొక్కులుగా ఉక్తి వైచిత్ర్యం కలిగిఉన్నవి. అందుకొన్ని :— దరిద్రం చిరుగుల్లో దాక్కుంది, ఐశ్వర్యం మెరుగులలో దాక్కుంది; మంచి మాటలతో వంచిస్తాడు, మర్యాదలతో మోసగిస్తాడు, ఇదే పెద్దమనిషి లౌక్యం (క్యం?); తిరుగులేంది పెరుగుగాదు (తోడు=చేమిరి) పూలవన్నె వేరుపూజ ఒకటే అని చెప్పిన వేమన ధోరణిలో ఈ అద్వైతభావం బాగున్నది: రంగస్థలం ఒక్కటే నాటకాలు ఎన్నో, దేవుడు ఒక్కడే దేవాలయా లెన్నో. ఈ ఎత్తిపొడుపు చూడండి:— దేవుడు వజ్ర వైడూర్యాలు ధరించేడని ఇనుప పెట్టెల్లో బంధిస్తారు. చోరుడు వజ్రహారాలు హరించాడని ఇనుపకొట్టులో బందిస్తారు. సింహం జంతువులను చంపి ఆహారాన్ని తింటుంది కాని, చచ్చిన జంతువులను ముట్టుకైనా ముట్టదు, నరుడు జంతువులను చంపి ఆహారాన్ని తింటాడు.

భక్తికి ఆధారం ముక్తి అంటాడు-కాగితానికి ఆధారం బొమ్మ అన్నట్లున్నది.

[సైజు: డెమ్మీ, 42 పేజీలు; వెల: రు. 2/- ప్రతులకు — అంట్యాకుల పైడిరాజు, చిత్రకళాశాల, ఎన్నీరువీధి; విజయనగరం-2.]

## కొత్త పాళీలు

[వచన కవితా సంకలనం. సంకలనకర్త-బులుసు వెంకట కామేశ్వరరావు; క్రౌన్ 110 పేజీలు; ధర రు. 4/-; ప్రతులకు ప్రగతి పబ్లిషింగ్ హౌస్; ఏలూరు రోడ్, విజయవాడ.]

గుంటూరు సాహితీ సమితివారు యీ సంకలనం ప్రచురించి, యువక కవులకు ప్రోత్సాహమివ్వడం భాషాసేవలో ఒక ముఖ్య ఘట్టం. రచయితలకు వ్రాత ఒరవడి కుదరను ఇవి అభ్యాస సాధనాలవంటివి. ఈ గ్రంథం వివిధ బాణీల వారికి ప్రతినిధిగా ఉన్నది. ఇట్టివి అన్ని గూడ చదువుల దేవికి అలంకారాలే!

కొత్త పాళీలు కొత్త కవుల సాధన క్రమంలో చేరినవి; అందు వల్లనే పేరు బాగా కుదిరినది. అనగ అనగా కదా రాగ మతిశయిల్లేది. ఈ రచయితలకు మంచి భావుకత ఉన్నది. పరిచయ వాక్యాలలో చెప్పినట్లు, నిరాశపడక సంఘ శ్రేయాన్ని అభిలషించడం ఆరోగ్యకర దృక్పథం. ఇందు కొందరు వగటి కలలు గని భగ్న హృదయులై పరితపించేవారుగూడ ఉన్నారు; వారిని కాలమే ఓదార్చగలదు. కవిత్వం సాధనచేసి, రచనకు పదును ఎక్కించుకొని భాషాసేవ చేయగలరని ఆశ కలుగుతున్నది అందరూ వ్రాసింది ప్రచురించాలంటే ఎన్నో పత్రికలు, ఎన్నో టన్నుల కాగితం కావలసి ఉంటుందిగదా. అభ్యాస రూపమైన కవిత్వాన్ని ప్రచురించక పోయినంత మాత్రాన మునిగి పొయ్యేదేమిలేదు. పుస్తక సంకలనాలన్నిగదా. కొత్త కవికి తాను వ్రాసింది అచ్చులో చూస్తే ఒక ప్రోత్సాహం సత్తువ కలిగేది నిజమే. ఇప్పుడు అచ్చుయినవన్నీ నిగ్గయినవనికాదు; పాఠకులే జల్లెడపట్టి గట్టి గింజలు తేలుస్తారు—నిలువ గలిగినవి నిలుస్తవి.

ఇందు కొన్నిగీతాలలో భావము నుడికారము తొంగిచూస్తున్నవి. వీరందరి రచనలు గడిదేరగలవనే సూచనలు ఈ పంక్తులలో ఉన్నవి. ''ఎదిగిన మనుష్యులలో నీతి కరి మింగిన వెలగపండు'' (సరిగమలు) అంటాడు, బాగున్నది. సుమతి శతకంలోని ఈ ''కరి''కి ఏనుగని అర్థంగాదు, కరి అంటే నల్లటి బూజు తెగులని చాలామంది పండితు లంటారు. ''ఏమి సమర్పింపగా గలను అమూల్యమైన నీ పాద పద్మాలకు? నిర్మలమైన ఈ పదజాలిక మాలికదప్ప'' (కవితా మాలిక) అన్నదానిలో మంచి నుడికారము సమత ఇమిడిఉన్నవి. ''కడుపుమాడుతుంటే కవిత్వం వస్తుందనుకొంటావా?'' (కవి నవుదామనుకొంటే) అంటాడు. మంచి కవిత్వం ఆర్తిలోగూడ వస్తుందయ్యా! ఆవేశానికి సుఖదుఃఖాలు రెండూ సమ ఫలాలే. దీనికి ఉదాహరణం— ''కవిరాజు కంఠంబు కవుగిలించెనుగదా పురవీధి నెదురెండ బొగడదండ'' అన్న శ్రీనాథుని దుఃఖరస పూర్ణ పద్యాలే ''ప్రతి రాయిలోను ఒక శిల్పం ఉంది'' (శేషపత్ర) అన్నది నిత్య సత్యము-ఉదాత్త భావము; రసానుభూతికి మంచి నిర్వచనం. దీనిని రసానుభూతి సంస్కారబుద్ధితో చెప్పతున్నాడు. ''కార్య సాధనకు పట్టుదల కావాల'' నడం కార్యాచరణ విధానం (కార్యవాది) పట్టి పట్టేగాదు, తలగూడా కావాలగదా. మన సంప్రదాయ శీర్షిక మంచి ఎత్తిపొడుపు వ్రాత.

ఇటూ మొత్తంమీద చాలా ఖండికలు ఆయా రచయితల మంచి భవిష్యత్తును సూచిస్తున్నవి. వ్రాయండి, మెరుగులు దిద్దుకోండి విలువగలిగిన వాటిని చదివి ఆనందిస్తుంటాం. మనగలిగినవి మని ఉండగలవు.

— శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి

# రాజకీయ అనవగాహన

[రచన: శ్రీ నరసింహారావు ప్రచురణ: "కమెండో" వారపత్రిక ఎల్. బి. స్టేడియమ్, హైదరాబాద్ 500001 వెల: మూడురూపాయలు]

"రాజకీయ అనవగాహన", "బూటకపు సోషలిజమ్" "ప్రజాస్వామ్యం సోషలిజం ఒకచోట పొసగవా" వంటి దాదాపు ముప్పది వ్యాసాల సంకలనం ఈ పుస్తకం. ఈ రచయితలో వర్తమానం గురించిన అసంతృప్తి, ఏవగింపు గూడుకట్టుకొన్నవి. కనుకనే చాలా మృదువు, సరళంగా చెప్పడానికి వీలయిన అంశాలను కూడా కటువుగా ఘాటు ఈ వ్యాసాలలో చెప్పడం జరిగింది. ఘాటుగా చెపితేగాని చదవరనే అభిప్రాయం ఇలా వ్రాయడానికి కారణం కావచ్చు. కాని అది సరయిన అభిప్రాయమని అనిపించుకొనజాలదు.

అవగాహనము అనగా ఇంగ్లీష్‌లో **immersion, bathing, Comprehension** అని, తెలుగులో తెలియడము ఆకళింపు అని పదకోశం చెబుతున్నది కాగా అనవగాహన అనగా అర్థం చేసుకొననట్టి అర్థంకానట్టి అని సిద్ధాంతం. అవగాహన అనే పదంతో రాజకీయ అనే పదం చేర్చి రాజకీయ అనవగాహన అని ఈ వ్యాస సంపుటికి ఈ రచయిత పేరు పెట్టారు.

రాజకీయ అనేమాటకు వాడుకలోవున్న నిర్వచనం ప్రభుత్వపరమైన అర్థంలో 'పొలిటికల్' **POLITICS** అనగా ది ఆర్ట్ ఆఫ్ పాలిటిక్స్. అవగాహనకు బదులు అనవగాహన అనే పదాన్ని ఈ రచయిత ప్రయోగించిన కారణాన శీర్షికను గురించి ఇంత చర్చించవలసి వచ్చింది. రాజకీయశాస్త్రంతో అంతో ఇంతో సంబంధం వున్నవారందరూ, అందరకూ అర్థమయినట్టు తోచి, ఎవరికీ అనుభవంలో తెలియని విషయంగా వుంటుందని అంగీకరిస్తారు. కాగా సామాన్యులకు విద్యావంతులకు, మేధావులకు రాజకీయాలు అర్థంకావడంలేదని, కాలేదని విమర్శించడంలో రచయిత లక్ష్యమేమిటో మరి!

వర్తమాన రాజకీయాలలో ఒక పక్షాన్ని అధికారంనుంచి తొలగించే కృషిలో సామాన్యులు, మేధావులు, విద్యావంతులవంటివారు సహకరించడంలేదు కనుక వారికి రాజకీయ అవగాహన లేదని అనడం ఈ రచయిత లక్ష్యమయితే అది తప్పని ఆరవ లోకసభకు జరిగిన ఎన్నికలు రుజువు చేసినయ్. రాజకీయాలు, వైద్యం, జోస్యం తెలియని వారెవరు? అని తెలుగునాట ఒక సామెత వున్నది. నేను వూహిస్తున్న రాజకీయాలలో ఎవరూ కలిసిరావడం లేదుకాబట్టి రాజకీయ అవగాహన ఎవరికీ లేదని అనడంలోనే వస్తున్నది చిక్కంతా.

వాస్తవానికి ప్రభుత్వాధికారం లేకుండా రాజకీయాలలో పాల్గొనడం అసాధ్యమూ కాదు, అపూర్వమూ కాదు.

అది అలా వుండగా పాఠకులపట్ల ఈ రచయితకు సదభిప్రాయం లేదని మొదటి వ్యాసంలోని మొదటివాక్యం ఉన్నత విద్యావంతులు సైతం ఈ దేశంలో "మాకు రాజకీయాలు తెలియవు. మాకవి తెలుసుకోవడంలో ఆసక్తిలేదు అని చెప్పుకోవడానికి సిగ్గుపడడంలేదు" విశదం చేస్తున్నది డాక్టర్లు, ప్రొఫెసర్లు, సాంకేతిక నిపుణులు, న్యాయవాదులవంటివారు రాజకీయాలలో పాల్గొంటున్న సంగతి ఈ రచయితకు తెలియదా? లేక ఏమీ తెలియకుండానే ప్రొఫెసర్ వాజపేయ్ శ్రీయుతులు శాంతిభూషణ్, ప్రొఫెసర్ హిరేన్ ముఖర్జీ వంటివారు రాజకీయాలలో పాల్గొంటున్నారని ఈ రచయిత అభిప్రాయమా? ఈ రెండు అభిప్రాయాలూ తప్పే.

ఒక పద్ధతి ప్రకారం కాకుండా, దారం తెగిన గాలిపటం వంటి ఆలోచనలను కాగితంమీద కెక్కిస్తే అదంతా పరస్పర విరుద్ధమైన వాక్యాల సముచ్చయంగా తయారవుతుందని మొదటి వ్యాసంలోని రెండవ వాక్యం— 'వర్తమాన రాజకీయ వ్యవస్థలో ఇటువంటి దౌర్బల్యాలన్నీ గూడుకట్టుకు వున్నమాట వాస్తవం." విశదం చేస్తుంది. దౌర్బల్యాలు వున్నాయని ఒక చెంప అంగీకరిస్తూ మరొక చెంప అవివున్న రాజకీయాలపట్ల ఎవరూ ఆసక్తి చూపించడంలేదని విమర్శించడం హేతువాదమా? లేక మరేమిటి?

ఈ రచయిత అంతటితో పాఠకులను వదిలారా! లేదు. "వీటన్నింటినీ మించి ప్రజలందర్నీ శాసించగల ప్రతిరంగాన్ని ప్రభావితం చేయగలశక్తి నేడు ఆధునిక రాజకీయరంగానికి వుంది" అన్నారు. ఇదేమి వాదనా పద్ధతో తెలియటంలేదు. రాజకీయాలకు గొప్ప శక్తి ఏదో వున్నదని ఒక చెంప అంటారు. నేటి రాజకీయ వ్యవస్థలో ఏవో దౌర్బల్యాలు కలవని మరొక చెంప అంటారు. పైగా అదంతా విద్యావంతుల అజ్ఞానమట. ఇలాంటి అభిప్రాయాలకు కారణం కసి, నిరాశ, నిస్పృహ అని విజ్ఞులు భావించడంలో తప్పేమీ కన్పించదు. రాజకీయ అవగాహన అంటే తన నిర్వచనమేమిటో ఈ వ్యాసంలో ఈ రచయిత చెప్పలేదు. కాని రాజకీయ అవగాహన లేనివారిని బాధ్యతగల పౌరులుగా ఈ రచయిత గుర్తించలేదట. రాజకీయ అవగాహన అంటే ఏమిటో స్పష్టంగా చెప్పి, ఆ తర్వాత అది లేనివారిని విమర్శించివుంటే ఈ రచయిత కృషి కొంతలో కొంతయినా ఫలించివుండేది.

తాను ఆశించిన తీరున వ్యవహరించని వారందరికి రాజకీయ అవగాహనలేదని అనడం ఒకరకం ఆత్మాతిశయంగల వారి లక్షణం. అట్టివారిని ఇంగ్లీష్‌లో నార్సిస్ట్‌లని (Narcists) అంటారు. ఈ రచయిత ఒక్కరేకాదు. పరిణామ వాదమంటే ఏమిటో పూర్తిగా తెలియని పెక్కుమంది భారత రాజకీయ వాదులు రాజకీయ రచయితలు— ముఖ్యంగా తెలుగు రచయితలు ప్రజలను ఇలా తెగ వాడుకునే వున్నారు. ప్రజలకు దూరం అవుతూనే వున్నారు.

ఈ పరిస్థితులిక ఇంతేఅని ఈనాడు ఎవరూ అనుకొనడం లేదని లోక్‌సభ ఎన్నికల ఫలితాలు రుజువుచేశాయి. కాబట్టి ఈ రచయితనే పాఠకులు క్షమించవలసి వుంటుందేమో?

"నీకున్న ప్రత్యేకావకాశాలకు ఈ సమాజ శ్రేయస్సుకై ఎలా

వినియోగిస్తు న్నానన్నది ప్రతి ఒక్కరినీ వేధించిన ప్రశ్న. స్వార్థంతో సుపీరియారిటీ కాంప్లెక్స్‌తో కుమిలేవాడు ఎన్ని శ్రీరంగనీతులు చెప్పినా బూటకపు సోషలిస్టే'' అన్నారు ఈ రచయిత 13వ పేజీలో. అందుకు ఈ రచయితయే నిదర్శనమేమోనని ఈ వ్యాసాల ధోరణి వల్ల అనిపిస్తున్నది.

''సోషలిజం అంటే నియంతృత్వంకాదు'' అన్నారు ఈ రచయిత 15వ పుటలో. ఇలాంటి నిర్ణయానికి ఈ రచయిత రావడానికి దోహదపడిన అంశాలేమిటి? ప్రజాస్వామ్యం అంటే ప్రజల పరిపాలన. ప్రతినిధుల పరిపాలన కాదు. సోషలిజం అంటే సంఘపరం చేయడం-అంటే అధికార కేంద్రీకరణ. ఈ రెండింటికీ పొసగగలదని చెప్పడం వాటిల గారడీయే తప్ప మరేమీ కాదు. చరిత్రలో రుజువయింది. పెక్కు గ్రంధాలనుంచి అనేక అంశాలను ఉటంకించిన రచయితకు ఇంత చిన్న విషయం తెలియకపోవడం విచిత్రంగా వున్నది.

'అల్టిమేటివ్ ట్రూత్' (19వ పుట) అనేమాట శుద్ధ తప్పు. అల్టిమేట్ ట్రూత్ అనాలి.

ఎమ్. ఎన్. రాయ్ ఏమి చెప్పాడో పూర్తిగా గ్రహించకుండా ''ఆర్థిక, సామాజిక, రాజకీయ ప్రతిబంధకాల్ని ఛేదించడమే స్వేచ్ఛగా పేర్కొంటారు (41వ పుట) అని సూక్ష్మీకరించడం శుద్ధ పొరపాటు.

పోతే ''హాస్యాస్పద వ్యక్తులు'' ''ఎందుకాభయం'' ''రాజకీయాల్లో అవినీతి-బంధుప్రీతి'' వంటి కొన్నివ్యాసాలు కొంత బాగున్నాయి. ఈ వ్యాసాలకు అటు రాజకీయవిలువాలేదు. ఇటు సాహిత్యవిలువలూ లేవు. ప్రయత్నిస్తే ఈ రచయిత ఈ విషయాలనే ఇంతకంటె బాగా వ్రాయగలడు. వ్రాస్తారని ఆశింపుదాము.

— "శేషు"

## జీవనసమరం (నవల)

[రచన: శ్రీమతి హాజరా. పుటలు: 196. వెల: రు. 7-50. ప్రచురణ: శ్రీకవితా పబ్లికేషన్సు, ఏలూరురోడ్డు, విజయవాడ-2]

మధ్యతరగతి కుటుంబాల్లోని ప్రతి జీవికీ యీనాటి రోజుల్లో జీవితం ఓ సమరమే. ఆ జీవిత సంద్రంలో ఆటుపోటులు తట్టుకుంటూ, తీరాన్ని చేరేవ్యక్తులకే విజయం లభిస్తుంది. ఈనాడు వచ్చే నవలలన్నిటికీ యించుమించు యిదే కథావస్తువు. అయితే దాన్ని సానపెట్టిన వజ్రంలా కాంతిని పాఠకులకు చూపటం అనేది రచయిత ప్రతిభా వ్యక్తిత్వాలపై ఆధారపడి వుంటుంది. బాల్యంనుండి కమ్మని మధురోహలతో పరస్పరం పెనవేసుకొని, భావి బంగరు జీవితాన్ని గూర్చి కలలుకన్న యిద్దరు మిత్రురాండ్ర మనోహర కథనం యిది. హాయిగా ఉల్లాసంగావుండే సవతితల్లి పోరుతో వెతలు పడుతూ, మనసులు కలుపుకున్న నీరు జీవితాంతం కలిసే వుంటారు. శాంతి, సుశీల అనే యీ యిద్దరికి పరిస్థితులు వాటంతటవే అనుకూలిస్తాయి. ప్రేమతో ముందితేల్చే అన్నలూ, స్నేహితులు, పరిచయస్థులు పుష్కలంగా తారసిల్లుతారు. ఆరంభంలో వారనుభవించిన కష్టాల కడలిని యిట్టే దాచుకుని ఆ మంచుతెరల చీకటినుంచి ప్రభాతాన్ని దర్శిస్తారు. సుశీల పాత్ర మరికొంత ముందడుగువేసి మతాంతర వివాహంకూడ చేసుకుంటుంది. శాంతిమాత్రం భర్తతో శారీరక సౌఖ్యంవినా తక్కిన సుఖాలందుకుంటుంది. 'మరో ఆక్సిడెంట్' కారణంగా చివరకు ఆ శాంతికూడ ఆమెకు లభించి, ఆమె అశాంతి పోతుంది. అంతవరకు కథాగమనాన్ని సాగించటానికి విజయ, శారద, సురేష్-యిత్యాది యెన్నో పాత్రలు, సంఘటనలు కలగా పులగంగా పేర్చబడి పాఠకుణ్ని అక్కడక్కడ కొంత తికమక పెడతాయి. నవల సుఖాంతం చేయటానికి కావాలని పేర్చబడ్డ యీ పాత్రలవల్ల నవలకు 'డ్రాగింగ్ ఎఫెక్టు' వచ్చిందనటం యదార్థం.

తెలుగింటి ఆడబడుచులు వుల్లాసంగా చదువుకోవటానికి కావలసిన వదినా మరదళ్ళ చమత్కారాలు, నూతన దంపతుల శృంగార కాండలు; అంతలోనే గంభీరమైన పదవిన్యాసాల సెంటిమెంట్లు—ఇత్యాది ఫార్ములా పద్ధతులన్నీ యిందులో ముక్కాయింపుగా బాగనే వుంటాయి. ప్రారంభంలో పరిచయం చేసిన సుశీల తల్లిదండ్రుల కథనం అంతాన రచయిత్రి వదలివేయటం పరాకా లేక వారిపట్ల చిరాకా?...తోచదు.

''కన్నెవాగు కడలి తరంగాల్లో ఐక్యమైంది'' అన్న ధ్వన్యాత్మకమైన శాంతి భవితవ్యం రచయిత్రి చెప్పేటంత వరకూ ఆ పాత్ర పాఠకుల సానుభూతిని చూరగొంటుంది. ''వివాహం అనేది పూలబాట అనీ, విధి వక్రించి అది ముళ్ళదొంక అయితే తెలివిగా ఛేదించి పూలు పరుచుకోవాలి'' అనే అందమైన సందేశం ఆ పాత్ర యివ్వటం సముచితంగానే వుంది. ప్రారంభంలో కథానాయిక సుశీల అని భ్రమపడ్డ పాఠకుడు, ఆమెను గడుసరి సాహసరిగా మాత్రమే అర్థం చేసుకొంటాడు కాని ఆమె మనస్తత్వ భావాల ప్రభావం పొందలేడు. దంపతులను సాకుగా చేసుకొని వారి శృంగారపు పలుకుబళ్ళను కొంత

'ఆశ'గా చెప్పటంకూడ ఔచిత్యం అనిపించుకోదు. ఆశల శిఖరాలతో ప్రారంభించి నైరాశ్యపు లోయలోకి వెళ్ళినవారి జీవితాలను కళ్ళకు కట్టినట్లు రచయిత్రి వర్ణించారు. వాస్తవికత చాలవరకు లోపించటం, కథాకథనంలోవున్న మందకొడితనం మరినవలల్లో మార్చుకొంటారని ఆశిద్దాం. జీవితానుభవాలు పొందబయ్యే భావుకుల కొక రంగుల కలగా వుంటుందీ నవల.

# వీ ధి మ ను షు లు (నవల)

[ రచన: మురయా. పుటలు: 185. వెల: రు. 7-50. ప్రచురణ: శ్రీ కవితా పబ్లికేషన్సు, విజయవాడ 2 ]

వీధిమనుషులు అనే యీ నవల వీధి మనుషుల్లాంటి వారి శృంగారపు వీధిభాగవతాలతో నింపబడ్డ నవల. సమాజంలోని విభిన్న వర్గాల పిక్చు మనసులను, సంచుమించు నగ్నంగానే చూపెట్టినారిందులో. రంగమ్మలాంటి వ్యక్తుల మానసిక వ్యభిచారానుభూతి, తత్ఫలితంగా ఆమెకు కలిగిన కుమారుడు గంగరాజు యిందులోని కథానాయకుడు. చూపులకు మగవాడైనా ఆడవారిచేతుల్లో ఆట బొమ్మగా అతన్ని ఆడించటానికి ఎన్నో కల్లోల కడలిలాంటి సంఘటనలు కూర్చబడ్డాయి. ఆరంభంలో బాగా పుంజుకున్న కథకు మధ్యకు వెళ్ళేసరికి స్తబ్దత వస్తుంది. పాత కథల్ని ఫ్లాష్‌బాక్‌ద్వారా చెప్పినా అవి పేలవంగానేవుండి పాఠకుడికి అనునయం కలగదు. చివరలో హడావుడిగా ఆరంభ సన్నివేశాల్ని గుర్తుకు తెచ్చుకొని ముగించినట్లనిపిస్తుంది. ఈ నవల ఆద్యంతం చదువరికి ఏకప్రసుతమైన అనుభూతి నివ్వదు. జమీందార్ల యిళ్ళలో జరిగే సెక్సు, సంపదల వేరాలు, పేదలపై వాటి ప్రభావాలు విస్తరించి చూపారు రచయిత. కాని రాజావారు యే దైహిక కాంక్ష లేకుండా రంగమ్మపై అంతటి అయాచిత కరుణా కటాక్షాన్ని చూపటం అంత 'కన్విన్సింగు' గా వుండదు. ఆయనొక దేవతా స్వరూపునిగా పాఠకుడు తరిపెట్టుకోవాలి. చివరలో ఉష, శాంత, రాజారావుల కథనంలో వేగం మితిమీరి, పాఠకునకు డిటెక్టివ్ నవల పోకడ కనిపించి, కొంత గందరగోళ పడతాడు. అదీ దివాన్ ద్వారా రంగమ్మకు చెప్పించటంలో సన్నివేశాల బలీయత బలి అయింది.

ఆరంభంలో మురయాగారి లేఖిని శృంగారవీధిలో నర్తించింది. అందులోని విచ్చల విడికి మచ్చుకు కొన్ని... "అతన్ని బాహువుల్లో బంధించి గట్టిగా పొదివిపట్టుకొని... ప్రయత్నించింది. కఠిన వక్షోజాలు అతని రొమ్ముకు ఒరుసుకున్నాయి. కౌగిలిబరువు ఎక్కువచేస్తూ అతని అరికాళ్ళను నొక్కుతూ, తన కాలివ్రేళ్ళను ఎత్తి, అతని మెడ బలంగా ముందుకువంచి...ముద్దు పెట్టుకున్నది. తలవెనుక అరచేతితో అదిమి ముందుకు నొక్కుతూ. గట్టిగా, కసిగా అతని పెదిమలను ముద్దాడింది......" ఈ ధోరణిలో పేజీలకు పేజీలే సాగిపోతూ, యీ నవలలో హద్దులు మించని శృంగారం వుందన్న అట్టవెనుక మాటను 'జోకు'గా నవ్విస్తుంది. దొం... లం...లాంటి బూతు పదాల ప్రయోగం ఇందులో అసంఖ్యాకం. వీధిమనుషుల్ని వర్ణించేటప్పుడు మరి భాషకూడ బజారుపాలుగానే వుండాలనే అభివాస్తవికతకు యీ నవల లక్ష్యం - రచయిత వీటిలోని పాత్రలద్వారా సమాజానికందించిన నీతియేమిటో తెలియదు. శాంత, ఉష, - ఇత్యాది పాత్రలు మనసు మార్చుకొన్నవైనంకూడ చదువరికి గోచరించదు. ఒకవేళ స్వైర విహారం తప్పని వాళ్ళు గుర్తించినా, చివరలో యే కొద్దిగానో చెప్పబడ్డ ఆ తీరు, వ్యాడు మప్పాతిక పాళ్ళు నవలలో వీధి మనుషుల స్వైర విహారం దర్శించిన పాఠకుడికి తృప్తి నిస్తుందా అనేది నా సందేహం. 'మురయా' లాంటి ప్రతిభావంతుడైన రచయిత యీవిస్తృతమైన నవలతో పాఠకులను నిరుత్సాహపరచారని చెప్పక తప్పదు. ఈ వీధి మనుషుల్నే మరింత సభ్యతా శైలిలో పాఠకుల ముందుంచే ప్రయత్నాన్ని చిత్తశుద్ధిగల యీ రచయిత విస్మరించటం శోచనీయం.

— "సుచంద్ర"

**Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones 75667 & 75226.**